# ఆంధ్రపత్రిక

సచిత్ర వార పత్రిక




30-9-53

4 అణాలు

ANDHRA PATRIKA ILLUSTRATED WEEKLY

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.




సంపుటము 46
సంచిక 4
30-9-53

సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

విజయ భాద్రపద బహుళ అష్టమి బుధవారం

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : ఆంధ్రరాష్ట్ర అధికారముద్ర
రాష్ట్రావతరణం—కన్నెకంటి వీరభద్రాచార్యులు I
ఆంధ్రజాతి భాగ్యోదయం— II
ఆంధ్రమహాసభ— III
రాష్ట్రభవితవ్యం—తెన్నేటి విశ్వనాధం 3
కాలక్షేపం-దాసు వామనరావు 4
ఆంధ్రుల చరిత్ర—భట్టిప్రోలు హనుమంతరావు 6
ఆంధ్రలో రాజకీయోద్యమాలు-వావిలాల గోపాలకృష్ణయ్య 8
కల్లోలగౌతమి—మునిపల్లెరాజు 11
జారుడు మెట్లు—వాసమూర్తి 12
కమలా-విమలా—కొమ్మూరి వేణుగోపాలరావు 24
విజ్ఞాన వీధులు—"డాక్టర్" 26
తెలుగుబిడ్డ—మునిపల్లె రాజు 30
ముచ్చటగా ముగ్గురు—జెరోమ్ కె. జెరోమ్ 31
మైనపుతేలు—పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి 36
దాగుడుమూతలు—పి. సీతాపతి 38
జోతలు—బొడ్డు బాపిరాజు 38
చిన్నన్నయ్య సైకాలజీ—వై. కొండలరావు 40
అవమానం—బి. వెంకటరత్నం చౌదరి 41
సినిమా 44
ప్రశ్నలు-సమాధానాలు 48
సంధి-విగ్రహం—విశ్వాత్ముల నరసింహమూర్తి 50

# రాష్ట్రావతరణం

కన్నెకంటి వీరభద్రాచార్యులు

**1**

తెలుఁగున్ దల్లి వరాల గద్దియలపై దీపించు బంగారు రో
జులు గన్పించును నేటినుండి - కవిరాజుల్ పల్కు ముత్యాలపం
టలఁ బండింతురు భావగోళములు నిండన్ - గాఢుఁజీకట్లు వె
న్నెలలై పోవును భారతీ మధురవాణీ క్వాణముల్ మ్రోఁగఁగన్.

**2**

కలుగున్ భాగ్యము - కారు రేగడులు మాగాణమ్ములై కోమలా
మలరూపమ్ములఁ దాల్చి తీయనఁ జిమ్మం గల్గు భాస్వన్నదీ
జలముల్ గ్రోలుచు రాజనాల నురలించన్ జాలి బంగారు తీ
గల నీ గాదెలనింప నున్న యవి భోగ్యస్థాయిఁ జేకూర్పఁగన్.

**3**

అదిగో! ఆంధ్రసవిత్రి గద్దెపయి సాహ్లాదంబుతో నెక్కుచు
న్నదిరా! బిడ్డలఁ జేరఁ బిల్చుకొని - యెన్నాళ్లైనదో స్వీయసం
పదలన్ గోల్పడిపోయి - నేటి కాకరూపంబెత్తి ప్రత్యక్షమై
నది పాదార్చన చేయఁగాఁ గదలుమన్నా! అర్ఘ్యపాద్యంబులన్.

**4**

ఇఁకనైనన్ నిలుపంగఁ బూనుకొనుమోయీ! నీవు సర్వాంధ్ర నా
యకులన్ సోదర మైత్రిలో- అదియె సామ్యస్వామ్య సిద్ధాంతముం
బ్రకటించన్ మునుముందు భావిదశ శుంభత్కీర్తి రాజిల్లు - అ
మ్మకు మోదమ్మది - నీకుఁ జేకురును సమ్యగ్భోగ భాగ్యోన్నతుల్.

# ఆంధ్రజాతి భాగ్యోదయం

ఆంధ్రుల దీక్షా సంకల్ప ఫలం ఆంధ్రరాష్ట్రం. నలభైయేళ్లనాడు దేశోద్ధారక, దేశభక్తాది ఆంధ్రనాయకులు కన్న దివ్య స్వప్నాలను, నలభైయేళ్ల త్యాగానుభవంలో కాచివడబోయగా రూపొందినది ఆంధ్రరాష్ట్రం. నేడు నిర్మింపబడుతున్న ఆంధ్రరాష్ట్రమూ, నిర్మాణ ప్రక్రియా ఆంధ్రులకు పూర్తిగా తృప్తికలిగించక పోవచ్చును కాని విశాలాంధ్రావని అభ్యుదయ పథంలో ప్రథమఘట్టం చేరగలిగినందుకు ఆంధ్రులు పండుగ చేసుకొనగలరు.

గాంధిమహాత్ముని వర్థంతి రేపనగా ఆంధ్ర రాజ్య రథం భవ్యపథాన పయన మారంభిస్తుంది. ఇట్టి శుభసమయాన ఆంధ్రోద్యమానికి ఆదిపురుషులైన వారి పవిత్రాశయాలను, ఆదర్శాలను స్మృతికి తెచ్చుకోవడం మన కర్తవ్యం. ఆంధ్రపత్రిక సంస్థాపకులు, ఆంధ్రదేశంలో జాతీయోద్యమ ప్రారంభకులలో ప్రముఖులు అయిన స్వర్గీయ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ప్రథమాంధ్ర మహాసభ సమావేశ సందర్భంలో ఆంధ్ర పత్రిక (వారపత్రిక) లో (1913 ఏప్రిల్ 14) రచించిన సంపాదకీయ వ్యాసాన్ని ఈ ప్రక్క పేజీలో పొందుపరుస్తున్నాము.

ఆనాడు బాపట్ల ప్రథమాంధ్ర మహాసభ చర్చించిన అంశాలలో ఆంధ్రులకు దైనిక పత్రిక స్థాపనావశ్యకత ఒకటి. తరువాత 1914 ఏప్రిల్ 1 వ తేదీని ఆంధ్రపత్రిక దినపత్రిక స్థాపించబడింది. ఆ సందర్భంలో పంతులుగారు ఆంధ్రపత్రిక ఆశయాలను దినపత్రిక ప్రథమ సంచికలో ఈరీతిగా నివేదించారు:

"దేశీయ మహా సభాదర్శములును రాష్ట్రీయ సభాదర్శములును నాంధ్రపత్రికాదర్శములు. హైందవ జాతీయాభ్యుదయమును నాంధ్ర జాతీయాభ్యుయమును నుపపాదించుట పత్రికా నిర్వాహకుల ముఖ్యోద్దేశము. ఆంధ్ర జాతీయాభ్యుదయము హైందవ జాతీయాభ్యుదయమునకు సహకారిగాని ప్రతికూలము గాదని పత్రికా నిర్వాహకుల మతము. ఉభయ భావములకు విరుద్ధభావమేర్పడినప్పుడు హైందవ జాతీయతకు ప్రతికూలముగ ప్రవర్తింపజూడము. నిమిత్తము ఆంధ్రాభ్యుదయముగాని యితర జాతిద్వేషము కాదు. అవసరమైనప్పుడెల్ల యాంధ్రుల వృద్ధికి దగిన సదుపాయములను విసుగు విరామము లేకను ప్రజలకును పాలకులకును నివేదించెదము. శాఖా భేదములను, కులభేదములను, మతభేదములను, జాతిభేదములను గమనింపక మిత్రభావమును వ్యాపింపజేయుటకై ప్రయత్నించెదము. ఆంధ్రోద్యమముపట్ల సంపూర్ణ సానుభూతి నుపయోగించెదము. ఆంధ్రభాష, ఆంధ్ర విద్యావ్యాపనము, ఆంధ్ర విశ్వవిద్యాలయ నిర్మాణము, ఆంధ్రరాష్ట్ర నిర్మాణావశ్యకత మొదలగు విషయములను సమదృష్టితో సమర్థించుటయే దిన పత్రికను ప్రచురించుటకు గల ముఖ్య కారణము. భేదాభిప్రాయములు గలవారు మా యుద్దేశ్యములను వేరుగ గ్రహింపకుండుటకు ప్రార్థితులు."

ఇక్కడ హైందవ జాతీయత అంటే నేటి పరిభాషలో భారత జాతీయత అని అర్థం. ఆంధ్ర జాతీయాభ్యుదయం భారత జాతీయాభ్యుదయానికి సహకారి మాత్రమే కాని ప్రతికూలం కాదని పంతులు గారి దృఢాభిప్రాయం.

ఆంధ్రపత్రిక ఆశయాలలో ఒకటైన ఆంధ్రరాష్ట్రం మన కిప్పుడు లభించింది. అయితే ఈ రాష్ట్ర నిర్మాణంతో ఆంధ్రులపై బాధ్యత ద్విగుణీకృతమైనది. ప్రజాస్వామ్య పరిపాలనలో భాషా రాష్ట్రాల ప్రాధాన్యాన్ని నిరూపించవలసిన కర్తవ్యం ఆంధ్రులపైన పడింది.

ప్రజలు తమ ప్రాతినిధ్య యంత్రాంగాలను సక్రమంగా వినియోగపరుచుకుంటూ, పరిపాలన సమస్యలు, రాజకీయ సాంఘిక సమస్యలను విచక్షణతో పరిష్కరించుకోగలగాలంటే ప్రజలలో చైతన్యం వృద్ధిచెందాలి. ప్రజలలో చైతన్యానికి విద్యాభివృద్ధి, పరిపాలనా యంత్రాంగంలో సన్నిహిత బాంధవ్యమూ అత్యవసరం. ప్రజాసామాన్యం వ్యవహరించే భాషే పరిపాలనలో వినియోగించబడినప్పుడు పరిపాలకులు ప్రజలు సన్నిహితులౌతారు.

శాసకుల శాసనాలు, రాజకీయ

(1-వ పేజీ చూడుడు)

# ★ ఆంధ్ర మహాసభ ★

కొంతవర కంతరించుననియును సభాధ్యక్షు లనిన మాటలతో మే మేకీభవింపగలిగినను నాంధ్రోద్యమముయొక్క పరమార్థ మిదియే గాదని నొక్కి వక్కాణించుచున్నాము. ఇది ప్రాతనాయకులను దృప్తిపఱచునేమో గాని యావదాంధ్రుల యాదర్శ మిదికాదు. వారిది విశాలోద్యమము. "ప్రప్రథమమున నాంధ్రరాష్ట్రమును బడయుటకయి యత్నింతుము. తరువాత గావలసిన వన్నియు నీకు గూర్చబడును." యను నది వారి యాదర్శము. రాష్ట్రనిర్మాణమునకై గావలసిన భూమి, జనసంఖ్య, ఆదాయము ఆంధ్రమండలములకు గలవనియు, రాష్ట్రము నిర్మింపబడినయెడల దేశము త్వరలో నభివృద్ధిజెందుననియు వారి వాదనమై యున్నది. రాష్ట్రమున్నతోడనే ఆంధ్ర విశ్వవిద్యాలయము, అవసరమైనచో హైకోర్టు, వివిధకళాశాలలు, విశాఖపట్టణపు నౌకాశ్రయము, మరి యితరావసర ప్రతిష్ఠాపనములన్నియు శీఘ్రముగా సమకూరునని వారితలంపు. ఇటు చెన్నపురిప్రభుత్వము వారును, అటు సామ్రాజ్య ప్రభుత్వము వారును దగిన యాదరణ మొసంగకుండుట వలననే మన మండలము లీ దుస్థితియందున్నవి. తమ సర్వశక్తిని ఆంధ్రదేశమునకే ధారపోయగల రాష్ట్రపాలకులే యీ లోటును దగ్గింపగలరు. బేహారు రాష్ట్ర మిందులకు దార్కాణము. పంజా బిందుకుదాహరణము. గొప్ప కోరికలు కలవారు స్వల్పఫలములతో దృప్తి నొందరనియు, ఆంధ్రరాష్ట్ర నిర్మాణ మాంధ్రనాయకుల వలనను, ప్రభుత్వమువారి వలనను అంగీకరింపబడి సిద్ధించువఱకును యావదాంధ్రులు నిరంతర పరిశ్రమ జేయవలసియున్నారనియు హెచ్చరిక జేయుచున్నాము.

గవర్నమెంటువారిని గోరి పడయవలసినవి దక్కువగాను, ఆంధ్రుల స్వయంకృషివలన నిర్వహింపబడవలసినవి నధికముగను గలవు. ఏ సంస్కరణమైనను విద్యకే సంబంధించినది గాన నాంధ్ర విద్యానిధి కేవల మత్యవసరము. ఆంధ్రోద్యమమందు సత్తువ గలదని లోకము తెలిసికొనవలయు ననినచో నీ విద్యానిధి కచిరకాలములో గావలసినంత ధనమును ద్రవ్యవంతు లొసంగవలయును. ద్రవ్యము లేనివారు దానికయి నితర విధముల గష్టపడవలయును. స్వర్గము క్రిందికి జారిపడినను దాని ననుభవించుటకు శక్తి లేనివారు వ్యర్థులగుటవలనను, మన స్వయంకృషివలన నభివృద్ధి నొందనిది దేవుడైనను సాయ మొనరింపడు గనుకను సభలతోనే దృప్తినొందక ఆంధ్రమహాజను లీ యుద్యమ సంకల్పముల నీడేర్చి ఆంధ్రదేశమునకు మహోపకారమును జేసెదరు గాక.





## తమసోమా జ్యోతిర్గమయ

దారిచూపు కరుణామయ జ్యోతీ !
పరివ్యాప్త మహాధ్వాంత మధ్యంలో
నిలిచినాను, నడిపించుము నను ముందుకు !
సాంద్రతిమిర భరితము నిశ;
కడుదూరము నాగేహము;
దారిచూపి మునుముందుకు
నడిపించుము కరుణామయి !
అడుగడుగున తడ బడునా
అడుగులలో శక్తి నించు;
అడుగను లే, నా పథమున
కావలి కొన చూపుమంచు;
ఒకటే ఒక అడుగైనా
క్రమియించిన చాలునులే......

కార్డినల్ న్యూమన్ పద్యానికి
(అనువాదం : నండూరి రామమోహన రావు)

← భారత స్వాతంత్ర్య ప్రదాత
మహాత్మా గాంధీ
జయంతి అక్టోబరు 2 వ తేదీ

# ★ ఆంధ్రజాతి భాగ్యోదయం ★

(II-వ పేజీ తరువాయి)

నాయకుల ఆశయ ప్రకటనలు, కార్యక్రమాలు, పరిపాలకుల పరిపాలనా విధానం ప్రజలకు అవగాహనకు రాగలవు.

ప్రజాస్వామ్యానికి రాజకీయ స్వాతంత్ర్యంతోపాటు, ప్రజలలో చైతన్యం ప్రథమావసరమని గుర్తించినప్పుడు, భాషారాష్ట్రాలను గురించిన వివాదాలకు తావుండదు. భాషారాష్ట్రాల నిర్మాణం భారత జాతి సమైక్యమునకు ముప్పు కాదు. ప్రజల భాషలనుబట్టి, పరిపాలనా సౌకర్యాన్నిబట్టి రాష్ట్రాలను పునర్విభజన చేసినట్లయితే ప్రత్యంగం పుష్టిచెంది ఈ రాష్ట్రాలు జాతీయ వికాసానికి దోహదమీయగలవు. ఈ సత్యాన్ని నిరూపించవలసిన బాధ్యతను పండిట్ నెహ్రూ ఆంధ్ర దేశాని కొప్పగించారు. ఈ కర్తవ్యాన్ని దృష్టిలో పెట్టుకుని ఆంధ్ర దేశ నాయకులు కృషి చెయ్యగలరని ఆంధ్ర ప్రజ ఆశిస్తున్నది. ఇంతవరకు నాయకులు ప్రజలు ఏ ఆదర్శం కోసం అనేకవిధాల త్యాగాలు చేశారో, దేనికోసం కొందరు తమ సర్వస్వం పోనాడుకొని ఆంధ్రోద్యమానికి జీవనం పోశారో, ఏ పవిత్రోద్దేశంతో పొట్టి శ్రీరాములుగారు ప్రాణత్యాగం చేశారో, ఆ ఆదర్శాన్ని, సాధించడానికే నాయకులు, ప్రజలు కృషి చేయగలరని ఆశిస్తున్నాం.

ఈ సందర్భంలో ప్రకాశం పంతులుగారి ముఖ్యమంత్రిత్వంతో ప్రథమాంధ్ర మంత్రివర్గం స్థాపించబడవచ్చుననేవార్త శుభసూచకం. కారణాంతరాలవల్ల మాతృసంస్థయైన కాంగ్రెస్‌నుంచి కొంతకాలంగా విడివడి ఉన్నప్పటికీ, ఆంధ్రదేశంలో కాంగ్రెస్ సంస్థను బలపరిచి విస్తరింపచేసిన ప్రముఖులలో ప్రకాశం పంతులుగారు ఒకరు. కాంగ్రెస్ సంస్థనుంచి విడివడినప్పటికీ ప్రకాశం పంతులుగారు కాంగ్రెస్ మానసపుత్రులే. అందువల్ల ప్రకాశంగారి ఆధ్వర్యంలో ప్రథమాంధ్ర ప్రభుత్వం స్థాపించబడటం ఆంధ్రదేశానికి శుభదాయకం. ★

★  ★

★

## దేశభక్తి

ఓర్వలేమి పిశాచి దేశం
మూలుగులు పీల్చేసెనోయ్;
ఒరుల మేలుకు సంతసిస్తూ
ఐకమత్యము నేర్చవోయ్.

... ... ... ...

దేశమనియెడి దొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయ్;
నరుల చెమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయ్.

గురజాడ అప్పారావు

# 100

## రోజులనుంచి ఆంధ్రలో

## అన్ని ముఖ్య కేంద్రాలలో జయప్రదంగా ప్రదర్శింపబడుచున్నది






### 100 వ రోజు

| | | | |
|---|---|---|---|
| 1 | లక్ష్మి టాకీస్ | ... | విజయవాడ |
| 2 | లక్ష్మి టాకీస్ | ... | విశాఖపట్నం |
| 3 | క్రౌన్ టాకీస్ | ... | కాకినాడ |
| 4 | అశోకమహల్ | ... | రాజమండ్రి |
| 5 | మినర్వా టాకీస్ | ... | బందరు |
| 6 | రత్నా టాకీస్ | ... | తెనాలి |
| 7 | శేషుమహల్ | ... | నెల్లూరు |

### 50 వ రోజు

| | | | |
|---|---|---|---|
| 8 | జైహింద్ టాకీస్ | ... | అనకాపల్లి |
| 9 | జయలక్ష్మి టాకీస్ | ... | ఒంగోలు |

### 7 వ వారం

| | | | |
|---|---|---|---|
| 10 | శ్రీనివాస సినిమా | ... | గుడివాడ |

### 5 వ వారం

| | | | |
|---|---|---|---|
| 11 | ప్రభాకర్ టాకీస్ | ... | గుంటూరు |

### 4 వ వారం

| | | | |
|---|---|---|---|
| 12 | రాజగోపాల్ పిక్చర్ ప్యాలెస్. | | రామచంద్రపురం |
| 13 | వాణీమహల్ | ... | మండపేట |
| 14 | శ్రీకృష్ణబాలాజి టాకీస్... | | తాడేపల్లిగూడెం |

### 3 వ వారం

| | | | |
|---|---|---|---|
| 15 | వీరభద్ర టాకీస్ | ... | నిడదవోలు |



**డిస్ట్రిబ్యూటర్లు :**

* ఆంధ్ర : వినోద పిక్చర్స్ సర్క్యూట్, విజయవాడ.
* నైజాం : ప్రీమియర్ పిక్చర్సు, సికింద్రాబాదు.
* సీడెడ్ : నవయుగ ఫిలిమ్సు, గుంతకల్లు.
* మైసూరు: భారతీ పిక్చర్సు, బెంగుళూరు.

# రాష్ట్ర భవితవ్యం

తెన్నేటి విశ్వనాధం

నలభై సంవత్సరాలు పోరగా పోరగా నేటికి మనకు మనరాష్ట్రం సిద్ధించింది. ఈ నూతనరాష్ట్రంయొక్క పుట్టుపూర్వాలు ఆంధ్రదేశంలోని వారికందరికీ, దేశంలోని ప్రజావళికందరికీ కూడా బాగా తెలిసినవే. ఈ ఉద్యమం యొక్క చరిత్ర అందరూ ఎరిగిందే.

ఈ నూతన ఆంధ్రరాష్ట్ర వైశాల్యం దాదాపు 63,000 చదరపు మైళ్లు. పరిమాణంలో ఇది పశ్చిమబెంగాలుకూ, మైసూరుకూ రెండు రెట్లుంటుంది. తూర్పు పంజాబుకు కూడా ఇది దరిదాపుల్లో రెండింతలుంటుంది. ఒరిస్సాకన్నా కూడా ఇది పెద్దదే. ఇందలి జనాభా రెండుకోట్లకు మించింది. 14,000 చదరపుమైళ్ల అడవి ప్రాంతమూ, 600 మైళ్ల మేర సముద్ర తీరమూ ఉన్నాయి. దినదినాభివృద్ధికి ఆస్కారంగలిగిన పెద్దరేవు (విశాఖపట్నం) ఉంది. ఇదికాక ఇంకా చిన్న చిన్న రేవులు నాలుగైగు ఉన్నాయి ఇక్కడి వర్షపాతం కూడ మొత్తంమీద తీసి కట్టుగా లేదు.

మనకు ఖనిజసంపదకూడ అపారంగా ఉంది. మాంగనీసు, ఇనుము, బొగ్గు, సున్నపురాయి, రాతినార, అభ్రకం, ముగ్గురాయి, క్రోమైట్, స్టియెటైట్ మొదలైన అనేక ఖనిజాలు మన రాష్ట్రంలో దొరుకుతున్నాయి. కడప, అనంతపురం జిల్లాలలో వజ్రాలుకూడ లభ్యమవుతాయి. జలాధార సౌకర్యాలూ, విద్యుచ్ఛక్తి వసతులూ కూడ మనకు సమృద్ధిగా ఉన్నాయి.

కాబట్టి, రాష్ట్ర అవతరణపు క్రొత్తలో కొన్నికష్టాలను ఎదుర్కోవలసి యున్నప్పటికీ అనతికాలంలోనే మన రాష్ట్రం సకల సౌభాగ్య సంపన్నమైన రాష్ట్రంగా వెలుగొంది తీరుతుంది మహత్తరమైన ఎన్నో కార్యాలు సాధించి తీరుతుంది ఇంకొక్క పదేండ్లలో మనరాష్ట్రం దేశంలోని మహోజ్వలమైన ప్రబల రాష్ట్రాలలో ఒకటిగా భాసించి తీరగలదని నా దృఢవిశ్వాసం.

ఆదాయమార్గాలు సమిష్టిరాష్ట్రంలో ఉన్నట్లే నూతనరాష్ట్రంలోనూ ఉంటాయి. మద్యనిషేధం రద్దు అదనపుమార్గంగా ఉండబోతున్నట్లుకూడ ఆశింపబడుతున్నది. అలాగే ఖర్చుకూడ సమిష్టిరాష్ట్రంలో ఉన్నప్పటి వంతుల్లోనే ఇకముందుకూడ ఉంటుంది. సివిల్ వర్క్సుమీద రూపాయిలో 2 అణాలవంతూ, విద్యకు 3అణాలు, పోలీసుశాఖకు అణాముక్కానీ, సాధారణ పరిపాలనకు అణాపదిదమ్మిడీలూ, ప్రజారోగ్య వైద్యాలకు అణా రెండుదమ్మిడీలూ చొప్పున పెడుతూవుండిన ఖర్చే ఇకమీదట కూడ కొనసాగుతుంది.



అమూల్యమైన ఒక ప్రయోగ పరిశీలనగా భారతదేశం యావత్తూ ఇప్పుడు ఈ నూతనరాష్ట్రంపైన పెద్దమాపు పెట్టుకొని చూస్తున్నది. ఈ భాషాప్రయుక్త రాష్ట్రం యొక్క విజయంపైననే తక్కిన భాషా రాష్ట్రాలను నిర్మించడమో నిర్మించక పోవడమో ఆధారపడివుంటుందని ప్రధాని నెహ్రూ మొదటినుంచీ పదే పదే చెప్పుతూనే వస్తున్నారు. భారతదేశంలోని రాజకీయవాదులే కాదు, అమెరికావంటి విదేశాలవారు కూడ దీని ప్రగతిపైన పెద్ద దృష్టి పెట్టుకొని శ్రద్ధగా చూస్తున్నారు.

నూతనరాష్ట్రనిర్మాణమంటే ఎన్నో సమస్యలతో కూడుకొనివుండే విషయం. ఇది కేవలం ఒక పరిహద్దు గీతగీచి, ఇదిగో ఇవీ సరిహద్దులంటూ పేర్కొనేపాటి సులభమైన విషయంకాదు. పరిహద్దుగీత కచ్చితంగా గీయడానికీ, సరిహద్దులను విస్పష్టంగా పరిష్కరించి తేల్చడానికీ చాలా కాలం పడుతుంది. ఈ రాష్ట్రం ఇంచుమించు పరిపాలన సౌకర్యంకోసమై ఏర్పడిన విభాగమైనప్పటికీ భాషాధార అభిప్రాయం మీద ఏర్పడింది. కాబట్టి ఈ భాషా ప్రాంతాల నన్నిటినీ కూడతీసుకొనివచ్చి వర్గీకరించడంలో చాలా పేచీలు వస్తాయి. ఈ రాష్ట్రానికిన్ని ఇరుగుపొరుగు రాష్ట్రాలకున్న తగాదాలుకూడ రావడానికి ఆస్కారమున్నది. సరిహద్దు విచారణసంఘాలను ఏర్పాటు చేయవలసి వుంటుంది. సరిహద్దు సమస్యల పరిష్కారానికి జనవాక్య సేకరణ పద్ధతినో, లేక ఇతరపద్ధతులనో అవలంబించవలసి వుంటుంది. ఇది చాలా పెద్దతంతు. దీనిక ఇంకా ఉపక్రమణకూడా కాలేదు. ఇప్పటమట్టుకు జిల్లాసరిహద్దులు మాత్రమే తీసుకోబడినవి. ప్రధాని నెహ్రూ భాషలో 'వివాదరహిత తెలుగు జిల్లాలతో' ప్రస్తుతానికి రాష్ట్రం నిర్మింపబడింది. అందులోని బళ్లారిజిల్లావిషయంలో కొంత మినహాయింపు జరిగింది. అక్కడ ఈ విభజన తాత్కాలికంగా జరిగింది. కాబటి సరిహద్దులకు సంబంధించిన ఖరారు సర్దుబాటు ఇంకా జరగవలసేవుంది.

ఈ రాష్ట్రాభ్యుదయం దీనిని పునర్నిర్మాణం చేసేవిషయంలో మనమందరమూ చూపే ఏకీభావమూ, ఆత్మనిగ్రహమూ ఇత్యాదులపైన ఆధారపడివుంటుంది. ఈ రాష్ట్రసాధనలో మనం కోలుపోయింది అంతా ఇంతా కాదు; నిజమే. అయితే, జరిగిపోయినదానికి చింతిస్తూ కూర్చుంటే లాభంలేదు. అందుకై ఇతరులను అనీ ప్రయోజనంలేదు. రాష్ట్రం అవతరించింది. ఇది మనరాష్ట్రం. దీనిని పెంచి పోషించి అభ్యుదయానికి తీసుకురావడం మనవిధి. అందుకై శక్తివంచన లేకుండా, కృషి చేయడం మనధర్మం. ఈ దృష్టితో, ఈ భావనతో గనక మనం పాటుపడితే (తప్పకుండా పాటుపడుతామనే నా నమ్మకం) ఇప్పటి ఉద్బుద్ధమైన కష్టనిష్ఠురాలన్నీ అనతికాలంలోనే అవంతటఅవే విచ్చిపోతాయి. మనం కోలుపోయినవన్నీ కూడ మనము తిరిగి దక్కించుకొనితీరగలము. కోలుపోయినవాటికన్నా కూడా ఎక్కువగా సాధించగలము.

ఉభయగోదావరి జిల్లాలలోని వరద బాధిత ప్రాంతాలయందు పునరావాసం

(60-వ పేజీ చూడండి)

# కాలక్షేపం

ఏ యింటన్ వసియించు చెప్ప, లోకడా
యింటం బ్రవర్తించు; నే
ఛాయన్ నిల్చునొకండు, పెక్కులవటన్
సంధిల్లు; నొండైన లే
దా యింటన్; మదినెల్ల రాత్రి దిన
రూపాక్షద్వయిం జిమ్ముచున్,
జేయుం గాలుడు క్రీడ; లోకఫలక
శ్రేణిన్ వధూశారంబులన్.

తా॥ లోకమనెడి పచ్చీసువంటి జూదపు ఆట పలకమీది గళ్ళలో నగలనెడి ప్రాణులను పావులవలె కదలిస్తూ, రాత్రీ పగలూ అనే పాచికలను వేస్తూ "కాలము" (కాలుడు) అనే జూదగాడు ఆట ఆడుతున్నాడు. ఏ యింటిలో అనగా ఏ గదిలో మొదట చాలా పావులు ఉండెనో ఆ యింటిలో ఒక్కటే పావు ఉండడం సంభవిస్తుంది. ఏ యింటిలో అనగా ఏ గదిలో మొదట ఒక్కటే పావు ఉండెనో అక్కడికే అనేక పావులు వచ్చి చేరుతాయి. తర్వాత ఒకటికూడా లేకపోవచ్చు.

కాలం అనేది మనుష్యులతో జూదం ఆడుతున్నదా? మనుష్యులే కాలముతో జూదమాడుచున్నారా? "దేశం అంటే మట్టి కాదోయ్—దేశం అంటే మనుషులోయ్—" అని కీ॥ శే॥ శ్రీ గురజాడ అప్పారావు పంతులుగారు గానంచేసి కాలం చేశారు. ఆయన మనదేశంలో అవతరించిన ఒక సంస్కృతికి సంస్థాపకుడైనాడు. అటువంటి మహాపురుషుడు ప్రాచీన పండితుల దేవతార్చన పంచులలోనుంచి ఆంధ్ర సరస్వతిని విడుదలచేసి, ఆ ఘోషాలోనుంచి తప్పించి, ఆ బాలగోపాలంతో ఆడుతూ పాడుతూ సవేట్లు చేసి, మనలో, మన భాషలో జీవకళను [illegible]కవ్వించాడు.

ఆ మహాపురుషునితో నూతన సాహిత్య చైతన్యం ఉదయించినదని వాదిస్తూ ఉన్నాము. కాని, కొందరు తత్త్వవేత్తలు అలా వాదించరు. ఒక నూతన యుగం, నూతన సందర్భ పరిస్థితులతో పరిపక్వం అయినదనిన్నీ, అటువంటి కాలపరిస్థితుల ఫలితంగా ఇటువంటి యుగ పురుషుడు ఉద్భవించినాడనిన్నీ వాదిస్తారు. ప్రాత బంధనములను, అర్థంలేని వ్యర్థ ప్రతిబంధకములను త్రెంచివేయడానికి ఒక మహాపురుషుడు అవతరిస్తాడు. హిరణ్యకశిపుడు తన రాజ్యంలో ఉండేవాళ్లందరూ తన్నే దైవంగా ఆరాధించవలెనన్నాడు. ఇంకొకర్ని దైవంగా ఆరాధించకూడదనికూడా శాసించాడు. ప్రపంచమును నడిపించేటటువంటి ప్రచండశక్తి తానేఅన్నాడు. ఇతఃపరం ఇంకొకటి లేదన్నాడు. అదే అర్థంలేని నిబంధన. అటువంటినిబంధనకు నిర్బంధమునకు లోబడి ప్రజలు వాక్స్వతంత్ర్యం లేక, క్రియాస్వాతంత్ర్యం లేక పంజరంలోని చిలుకలవలె "ఏ పాట పాడమంటే ఆ పాట పాడుతూ, "హిరణ్యకశిపుడే శరణ్య మవనిన్" అని భజనచేశారు. అటువంటి నిర్బంధాధికారం అమలులో ఉన్నప్పుడు ఆ బంధనములను త్రెంచడానికి, మనలోఉన్న ఆత్మచైతన్యమే అఖండంగా ప్రయత్నిస్తుంది - కడుపులో ఉన్న కోరికకు కాళ్లు చేతులు వస్తాయి - అప్పుడది ఆర్భాటంతో ఆవిర్భవిస్తుంది. ప్రహ్లాదుడు పుట్టుతాడు. ఉక్కు స్తంభంలోనుంచి నరసింహమూర్తి ఉద్భవిస్తాడు. కాబట్టి కాలం పరిపక్వం కాగానే, కాలగర్భంలోనుంచి కలిపురుషుడు కూడా కదంతొక్కుతూ గజ్జల గుర్రమెక్కి వస్తాడు. ఈవిధంగా చూస్తే ఏదో ఒక కాలగర్భంలోనుంచి ఒక యుగ పురుషుడు, అవతరిస్తాడని అంగీకరించవలసి వస్తోంది. ఒక్కొక్క ఋతువులో ఒక్కొక్క చెట్టు కాయలు కాస్తుంది. మామిడిపండ్లు వేసవికాలంలో ఫలిస్తాయి. కమలాఫలాలు శీతాకాలంలో కరవు తీరునట్లుగా కాస్తాయి. ఆ ఋతువు వచ్చేసరికి ఆ ఫలం ఫలిస్తుంది. కనుక కాలమాన పరిస్థితులమూలంగా, ఏది ఎప్పుడు పరిపక్వం కావలెనో అప్పుడది సహజసిద్ధంగా పరిపక్వమౌతుంది. అదేవిధంగా ఆయా కాల పరిస్థితులవల్లనే ఆ యా యుగపురుషులు ఉద్భవిస్తారు.

ఇదే విధంగా వాదించినట్లయితే ఏ దేశంలో ఏ చెట్టు బాగా పెరుగగలదో, ఆ దేశంలోనే ఆ చెట్టు పెరిగి విస్తరిస్తుంది. ఆయా భూసారములు ఆయా వనస్పతులకు మంచి దోహదంగా ఉంటాయి. నల్లరేగడ నేలల్లో ప్రత్తిపంట విరివిగా అవుతుంది. కడప కర్నూలు ప్రాంతాలలో ప్రత్తి పంటకు అనుకూలమైన నల్లనేల ఉంది. కోస్తాప్రాంతం కొబ్బరితోటలకు అనుకూలమైన మెత్తని నేల. కొండ ప్రాంతాలలో తిరిగేఎద్దులు మాగాణిఊళ్ళల్లో బురద నేలలో నడవడానికి తడబడతాయి. కాబట్టి ప్రాంతీయ పరిసర భూసార స్వభావ ప్రభావం మూలంగానే ప్రాణికోటియొక్క ప్రకృతి, పరిణామవికాసం పొందుతూ ఉంటుంది. నీటిలోఉండే జంతువు ఎంతలోతునీటికైనా దిగి యీదుతుంది. చేపపిల్లకు యీత నేర్పవలెనా? "తలగవు కొండలకైనను" అన్నట్టుగా కొండలలో అడవులలో అవలీలగా విహరించేవి కరిరాజములు. కొండజాతుల వారికి ఉండే బండ సాహసం ఆ మొండి బండరాళ్లలోనే ఉంది. నేపాలు రాజ్యంలోని ఘూర్కాలు, మొండిపట్టుదలతో పోరాడుతారు. ఆజానుబాహులు కాబూలువాళ్లు — జిల్లుమనే చలిదేశాలలో తెల్లవాళ్ళు - పంటలులేని జాతికి పరిశ్రమ యెక్కువ - పరాయి రాజ్యాలమీద దండయాత్ర లెక్కువ. చలికి ముడుచుకొన్న అవయవాలకు చలనం ఎక్కువ కావాలి. వారి భాషకు దీర్ఘాలు రావు. వారికి కాలహరణం ప్రాణసంకటం. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః అనే దేశాలు కావవి. ఈ తెల్లవాళ్లకు యీర్ష్యలు అసూయలు ఎక్కువ. తెల్లవాళ్ళకు నల్లవాళ్లంటే గిట్టదు. కాని నల్లవాళ్ళకు తెల్లవాళ్ళమీద ద్వేషం లేదు. ఈవిధంగా చలిదేశాలవారికి ఉన్నంత తామస లక్షణం తక్కిన దేశాలలో కన్పించదు. కాని, సాత్త్విక లక్షణానికి సవ్యమైన సమశీతోష్ణ సస్యశ్యామల సారవంత ప్రాంతము ఆర్యావర్తము. నూరు అనండి - వెయ్యి అనండి - ఈరోజున ప్రపంచంలో ఏ రాజ్యంలోనైనా మద్యపాన నిషేధమును నిశాంచి అమలుపరచిన ప్రభుత్వం ఏదైనా ఉన్నదాఅంటే, అది భారత ప్రభుత్వం ఒక్కటే. గోవధ నిషేధించడానికి కంకణం కట్టుకొన్న దేశం యిది. అహింసాతత్త్వంతో స్వాతంత్ర్యంసంపాదించగలమనిశపథంచేసిన సత్యాగ్రహ నాయకునకు ఇది జన్మభూమి. కాబట్టి ఒక విధమైన ప్రకృతి, ఒక విధమైన సంస్కృతి, ఒక విధమైన శ్రుతి ఒక్కొక్క ప్రజాజీవితంలో ధ్వనించి ప్రతిధ్వనిస్తూ ఉంటుంది. ఆ దేశంయొక్క,

ఆ భూసారంయొక్క, ప్రభావం అది. అది ఆ క్షేత్ర మాహాత్మ్యం. ఆ మట్టిలోనే పుట్టింది ఆ జాతి ప్రకృతి అని ప్రకీర్తించ వలసి వస్తుంది. ఆ మహిమ ఆ మట్టిలోనే ఉట్టిపడుతున్నదనే వాదన వట్టి మట్టికాదు.

మనిషి అంటే ఏమిటి? మట్టిలోనుంచి పుట్టినవాడు - మట్టిలో కలిసిపోతాడు. తానుపుట్టినది మట్టిలోనుంచి - తాను మెట్టినది మట్టి. తాను గిట్టిన తర్వాత మట్టి అవుతాడు.

మన యుగపురుషులు, మన యుగంధరులు, మన త్యాగమూర్తులు, మన త్యాగబ్రహ్మలు, మన అప్రతీప ప్రతాపులు, మన ప్రతాపరుద్రులు, మన చెక్కుచెదరని ఉక్కువీరులు, మన ఖడ్గతిక్కన్నలు, మన వాగనుశాసనలు, మన కవిబ్రహ్మలు, మన వేమనయోగులు ఎందరో మహానుభావులు! వారందరికి మందిరమైన దేశం వట్టి మట్టి కాదు. వారి భస్మరాసులు, మట్టిదిబ్బలు కావు. వారి సమాధులు మన జీవిత పరమావనులైనాయి. రాజఘాటువద్ద ఏముంది? సత్యాన్ని అహింసను అక్కడ పాతి పెట్టినారా? అన్నట్లుగా అందులోనుంచి అవి ప్రతిధ్వనిస్తున్నాయి. భద్రాద్రిలో ఏముంది? అక్కడ రామదాసుగారి రామభక్తి భద్రంగా ఉంది. హంపిలో ఏముంది? విజయనగర సామ్రాజ్యానికి ఆంధ్రవీరులు కత్తికట్టి నిలబెట్టిన కోటగోడలు తురుష్కుల దాడికోడి ఆ సామ్రాజ్య నీడలవలె నిల్చి ఉన్నాయి. తంజావూరు సరస్వతీ గ్రంథభాండారంలో ఏముంది? మనఆంధ్ర సరస్వతి బండారం ఉంది. రాజమహేంద్రవరంలో ఏముంది? రాజరాజనరేంద్రుడు నన్నయభట్టు చేత వ్రాయించిన ఆంధ్రమహాభారత పర్వముల పుట్టినిల్లు నేత్రపర్వంగా ఉంది. నాగార్జున కొండలమీద చెక్కబడి ఉంది మన పూర్వుల జాతకచక్రం అంతా. ఏ మూల త్రవ్వినా, దాన శాసనాలు. ఏ శాసనాలు చూచినా మన పూర్వ వాసనలే. మన సంస్కృతి మనపూర్వజన్మవృత్తాంతం అంతా యీ రాళ్ళల్లో, యీ కొండల్లో, యీ మట్టిలో ఉంది. "దేశం అంటే మట్టి కాదోయ్"—అదంతా వట్టి మాట. నేల విడిచి సాముచేసేవాడు, గాలిలో ఉట్టి కట్టుకొని వ్రేలాడలేడు. ఎన్ని దేశాలు తిరిగినా, కన్న దేశం కంటె మిన్న దేశం సున్న—ఆ తల్లి రక్తం మనలో ఉంది. ఆ తల్లికి ప్రణమిల్లడం మనలను మనమే సత్కరించుకొని, ఆత్మ ప్రదక్షిణ నమస్కారం చేసికోవడం. కనుక, ఆత్మగౌరవానికి ఆత్మ సంస్కారానికి, మాతృ దేశభక్తి మాతృ భిక్ష.

లోకమాన్య బాలగంగాధరతిలకు నిజంగా లోకమాన్యుడే. ఆయనను ఆయన గౌరవించుకొన్నాడు. లండను వెళ్ళినా తన మహారాష్ట్ర ఎర్ర తలపాగా ఎన్నడూ తియ్యకుండా తిరిగాడు. ధోవతి కట్టుకొన్నాడు గాని సూటు వేయలేదు. "నీ వేషభాషలను నీవు గౌరవిస్తే, నీ వేషభాషలను నిఖిల ప్రపంచం గౌరవిస్తుంది. నీ దేశ జెండాను నీవు గౌరవిస్తే నీ జెండాను ఖండాంతరములలోకూడా గౌరవిస్తారు."

మన మాతృదేశగౌరవభావం ఏనాడు ఉద్భవించింది? ఆంధ్రలోకానికి ఒకప్పుడు ఈగౌరవం శాతవాహనులకాలంలో ఉంది. ఇక్ష్వాకుల కాలంలో ఉండేది. చాళుక్యుల రాజరాజనరేంద్రుని కాలంలో రాణించింది. కాకతీయ ప్రతాపరుద్రుని కాలంలో ప్రజ్వలించింది. విజయనగర సామ్రాజ్యంలో కృష్ణదేవరాయల కాలంలో పూర్తిగా మూర్తీభవించింది. ఆనాటిఆంధ్రులకు ఆత్మగౌరవం ఉండేది. అందుకనే వారి విజయ శంఖారావం దశదిశల మారుమ్రోగింది.

ఈ ఆంధ్ర సామ్రాజ్యం అనేక మహోన్నతశిఖరాలు అధిరోహించింది. అనంతరం అగడ్తలోకి అవరోహించింది. వారి ప్రభ వెలిగినప్పుడు వారు పగటి దివిటీలతో దేశాన్ని, మతాన్ని శాసించే పరివ్రాజకాచార్యులవలె ప్రకాశించారు. వారి దీప్తి సమాప్తమైనప్పుడు వారిని అప్రయోజకులని అపహసించారు అప్పుడవి వారికి చీకటి రాత్రులు. ఒకప్పుడు వారివి వెన్నెల రాత్రులు. ఒకప్పుడు ఆంధ్రులు అంటే "అంధులు" "అంధకులు." మరొకప్పుడు "ఆంధ్రులు" అంటే, త్యాగభోగేంద్రులు. ఈనాడు "ఆంధ్రులు" అంటే స్వరాష్ట్ర స్వపరిపాలనా ధురంధరులు కావాలనే దీక్షాకంకణధారులు.

కాలాన్నిబట్టి చీకటి రాత్రులు తప్పవు. వెన్నెలరాత్రులుతప్పవు. కాలము నేజూదగాని చేతిలో పావులవలె మన దేశ దశాంతర్దశలు మారక తప్పవు. దేశకాలములకు కట్టుబడక తప్పరు ఈశుడైనా, రమేశుడైనా. మానవులు దేశకాలములకు కట్టుబడిన పరమాణువులు. లోకమనేది లోకేశుని జూదపు బల్ల. నరులు "శారంబుల"వలె (ఆ బల్లమీది పావులవలె) ఒక గడియలో ఒక గడిలోనుంచి ఇంకొక గడిలోకి మార్చబడుతూ ఉంటారు. దైవీక కారణములవల్ల భూకంపాలు, వరదలు ఉప్పెనలు వచ్చి మహానగరాలు మట్టిదిబ్బలు కావచ్చు. కొండలమధ్య అరణ్యములమధ్య విద్యారణ్య నగరం (హంపి విజయనగరం) ఉద్భవించవచ్చు.

ఈ మార్పులన్నీ విధివిధాన శాసనాలు. మానవ జాతకంలాగున జగజ్జాతకంకూడా గ్రహస్థితులబట్టి మారుతుందని త్రికాలవేదుల సిద్ధాంతం. త్రివేదిగారైనా త్రిశుద్ధిగ నమ్మవలసిన కర్మసూత్రము. ఈనాడు "డేరాల నగరం" అని పలువురు పరిహసించిన ఆంధ్రరాజధాని, మరొక మహానగరంగా మారి "ఈ నగరమున కీ డేరా? ప[illegible]నగరమా?"

(మిగతా 60- వ పేజీలో)

## రావమ్మ మా తెలుగుతల్లి

రావమ్మ మా తెలుగుతల్లి
అమ్మరావమ్మ తల్లి రావమ్మ
తరలిరావమ్మ
మా తెలుగుతల్లి

............

ఇరుగు పొరుగూ వారి
పొరపొచ్చెములు లేక
గతుకు బితుకూ లేని
గౌరవపు దారిలో ॥రా॥

............

పచ్చ పచ్చని చేల
పైట నీడల్లోన
పైడిరవ్వలు కురిసి
భాగ్యాలతో మెరిసి॥ రా॥

............

తుంగభద్రా పెన్న
కృష్ణా గోదావరుల్
నీ క్షీరమై పొంగి
నీ ప్రజల పాలింప ॥రా॥

............

తిరుమ లేశుని కొలువు
సింహాద్రిపతి చలవ
శ్రీశైల విభుకరుణ
కనకమ్మ దయకలిగి॥
రావమ్మ మా తెలుగుతల్లి॥

-బాలాంత్రపు రజనీకాంతరావు

# ★ ఆంధ్రుల చరిత్ర ★

భట్టిప్రోలు హనుమంతరావు

ఆంధ్రుల చరిత్ర మహోజ్వలమైనది. ఋగ్వేదకాలమునుండి అవిచ్ఛిన్నమైన చరిత్ర ఆంధ్రులకు విలక్షణమై, ఆంధ్రజాతి ఎంత సజీవమైనదో నిరూపిస్తున్నది. రాజకీయముగ, సాంస్కృతికముగ భారతదేశ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపదగిన పాత్రను నిర్వహించారు ఆంధ్రులు. అందుచేత నూతన రాష్ట్ర నిర్మాణ సందర్భంలో, ప్రతిభా సంపత్తితో, శౌర్యపరాక్రమాలతో మన పూర్వులు సాధించిన మహత్తర విజయాలను పునఃస్మరించటం భావి రాష్ట్రాభివృద్ధికై యువకులను కార్యోన్ముఖులను చేయటానికి ఎంతేనా ఉపకరిస్తుంది.

**పుట్టు పూర్వోత్తరాలు :** ఆంధ్రుల ఆదిమ నివాసాన్ని గురించీ, వారు ఆర్యులా, లేక అనార్యులా అనే విషయాన్ని గురించిన వాదోపవాదనలింత వరకూ తెలనేలేదు. ఆంధ్రులను అనార్య జాతులతోనే కలిపి చెప్పినై వేదాలు. సూత్రాలు వారిని మ్లేచ్ఛుల క్రింద జమకట్టినై. అందుచేత ఆంధ్రులు అనార్య జాతులకి చెందినవారని నిర్ణయించటం సమంజసం. ఆర్యుల రాకకు పూర్వం హిందూదేశమంతటా ద్రావిడులే ఆక్రమించియున్నారని "హావెల్" అభిప్రాయం. వీరు ఆఫ్ఘనిస్థానము బెలూచిస్థానముల మార్గమున హిందూదేశమున ప్రవేశించారు. ఆర్యుల భాష, నాగరికత వీరినుండి చాల గ్రహించి సంపూర్ణత్వమునందెను. క్రమముగా వీరి నగరములను భూములను ఆక్రమించి ఆర్యులు వీరిని దక్షిణమునకు తరిమివేసినట్లు నిదర్శనము లనేకములు గలవు. ఆంధ్రులు ద్రావిడజాతికి చెందినవారే నని ఇటీవల పరిశోధనవల్ల తెలియుచున్నది.

వాయు బ్రహ్మాండ పురాణములవల్ల, పహ్లవులు, తుషారులు, దరదులు, మూలకులు, శకులు మున్నగువారితో కలిసి ఆంధ్రులొకానొకప్పుడు చక్షునదీ (ఆక్ససు) తీరంలో నివసించారని తెలుస్తున్నది. ఇప్పటికీ "ఆంధ్రఖుయి" అనే జిల్లా బాక్ (*Balkh*)కు పశ్చిమంగా ఉన్నదట. అటనుండి ఆంధ్రులు దక్షిణంగా వలస వచ్చారు. ఆర్యుల దండయాత్రలే ఇందుకు కారణం కావచ్చు. కొంతకాలం ఆంధ్రులు ఆఫ్ఘనిస్థానంలో గూడా నివసించారనటానికి నేటికీ ఆఫ్ఘనిస్థానంలో అంధేరి లేక ఆంధ్రి అని పిల్వబడే యుద్ధప్రియులైన జాతివారే నిదర్శనం. క్రమంగా వీరు హిందూదేశంలో ప్రవేశించారు. ఆర్యుల దండయాత్రలవల్ల ఆంధ్రులు దక్షిణంగా వలసపోవలసివచ్చింది. కొందరు ఆంధ్రులు ఆర్యులకు బానిసలై, వారికి వినోద మీయటానికి ఉపకరించారు. ధైర్యసాహసాలకు పెట్టినది పేరై యుద్ధప్రియులు కావటంవల్ల ఆంధ్రులను ఆర్యులు మల్లులుగా నియమించేవారు. కంసుని కొలువులోని చాణూరమల్లుడాంధ్రుడు! కాని స్వాతంత్ర్య ప్రియులైన ఆంధ్రులు ఆర్యులతో పోరాడి చివరకు దక్షిణముగా వలసపోయి స్వతంత్ర రాజ్యాలను స్థాపించుకొన్నారు. చివరకు కృష్ణా గోదావరీ నదులమధ్య ప్రాంతంలో స్థిరపడిపోయారు. ఆంధ్రులతోపాటు తరలి వచ్చిన పహ్లవులు, మూలకులు, పారటులు, మున్నగువారూ, ఈ ప్రాంతములందే అనాదిగా ఉంటూ ఉన్న నాగులు, జక్కులు, (యక్షులు) కలిసి కాలక్రమమున ఆంధ్రజాతిగా యేర్పడింది. అందుచేతనే మహాభారతం "ఆంధ్రాశ్చబహవః" అని నిర్వచించింది.

క్రీస్తు పూర్వం 6 వ శతాబ్దంలో, భారతదేశమందలి ఆర్య అనార్య విభేదములను నిర్మూలించి మతసాంఘిక న్యాయాన్ని స్థాపించే ఆశయంతో జైన బౌద్ధమతాలు బయలుదేరినై. అనార్యజాతులిట్టి మతోద్యమాలను ఆదరించటం సహజమే. ఆంధ్రులు గూడా జైన బౌద్ధాలను స్వీకరించారు. బుద్ధుని కాలంలోనే బౌద్ధమతం ఆంధ్రదేశంలో వ్యాపించినట్లు తెలుస్తున్నది. ఈ యుగంలో ఆంధ్రులు, అశ్మక, మూలక, పల్లవ, భోగ్య మున్నగు సుప్రసిద్ధ జనపదాలను స్థాపించినట్లు బౌద్ధవాఙ్మయం చాటుచున్నది.

**మౌర్యయుగం :** ఇంతలో మౌర్య చంద్రగుప్తుడు నందవంశాన్ని నిర్మూలనం చేసి మౌర్యవంశాన్ని స్థాపించాడు. చంద్రగుప్తుడే దక్షిణదేశంమీద కూడ దండెత్తి తమిళమండలంలో పాదియూర్ కొండవరకు జయించాడని కొందరి అభిప్రాయం. ఏమైనప్పటికీ, బౌద్ధమతాభిమానులైన ఆంధ్రులు అశోక సామ్రాజ్యంలో చేరారు; కాని స్వతంత్ర ప్రతిపత్తినే అనుభవిస్తున్నట్లు కన్పిస్తుంది. మెగాస్తనీసు వ్రాతల ప్రకారం ఆంధ్రులకు 30 బలిష్ఠములగు దుర్గములు, 1000 ఏనుగులు, 2000 గుఱ్ఱములు, 100,000 కాల్బలము ఉన్నవట; బలసంపత్తిలో మౌర్యుల తర్వాత ఎన్నదగినవారు ఆంధ్రులేనట !

**శాతవాహనులు :** అశోకుని మరణానంతరం ఉత్తర హిందూదేశంలో చెలరేగిన అశాంతిని అవకాశంగా తీసుకొని ఆంధ్రులు క్రీ॥ పూ॥ 220. ప్రాంతమున స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించారు. ఈ స్వాతంత్ర్యోద్యమమునకు నాయకత్వము వహించినది శాతవాహనుడు. అతని సంతతివారే శాతవాహనులని సుప్రసిద్ధులై 400 సంవత్సరములు ఆంధ్రదేశాన్ని పరిపాలించారు. ఆంధ్ర చరిత్రలో నేగాక అఖిల భారతదేశ చరిత్రలోనే శాతవాహన యుగము ముఖ్యమైంది. శాతవాహనులు కేవలము దక్షిణదేశాధీశులు మాత్రమే గాదు– ఆర్యావర్తము, ద్రావిడములపై గూడ అధికారం వహించారు. ప్రాచీన భారతములో సామ్రాజ్యాధికార పీఠమైన మగధను పాలించిన ఏకైక దాక్షిణాత్య రాజవంశము ఆంధ్ర శాతవాహన రాజవంశమే ననుట ప్రతి ఆంధ్రుడు గర్వింపదగిన విషయము. శాతవాహనుడు స్థాపించిన రాజ్యమును బలపరచి ఆంధ్ర సామ్రాజ్యమునకు నాంది పాడినది శ్రీముఖ శాతవాహనుడు. రథికులు, భోజకులు పుళిందులు మున్నగు జాతులన్నియు శ్రీముఖుని ఆధిపత్యమంగీకరించెను. ఇతని కుమారుడు శాతకర్ణి మాళవ విదర్భదేశములను గూడ ఆక్రమించి రెండశ్వమేధములు, రాజసూయము చేసి

ఆంధ్రుల కత్తికి ఎదురు కత్తి లేదనిపించెను.

పాటలీ పుత్ర దుర్గముపై ఆంధ్ర విజయ పతాకను తొలిగా నాటినవాడు రెండవ శాతకర్ణి. క్రీ॥ శ॥ 100 ప్రాంతమున మగధ కళింగ రాజ్యములు శకపాదాక్రాంతము లగుట సహింపలేక, ఆంధ్రసేనా వాహినులతో బయలుదేరి కళింగము నాక్రమించి, మగధనుండి శకులను పారద్రోలి శాతకర్ణి పాటలీపుత్రమునుండి పరిపాలన సాగించెను.

మరికయొమారు, చివరి కాణ్వాయనుడైన సుశర్మను తొలగించి కుంతల శాతకర్ణి పులోమావి, హాలుడు మగధరాజ్యము నేలినట్లు తెలియుచున్నది. వీరి కాలమున, మహారాష్ట్రము, గుజరాతు, మాళవ, మగధ కళింగలను కలుపుకొని ఆంధ్రసామ్రాజ్యము కావేరీనది పర్యంతము వ్యాపించెను. ఆంధ్ర సామ్రాజ్యమునకు నాడు పైఠాను ముఖ్య నగరముగను వైజయంతి, ధాన్యకటకము, గోవర్ధనమ్ము, బరుకచ్ఛము మున్నగునవి శాఖా నగరములుగను ఉండెను. కవియై, 'కవివత్సలు'డైన హాలుని బలపరాక్రమములు, వైదుష్యము, కళాభిమానము విని ముగ్ధయై సింహళరాకుమారి స్వయముగా వచ్చి అతనిని వివాహమాడినట్లు 'లీలావతి' యను పాకృత శృంగారకావ్యమువల్ల తెలియుచున్నది.

శాతవాహన చక్రవర్తులలో నద్వితీయుడు గౌతమీపుత్ర శ్రీశాతకర్ణి. ఇతడనేక యుద్ధము లొనర్చి అసిక, అశ్మల్ మూలక, సురాష్ట్ర, కుకుర, అపరాంత అనూప, విదర్భ ఆకరావంతులకు రాజైనాడు. శకయవనపహ్లవులను, ఖఖరాట రాజవంశమును నిర్మూలము చేసెను. ఇతని రథాశ్వములు మూడు సముద్రములందును నీరు త్రాగెను. వర్ణసాంకర్యమును నివారించి 'ఏకబ్రాహ్మణుడ'ని గౌతమీపుత్రుడు ప్రసిద్ధిపొందెను.

గౌతమీపుత్రుని తర్వాత ఆంధ్ర శాతవాహన సామ్రాజ్యం క్షీణించసాగింది. ఒకమూల కుటుంబకలహాలు మరొకవైపు శక దండయాత్రలవల్ల శాతవాహనులు సామ్రాజ్య పశ్చిమ భాగాలను నిర్లక్ష్యం చేయకతప్పింది కాదు. గౌతమీపుత్ర స్వామి యజ్ఞశ్రీ ఆంధ్రుల అధికారాన్ని విదర్భ కళింగ కోసల దేశాలలో మరల వ్యాపింపజేశాడు. కాని అతని మరణంతో ఆంధ్రసామ్రాజ్యం విచ్ఛిన్నమైంది.

శాతవాహనుల సామ్రాజ్యనిర్మాణకార్యక్రమం హిందూదేశానికి మాత్రమే పరిమితమై యుండలేదు. తమ నౌకాబలంతో 'మహాంధ్ర' (*Greater Andhra*) కు, భారతీయ సాంస్కృతిక సామ్రాజ్యమునకు శాతవాహనులు పునాదులు వేశారు. క్రీస్తుశకం ఒకటో శతాబ్దంలో, బహుశా గౌతమీపుత్ర శాతకర్ణి ప్రోత్సాహంతో కౌండిన్యుడనే ఆంధ్రవీరుడు, నేటి ఇండోచైనాలో చంపారాజ్యాన్ని స్థాపించాడు. కంబోడియాలో స్థాపింపబడిన 'కాంభోజ' కూడా ఆంధ్రుల వలసరాజ్యమే నని పండితుల అభిప్రాయము. బర్మాలో రాజ్యపాలన చేసిన 'తలైంగులు' తెలుంగువారే. క్రమంగా బ్రాహ్మణ బౌద్ధమతాలు, ఆంధ్ర శిల్ప వాస్తు శాస్త్రాలు ఆచార వ్యవహారాలు, తెలుగు లిపి, ఆంధ్రు లుపయోగించిన శకాబ్దములు తూర్పుదీవులకు ప్రాకినై. ఇండోచైనాలోని వోకను 'శిలాశాసనము' వాశిష్ఠీపుత్ర శాతకర్ణి కన్హేరి శాసనమును బోలియున్నది. సింహళదేశ ప్రథమ చక్రవర్తియైన విజయుడు "తెల్లింగ" దేశమునందలి "కమ్మరాష్ట్రము" నుండి "కొత్తవాడువ" మొదలగు అనేకమంది "కమ్మసాలీల"ను ఆహ్వానించి వారిచేత బహుశా నౌకలను నిర్మింపజేసెను. జావా "బారోబుదురు" లోని సుప్రసిద్ధ బౌద్ధశిల్పాలకు నమూనాలు ఆంధ్రదేశంలోని "సంఘరము" నందు కన్పిస్తై. ఆంధ్ర దేశభక్తులు మాతృదేశంలోని స్థల నామాలను వలసలలోని తమ నివాసాలకు పెట్టుకొన్నట్లు చంపా రాజ్యమందలి అమరావతి, విజయ, కొత్తూర, పండురంగి అను నాల్గు రాష్ట్రాల పేర్లవలన స్పష్టమౌతోంది. ఒకటవ శతాబ్దంలో ఏర్పడ్డ ఈ సంబంధం 10, 11 శతాబ్దాల వరకు ఉన్నట్లు, ఆంధ్రదేశంలోని శ్రీ పర్వతము మొదలైన క్షేత్రాలు తూర్పు దేశభక్తుల నాకర్షించుచునే యున్నట్లు తెలుస్తున్నది.

**ఇక్ష్వాకులు :** ఇట్టి విఖ్యాత శాతవాహన యుగం క్రీ॥ శ॥ 225 ప్రాంతంలో అంతరించింది. కాని దేశం అరాజకము పాలుగాకుండా కాపాడారు, శ్రీపర్వతాంధ్రులని వ్యవహరింపబడిన ఇక్ష్వాకులు. విధ్వంసక శక్తులను నిర్జించి ఆంధ్ర సామ్రాజ్యం విచ్ఛిన్నంగాకుండా రక్షించాడు ఇక్ష్వాకు కులతిలకుడైన శ్రీ శాంతమూలుడు. శ్రీపర్వత - విజయపురి ముఖ్యపట్టణంగా మరల ఆంధ్రసామ్రాజ్యం పూర్వప్రతిష్ఠను పొందగలిగింది. మైసూరులోని చుటుకులానందులు, మహారాష్ట్రములోని ఆభీరులు, మాళవమునందలి శకులు శ్రీశాంతమూలుని మైత్రి నాశించారు. ఈవిధంగా ఆంధ్ర యశస్సును పునఃప్రతిష్ఠించి శ్రీ శాంతమూలుడు వాజపేయాశ్వమేధము లొనరించి, గోశత సహస్ర, హలశత సహస్ర మహాదానములు చేసి ధర్మప్రతిష్ఠాపన కూడా చేశాడు.

ఇక్ష్వాకుల కాలంలో శ్రీ పర్వతము - నాగార్జునకొండ భారతదేశంలో కెల్ల సుప్రసిద్ధమైన మహాయాన బౌద్ధక్షేత్రమైంది. గౌతమీ పుత్రయజ్ఞశ్రీ కాలంలో ఆచార్య నాగార్జునుడు తాను సింహళద్వీపంనుండి తెచ్చిన బుద్ధుని అస్థికలపై శ్రీ పర్వతమందు మహాచైత్యాన్ని నిర్మించాడు. తర్వాత నాగార్జునునికొఱకు పర్వతముపై యజ్ఞశ్రీ సంఘారామాన్ని నిర్మించాడు. ఆచార్య నాగార్జునుడు శ్రీ పర్వత శిఖరములనుండియే తన మాధ్యమికవాద సిద్ధాంతాలను ప్రపంచానికి చాటాడు. అట్టి శ్రీ పర్వత క్షేత్రము ఇక్ష్వాకు మహారాజైన మాఠారీ పుత్ర వీర పురుషదత్తుని కాలంలో జగద్విఖ్యాతమైంది. మాధ్యమిక సిద్ధాంతాలను ఆంధ్ర భిక్షువులు దేశదేశాలలోను వ్యాపింపజేశారు. కాశ్మీరు, చీనా, సింహళం మొదలైన దూరదేశ బౌద్ధులచ్చటికి వచ్చేవారు. అద్వితీయములని కీర్తింపబడిన నాగార్జునకొండ శిల్ప కళా ఖండాలన్నీ ఈ రోజులలో తయారైనవే.

**ఇతర రాజవంశాలు :** సుమారు అర్ధశతాబ్దము పైగా ఇక్ష్వాకు లాంధ్రదేశాన్ని పాలించారు. అనంతరం ఆంధ్రలో రాజకీయైక్యత నశించింది. కృష్ణానదికి దక్షిణంగా ఉన్న దేశం పల్లవరాజుల వశమైంది. ఉత్తరభూములను వేంగినుండి శాలంకాయనులు పాలింపసాగారు. ఈ కాలంలోనే మగధలో గుప్తవంశం స్థాపించబడింది (*A. D.* 320). గుప్తులలో రెండవవాడైన, సముద్రగుప్తుడు, దాక్షిణాత్యాంధ్రులు మగధను జయించి పాలించినందులకు ప్రతీకారము చేయుటకో అనునట్లు దక్షిణదేశ విజిగీషతో దండెత్తివచ్చాడు. (*A. D.* 344). కాని ఆంధ్ర రాజులు సముద్రగుప్తుని ఆటలు సాగనియ్య లేదు. శాలంకాయన చక్రవర్తియూ, అనేక సమగావాప్త విజయుడునైన హస్తివర్మ మహారాజు నాయకత్వమున ఆంధ్ర రాజు లందరూ కూటమిగా చేర్పడి సముద్రగుప్తుని ప్రతిఘటించారు. కంచినుండి పల్లవ రాజైన విష్ణుగోపుడు వీరికి సాయముగా వచ్చాడు. ఇక యుద్ధములో పరాజయము తథ్యమని గుర్తించి సముద్రగుప్తుడు వెనుదిరిగి పోయెను.

సముద్రగుప్తుని దండయాత్ర తర్వాత ఆంధ్రదేశమున రాజకీయ కల్లోలము ప్రారంభమయ్యెను. దేశాధిపత్యమునకై శాలంకాయనులు, ఆనంద గోత్రీకులు, విష్ణుకుండినులు పరస్పరము పోరాటము ప్రారంభించిరి. ఈ అంతర్యుద్ధములను అవకాశముగా తీసుకొని పశ్చిమమున వాకాటకులు,

(57-వ పేజీ చూడండి)

# ఆంధ్రలో రాజకీయోద్యమాలు

వావిలాల గోపాలకృష్ణయ్య

తేటల్ దేరెడు కాంతిపూరముల నుద్దీపించుము
ప్పేటల్ వోలె త్వదీయకంఠమున
శోభింపుల్ నిగారించుచే
కాటన్ జీవనశోషణల్ గనని కృష్ణా
గౌతమీ పెన్నలన్
గాటంపున్ దమిద్రావువారమిది
కాంక్షాక్షీరమాంధ్రావనీ

వందేమాతరంవుద్యమం 1908 లో వచ్చింది. అంతకుముందు కాంగ్రెసు భారతీయులకు అధికారపదవు లివ్వమని ఆందోళన చేసినట్లే ఆంధ్రప్రజలలో చదువుకున్న పెద్దలు ప్రథమ కృష్ణా (ఈనాటి కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లాలు ఆనాడు కృష్ణాజిల్లా పేరుతో వుండేవి) జిల్లా మహాసభ గుంటూరులో 1892 లో జరిపారు. కొండా వెంకటప్పయ్య, వావిలాల శివావధాని, శనగపల్లి రామస్వామిగుప్తగారు ఆ మహాసభకు స్తంభాలు. అదే ఆంధ్రజీవితంలో మొదటి రాజకీయ మహాసభ. ఆనాటి రాజకీయాలు వుద్యోగాలకే పరిమితాలు. ఆ మహాసభలో రాజకీయాలు విద్యార్థులలోకి వ్యాపించాయి. ఈరాజకీయోద్యమాలలో జనించినవారే ఈనాటి ఆంధ్రనాయకులందరూ.

వందేమాతరం వుద్యమం ఆంధ్రనాయకుల నుత్సాహపరచింది. శ్రీయుతులు గాడిచర్ల హరిసర్వోత్తమరావు, చోడినారాయణరావుగారలు బెజవాడనుంచి "స్వరాజ్" అనే పత్రిక ప్రారంభించారు.

ఆనాడు అతివాదులు, మితవాదులు, మధ్యవాదులు ఇంకా కొందరు జాతీయవాదులుగా విభజనలుండేవి. బెంగాలులోని అతివాదరాజకీయాలు ఎక్కడ ఆంధ్రయువకులకెక్కుతవోనని పెద్దలు భయపడుతూండేవారు. అప్పటికే ఆంధ్ర విజ్ఞాన ప్రచారానికి విజ్ఞాన చంద్రికా పరిషత్తు, గ్రంథమాల, హైద్రాబాదునుంచి ప్రారంభమయాయి. శ్రీయుతులు కొమర్రాజు లక్ష్మణరావు, రావిచెట్టు రంగారావు, అయ్యదేవర కాళేశ్వరరావుగారలు వాటిని నిర్వహిస్తూండేవారు.

1908 లో గుంటూరులోని యువజన సాహితీ సంఘంలో ఆంధ్రరాష్ట్రోద్యమభావం జనించింది. శ్రీయుతులు జొన్నాదుల గురునాథం, చల్లా శేషగిరిరావు, చట్టి నరసింహారావు, ఉన్నవ లక్ష్మీనారాయణ, శిష్టు కాంభొట్లుగారలు ఆంధ్రరాష్ట్ర ఆవశ్యకతనొక విశ్వాసంగా భావించారు.

అంతటితో ఆంధ్రరాష్ట్రోద్యమం తలయెత్తింది. ఈ వుద్యమం యావద్భారతానికే నూతనభావంగా, ఊహాజనితంగా కనిపించింది. కృష్ణా, గుంటూరు జిల్లాల విభజనతో అంతకుముందే ప్రారంభమైన కృష్ణాజిల్లా మహాసభనుగూడా రెండుభాగాలుగా చేయవలసివచ్చింది.

ఈ మహాసభను అన్ని జిల్లాలకు సంబంధించిందిగా జరపాలనే అభిప్రాయంవచ్చింది. చివరకు ఆంధ్రరాష్ట్రం కోరుదామనే నవరణ వచ్చింది. పెద్దలకు కోపకారణమయింది. యువకులకు వుత్సాహకారణమైంది. సభలో విఫలులైన యువకులు ఆంధ్రరాష్ట్రం కోరుతూ ఆంధ్రమహాసభ యేర్పరుద్దామనుకొన్నారు. ఆంధ్రోద్యమ నిర్మాణయోచనలు సాగినవి. ఒక నూతన రాజకీయనిర్మాణకార్యక్రమం ప్రారంభమైంది.

## ఆంధ్రమహాసభ

1913 లో ఆంధ్రమహాసభ యేర్పడింది. ఆంధ్రలో చదువుకొన్నవారందరిని ఒకచోట చేర్చగలిగింది. రాజకీయాధికారం రాజకీయ విభాగం ఆంధ్రులకు కావాలనే ఆసక్తి ఎక్కువైంది.

మొదటి ప్రపంచయుద్ధం యావద్భారతానికి కన్ను తెరిపించింది. 1914 లో ఆంధ్ర దినపత్రిక ప్రారంభించడంతో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్రులను మేల్కొల్పారు. మధ్యతరగతి ప్రజలలో చైతన్యం ఎక్కువైంది.

యుద్ధం ముగిసింది. ప్రజలచైతన్యాన్ని అరికట్టడానికి ప్రభుత్వం తీవ్ర నిర్బంధాలు అమలుజరిపింది. నిద్రాణమైన భారతజాతి మేల్కొన్నది. 1919 లో భారతదేశమంతటను జరిగిన హర్తాళ్ ప్రధాన రాజకీయ ప్రత్యక్షచర్యగా పరిణమించింది. అతివాదులు, జాతీయవాదులు, కొంతలోకొంత మధ్యవాదులు భారత రాజకీయపరిణామం గమనించి స్వాతంత్ర్య సంపాదనకు స్వరాజ్యం సాధనంగా పరిగణించారు. అవేభావాలు ఆంధ్రమహాసభ ఆంధ్రోద్యమాలలో బయలుదేరినవి.

ఆంధ్రదేశంలో భారత స్వాతంత్ర్యోద్యమం ప్రత్యక్షచర్యకు పూనుకొన్నది. వాటి ఫలితాలే పల్నాటి పుల్లరినిరాకరణ, పెదనందిపాడు పన్నుల నిరాకరణ, చీరాల పేరాల పురనిర్గమనం మొదలైన వుద్యమాలు వందలాది విద్యావంతులు, యువకులు ప్రభుత్వాన్ని ప్రతిఘటించారు సామ్రాజ్యవ్యతిరేకపోరాటం మొగలో పోరాటం సాగించి నిర్బంధాలకు గురైనారు.

ఈ వుద్యమం తరువాత ఆంధ్రరాజకీయ పోరాటం ప్రత్యక్షచర్యలనుంచి శాసనసభా పోరాటంగా రూపొందింది. 1926–29 లలో ఆంధ్రరాజకీయ చైతన్యం పెంపొందింది. మద్రాసు శాసనసభలో ఆంధ్రనాయకులు ప్రశంసల నందుకొన్నారు. సైమన్ కమిషన్ బహిష్కరణోద్యమంతో ఈదశ వుచ్ఛస్థాయినందుకొన్నది.

1930 ఉప్పుసత్యాగ్రహంలో ప్రజలందరు పాల్గొన్నారు. ప్రభుత్వ నిర్బంధాలు ఎక్కువైనవి. అయినా ఆంధ్రప్రజలు నిలవద్రొక్కుకొని తమ విశిష్టతను ప్రదర్శించారు. గుంటూరు, భాపట్ల, పెనుమద్రు, భీమవరం, గుడివాడ తూర్పుగోదావరి వుద్యమాలు చరిత్రకు రత్నాలు. రాజకీయప్రాంతం సాధించడానికి రాజకీయ స్వాతంత్ర్యంఅవసరమనేవర్గం నాయకత్వం వహించింది. అదే ఆనాటి రాజకీయోద్యమం.

## గాంధి ఇర్విన్ ఒడంబడిక

గాంధి యిర్విన్ ఒడంబడికతో రాజకీయోద్యమం ప్రత్యక్షచర్యనుంచి ప్రత్యక్షప్రతిఘటనకు మారింది. విదేశీ వస్త్రాలు, కల్లుదుకాణాల పికెటింగ్ ఆనాటి రాజకీయోద్యమం. ఈ వుద్యమంలో స్త్రీలు ప్రముఖపాత్ర వహించారు.

1932 లో పండిత నెహ్రూ, సుభాస్ బోస్, సరిహద్దు గాంధీల అరెస్టుతో ప్రారంభమై గాంధీజి అరెస్టుగా పరిణమించిన ప్రజావుద్యమాన్ని ప్రభుత్వం అణచివేసింది. పెల్లుబుకి వుత్తుంగమైపొంగిన రాజకీయవల్లువ నివురుగప్పిన నిప్పై ఆంధ్రభూభాగమంతా అంతర్గతంగా వ్యాపించి తీవ్రాతితీవ్రమయింది.

గాంధీజీ హరిజన ఉపవాసంతో భారత రాజకీయాలు మరొకరూపం దాల్చినవి. హరిజనుల హక్కులరక్షణే ప్రధాన రాజకీయవుద్యమం అయింది. హరిజన సేవ రాజద్రోహం అయింది.

హరిజన దేవాలయప్రవేశం నిజంగా ప్రభు

త్వవ్యతిరేక ప్రత్యక్షచర్య అయింది–లేదా అంతర్యుద్ధమయింది. మానవత్వ సమాన హక్కులకు జరిగిన తీవ్రరాజకీయోద్యమం ఆంధ్రదేశాన్ని కలిచివేసింది. ప్రజలను కదిలించింది.

పన్నులనిరాకరణ, కారాగారయాత్రలు మళ్ళీ ప్రారంభమైనవి. అంతకుముందు ప్రజాప్రతిఘటనలు, ప్రత్యక్షచర్యలుగా నడిచినఉద్యమాలు వ్యక్తిగతశాసనోల్లంఘనలుగా పికెటింగులు, నినాదాల వుచ్చారణగా సాగినవి. హరిజనోద్యమం వ్యక్తిశాసనోల్లంఘనలు రాజకీయపోరాటచిహ్నాలుగానే నిలచిపోయినవి.

1934 - 35 లో నూతన రాజ్యాంగ నిర్మాణం పరిణామరూపంలో వున్నది. శాసననిర్మాణ వ్యతిరేకపోరాటం శాసనసభాపోరాటంగా పరిణమించింది. 1935లో కేంద్రశాసనసభాఎన్నికలు వచ్చినవి. ప్రజాస్వామ్యంలో వున్నప్రతిభ ఎన్నికలసమయంలో ప్రజానీకాన్నంతా ప్రత్యక్షచర్యలలో పాల్గొనేటట్లు చేసింది. ఎన్నికలరంగమే పోరాటరంగమయింది. పార్లమెంటరీ డెమొక్రసీ రాజకీయాలలో ప్రజలు పాల్గొన ప్రారంభించారు. నిజంగా యోచిస్తే రెండే రాజకీయపోరాటాలు. అవి ఇవి: 1. ప్రత్యక్షప్రతిఘటన, 2. ఎన్నికలు.

ఆంధ్రదేశంలో అంతవరకు రాజకీయంగా వెనుకబడిన ప్రాంతంగా భావించబడిన రాయలసీమ ఒక్కుమ్మడిగా బ్రిటిష్‌వారి ఎత్తులకు బదులుచెప్పింది. కాంగ్రెసు తరఫున ఏకైక ప్రతినిధిని ఎన్నుకున్నది. ప్రత్యక్ష పోరాటంలో ముందుకురాలేకపోయినా, ప్రథమంగా యెన్నికలలో పరీక్షకు నిలచింది.

అంతవరకు రాజకీయాలలో అములుజరిగిన హరిజన, ఖద్దరు, స్వదేశీవుద్యమాలు తీవ్రభావాలుగల యువకులకు వర్గసంఘాల అవసరం నిరూపించినవి. పై రాజకీయాలతో విసిగి ఆలోచనలలో పడ్డారు. జైళ్ళలో బెంగాలీ యువకులతో కలిసిన రాజకీయ పరిచయాలు సిద్ధాంతిపరవయాలయ్యాయి. సోషలిజంవైపుకే మొగ్గచూపారు. ప్రజావుస్యమాలంటే ప్రజల అనుదినకష్టాలు తీర్చడమనేభావాలు నిలువనొక్కుకొన్నవి. ఆంధ్రదేశంలో రైతు, కూలీ, మహిళా, విద్యార్థి, యువజన కార్మికసంఘాలు నిర్మాణమవడం, ఆంధ్ర కాంగ్రెసు సోషలిస్టుపార్టీ ఏర్పడడం, కమ్యూనిస్టుపార్టీ ఆంధ్రసభ్యులు ఈ వుద్యమాలు నడిపిస్తూ కాంగ్రెస్‌తో కలిసి పనిచేయడం జరిగాయి.



మహత్తరవ్యక్తి, త్యాగధనుడు, పొట్టి శ్రీరాములు

## వర్గ రాజకీయాలు

అంతటితో ఆంధ్రలో వర్గసంఘాల రాజకీయాలు ప్రారంభమయాయి. అంతకుముందు ప్రభుత్వం, కాంగ్రెసు అనే రెండే రెండు రాజకీయ శక్తులతో ఈ వర్గ సంఘాలలో పనిచేసే యువకులు కాంగ్రెసులోనే వున్నా ఒక శక్తిగా పరిణతి చెందారు. 1936 ఎన్నికలలో కాంగ్రెసు గెలుపుకు ఈ వర్గ సంఘాలు చాలా దోహదమిచ్చాయి. ఈ విషయం ప్రజలు, ప్రభుత్వం, కాంగ్రెసు గమనించడం జరిగింది. ఈ వర్గ సంఘాలు ఆంధ్ర ప్రజా జీవితంలో భాగాలయి పోయ్యాయి. వర్గ సంఘాల ఫలితంగా చిట్టివలస, చీరాల కార్మిక సమ్మెలు ఉద్యమాలు జరిగినవి. ఇవి ప్రకాశంగారి జమీందారీ రద్దు కార్యక్రమ విచారణకు పునాదులయాయి.

కాంగ్రెసు తీసుకునే అంతర్జాతీయ రాజకీయాలు, జాతీయ రాజకీయాలు, ఆంధ్ర ప్రాంతంలోని వర్గ సంఘాల రాజకీయాలు ఆంధ్ర జీవితాన్ని, రాజకీయాలను నిర్ణయించుతూ వచ్చినవి. అంతర్జాతీయ రాజకీయాలలో ఆంధ్రజాతీయోద్యమాశయమగు ఆంధ్రరాష్ట్ర సమస్య కాంగ్రెసు మంత్రివర్గాలు యేర్పడడంతో, ఆంధ్ర రాజకీయాలకు ప్రాముఖ్యమేర్పడి, ఆంధ్ర రాజకీయాలు మద్రాసు రాజకీయాలలో భాగమై అనునయం కానందున అన్ని దృక్పథాల నుంచి ఆంధ్రరాష్ట్రం అవసరమనిపించింది. స్వరాజ్యంలో స్వరాష్ట్రం సాధించుదామనుకొన్న కాంగ్రెసుకు అధికారం కొంతలోకొంత వచ్చినందున ఆంధ్రులు స్వీయరాష్ట్ర పరిపాలనకు రాష్ట్రం కావలెననే ఆందోళన లేవదీశారు.

ఐక్యప్రజావుద్యమాలలో అవి స్వర్ణమయ దినాలు. పరస్పర అభిప్రాయ భేదాలున్నా పురోగమనాన్ని మరింత సుసాధ్యం చేయడానికే అవి ఉపయోగపడినవి. రెండవ ప్రపంచ యుద్ధ సమస్యపట్ల కాంగ్రెసు తీసుకొన్న వ్యతిరేక

# ★ ఆంధ్రలో రాజకీయోద్యమాలు ★

ఉద్యమం గురించి ఆంధ్రలో అన్ని రాజకీయ పక్షాలు తమతమ యోచనల కనుగుణంగా సాగించినవి.

ఏమైనా ఆ నాడు యుద్ధవిధానం కారణంగా ప్రజారక్షణ చట్టానికి గురి కావడం జైళ్లకు పోవడం జరిగింది. ప్రత్యక్ష చర్యకు కాంగ్రెసు పిలుపు ఇవ్వలేదు. అయినా కాంగ్రెసువాదులలో, కాంగ్రెసు సోషలిస్టులు, కమ్యూనిస్టులు (అప్పటికి ప్రత్యేక పార్టీగా వ్యవహరించక పోయినా) వందలాదిగా 1939-40 లలో శిక్షలపాలయారు.

యుద్ధగమనం వచ్చిన మార్పులవల్ల అంతర్జాతీయ రంగంతో పాటు ఇండియా రాజకీయరంగంలో కూడా పరిణామాలు తెచ్చాయి. కమ్యూనిస్టులు ప్రజా యుద్ధ నినాదం తీసుకొన్నారు. యుద్ధ వ్యతిరేకోద్యమాన్ని కాంగ్రెసు తీవ్రం చేయదలచుకొన్నది. కమ్యూనిస్టుపార్టీ ప్రత్యేక కార్యక్రమంతో కార్య విధానంతో ఆంధ్రలో వెలువడింది. కాంగ్రెసుకూడా అంతర్జాతీయ పరిణామాన్ని అవగతం చేసుకొన్నది. బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఒత్తిడిచేయక తప్పదని నిర్ణయించింది. కార్యాచరణకు సంబంధించిన చివరిభాగం మినహా ఎవరూ భేదించజాలని ఒక ఉన్నత తీర్మానాన్ని కాంగ్రెసు 1942 ఆగస్టు 8 న చేసింది.

## విశాలాంధ్రోద్యమం

కమ్యూనిసుపార్టీ ఇదే సమయంలో తెలంగాణాతో కలిసిన విశాలాంధ్ర యేర్పడవలెననే నినాదం తీసుకొన్నది. ఆంధ్ర ప్రజానీకం ఈ నినాదాన్ని హర్షించింది. ఆనాటినుంచి విశాలాంధ్రనినాదం ఆంధ్రుల జాతీయోద్యమంలో మిళితమై విశాలాంధ్ర ఆంధ్రుల రాజకీయ నినాదమైంది.

అంతటితో ఆంధ్ర రాజకీయోద్యమ రూపంలో నేగాక స్వభావంలోకూడా మార్పు వచ్చింది. నిజామ్ నవాబు తొలగాలనే భూస్వామ్య వ్యతిరేకోద్యమం కూడా ఆంధ్రోద్యమంగా పరిణతి చెందింది. అంతకుముందే చిన్నయెత్తున జమీందారీ వ్యతిరేకోద్యమం ఆంధ్రలో నడుస్తున్నా, హైదరాబాదు సంస్థానంలోని తెలంగాణాతో విశాలాంధ్ర యేర్పడాలనడంతో నిజామ్ నవాబు తొలగందే విశాలాంధ్ర సాధించడం కష్టం కనుక భూస్వామ్య వ్యతిరేక నినాదం ఆంధ్ర ప్రజానీకపు జాతీయ నినాదమయింది.

ఆగస్టు తీర్మానం ఫలితంగా ప్రభుత్వ నిర్బంధాలెక్కువై తెనాలి, భీమవరం పట్టణాలు చరిత్రలో శాశ్వతంగా నిలచిపోయాయి. ఈ విషయంలో బీహారు దేశం అగ్రస్థానమైనా ఆంధ్రప్రాంతంకూడా ఏమంత వెనుకపడలేదు.

చివరకు యుద్ధం పూర్తయింది. ఎన్నికలు జరిగాయి. వివిధ పార్టీలు ఎన్నికలలో పాల్గొన్నవి. కాంగ్రెసు ఎన్నికలలో గెలిచింది. ఇదే అదనులో ఇండియా విభజన జరిగింది. భారతదేశం స్వతంత్రపు రిపబ్లిక్ అయింది. ఇటు ఆంధ్ర అటు తెలంగాణాలలో భూస్వామ్య వ్యతిరేకోద్యమం తీవ్రమైంది. రాజకీయ రంగంలో వచ్చిన అనేక సంఘటనలవల్ల ప్రజలు విసిగిపోయారు.

నూతన రాజ్యాంగ ప్రకారం ఆంధ్రలో ఎన్నికలు వచ్చినవి. ప్రజానీకం త్యాగాలు చేసినవారిని ఎన్నికలలో గెలిపించింది. తత్ఫలితంగా యే రాజకీయ పక్షానికి శాసనసభలో పరిపాలనానిర్వహణకు కావలసిన మెజారిటీబలం మద్రాసురాష్ట్ర శాసనసభలో లేకపోయింది. మొత్తానికి కాంగ్రెసు మంత్రివర్గ మేర్పడింది. మద్రాసురాష్ట్ర శాసనసభలో పరిపాలనా రీత్యా జరిగిన కొన్ని సంఘటనలవల్ల ఆంధ్రరాష్ట్ర మేర్పడవలసిన అవసరం మరీ ఎక్కువైంది.

ఆంధ్రనాయకులు, ఉద్యమాలు తేల్చలేని జటిలసమస్యను పొట్టి శ్రీరాములుగారు తమ ఉపవాసంతో ఇచ్ఛామరణంతో తేల్చివేసి ప్రజలకొక కొత్త నాయకత్వమిచ్చారు. ఆ సందర్భంలో జరిగిన ఉద్యమాలకు ఏ పార్టీలు, ఏ నాయకులు నాయకత్వం వహించలేదు. విద్యార్థులందరు ఎవరికి వారు నాయకత్వం వహించారు. అంతటితో ఆంధ్రోద్యమంలో నూతన దశ వచ్చింది. ఆంధ్రుల చిరకాలవాంఛ ఫలించింది. ఆంధ్రులకు కర్తవ్యం నిరూపించడానికి గోదావరి వరదలు వచ్చాయి.

1939 వరకు ఆంధ్ర దేశంలో కాంగ్రెసు సంస్థలో జరిగిన సామ్రాజ్య వ్యతిరేక ఐక్య ప్రజా సంఘటనలవంటివి నేడు జరగడం అసంభవం. అయినా కరువు కాటకాల నిర్మూలనకు, వరదల నరికట్టడానికి, నిరుద్యోగం మొదలైన సమస్యల పరిష్కారానికి శాశ్వతశాంతికి ఐక్య ప్రజా సంఘటన సాధించాలి. అందుకు జరిగే ప్రయత్నాలే భావిష్యదాంధ్ర రాజకీయోద్యమాలవుతవి.

ఇతర భాషాధారక రాష్ట్రాలు ఏర్పడడానికి ఆంధ్రరాష్ట్రం ప్రాతిపదిక అని అందరూ ఎదురు చూస్తున్నారు. ఆంధ్ర రాష్ట్రంసాధించి చరిత్రను నిర్మించిన మనం ఈ చారిత్రకబాధ్యతను నిర్వహించి విశాలాంధ్రనుకూడా సాధించి, భారతజాతిలో ఆంధ్ర దేశం సుజలమై, సుఫలమై, మలయజ శీతలం కాగల విధంగా ఆంధ్రజాతిని సస్యశ్యామలం చేద్దాం. ఆ నాడు ఆంధ్రమాతి పదాలకు వందేమాతరం సమర్పించుకుందాం. ఆ నాడు తెలుగుతల్లి మంచి రాజ్యం అని ఆశీర్వదించగలదు. అందుకై ముందు నిరాడంబరంగా స్వచ్ఛందత, త్యాగాలతో సేవాకృషులతో సర్వాంధ్ర నిర్మాణాన్ని సాగిద్దాం. జై ఆంధ్రా!



ఆంధ్ర రాష్ట్రానికి మొట్టమొదటి ముఖ్యమంత్రి:
టంగుటూరి ప్రకాశంపంతులు



ఆంధ్ర రాష్ట్రానికి మొట్టమొదటి గవర్నరు:
చందూలాల్ మాధవలాల్ త్రివేదీ




పాపికొండలకు తెల్లమబ్బుల తోరణాలు కట్టి, కోనసీమగడపలకు కొత్త పసుపు ముద్దలుపూసి, ఆకుపచ్చ పట్టుచీరగోచీ పోసి ధరించి శ్రావణ గౌరి నోములపూజకు సన్నాహాలు సంపూర్తి చేసింది కల్లోల గౌతమి. పురోహితుడు వచ్చే వేళయింది. ఆకాశపు అద్దంలో తన ముఖాన కుంకుమబొట్టు సరిదిద్దుకొన్నది. కాని ముఖారవిందంలో ఏదో లోపం కన్పించింది అఖండ గోదావరికి.

తను పొద్దున అభ్యంగన స్నానమాచరిస్తూ పాపికొండ బోడుమీద వుంచిన పెళ్లినాటి ముక్కుపుడకఏదీ? తన హిమగిరి, సహ్యాద్రి చిన్న వజ్రాలు పొదిగిన ముక్కుపుడక, శంకరుడిచ్చిన ముక్కుపుడక కనిపించలేదు. క్షణంలో పురోహితుడు రానున్నాడు. వెల్లువల క్రిష్ణమ్మ, తన పొరుగింటి యిల్లాలి యింటినుండి మంగళ వాయిద్యాలు వినిపించినవి. క్రిష్ణమ్మ, నోము నోచు కోనూ నోచుకొన్నది. మహాఘోషగా మంత్ర పుష్పవాక్యాలూ వినిపించినవి. ఆ యింటి మహానైవేద్యపు కమ్మని ఘుమ ఘుమ పిల్లతెమ్మెరయై పాపికొండల కనుమల నడుమవీచింది. గోదావరి ఆత్రుత పడ్డది. కాని తన ముక్కుపుడకే మాయమైనది. శంకరుడువచ్చి తన బోసిముక్కుపై దృష్టి సారించకమానడు. "నీ ముక్కునత్తు ఎక్కడ?" అని అడుగకమానడు. అఖండ గౌతమి హడావిడి పడటం చూసి రాణ్మహేంద్రపురి శ్యామలాంబ యీసడింపుతో ఫక్కున నవ్వింది. వెల్లువల క్రిష్ణమ్మ విజయ గర్వంతో వూగులాడింది. గౌతమి కల్లోలితమైంది.

ఆమెకా అవమానం; ఆమెకా, శంకరి అయిన ఆమెకా? శివంకరి అయిన ఆమెకా దాక్షాయని అయిన ఆమెకా? అఖండమై, అనన్యమై యుగయుగాల వైభవంతో, తరతరాల శృంగారంతో వెలుగొందిన తనకాయీ అవమానం? ఆమె అట్టహాసం చేసింది.

"ఓసముద్రుడా! నా ముక్కునత్తెక్కడ?" ఆది కాలం నుండి, సృష్టి విఘ్నేశుడి పూజ నుండి తన అంతరాత్మలోని అశాంతితో ఘూర్ణిల్లుతున్న సముద్రుడు తనలో తాను మాట్లాడుకొన్నాడు. కాని శివంకరికి జవాబివ్వలేదు. అగ్నికి ఆజ్యం అభిషేకం చేసింది.

సెమకళ్ళువచ్చి నాట్యమాడినట్లే ఆడి వజ్రాల పుడకను ముక్కున కరుచుకొని, ద్రాక్షారామ భీమేస్వరుని ముందు విసిరివేసినవో లేక భద్రాద్రి రాముని పాదాభినయనానికి వదిలివేసినవో? తన పెండ్లినాటి అరణపు సొమ్ము యీ ఆంధ్రదేశంలో ఏ మూల జారవేసినవో మాయదారి మయూరాలు. ద్రాక్షారాముడు తనకు పట్టనట్లూరుకున్నాడు. భద్రాది రఘురామయ్య-పవ్వళించి లేవనేలేదు. గోదావరి పరవళ్ళు తొక్కింది. ఇంతై, అంతై, బ్రహ్మాండమే తానై చిందులు తొక్కింది. పొంగింది. ప్రళయమైపారింది. వాకయై మినువాకగా మారింది. జలనృత్యంచేస్తూ వెదుకబోయింది.

వెదుకబోయింది వాకతిప్ప, యండగండి, కూర్మపురం, అంజారు, వెంటూరు, పామర్రు, కూళ్ళ, కావేరు, కొత్తపేట, పాతకుంపేట, కూరంపూడి, పైడిపాక, పోలవరం, రామయ్యపేట, మామిడిగొంది, కొత్తూరు, సింగనపల్లి, కపిలేశ్వరపురం, కోటిలింగాలు, కోటిపల్లి, ముక్తేవి. ఒక వూరులేదు, ఒకవాడగాదు.

* * *

వరదలో రాజన్న ఉప్పుకొట్టు కొట్టుకుపోయింది. అవుదూడ మునిగిపోయింది. ఇల్లు కూలిపోయింది. అవునమ్మి నెలకిందట తెచ్చిన నూటఅరవై, చచ్చి స్వర్గానవున్న ముసలిదాని చిన్న అరటితోట అమ్మగా వచ్చిన ఆరువందలూ, అయేడు పుష్పాల్లో లాభం, తనవంతు రొండొందల ముప్పై - మొత్తం పది తక్కువగా వెయ్యిరూపాయల పెళుసు నోట్లు మూరులో పెట్టుకొన్న పాత కప్పుతో పాటు గోదావరి గర్భాన కైంకర్యమయినాయ్. రాజన్న భాగ్యవంతుడుగాదు. యింతడబ్బూ చేతికందే మూరులో దాచటానికి. ఉన్నదల్లా ఉప్పుగోతాలూ, ఈ నోట్లూ, అంతే. ఆ నోట్లయినా తనవుగాదు. తన అల్లుడు నూకయ్యకోసం పోగుచేసినవి. పోగుజేసి, పోగుజేసి నాలుగేళ్ళనుండి తన కూతురు అప్పమ్మ నేలుకొనమని భీష్మించుకు కూచున్న అల్లుడికి అల్పాహారంగాపోసి

(54-వ పేజీ చూడండి)

# జారుడు మెట్లు

వా. స. మూర్తి

నాకప్పుడు పన్నెండేళ్లు; సీతికి తొమ్మిది. ఆ రోజుల్లో వానలు వచ్చాయంటే మాకు ఎంతో సంబరంగా ఉండేది. వానల ఉపయోగాలని గురించి బడిలో వ్యాసాలు రాశాము కాని, పంతుళ్లు రాయనీయని ఉపయోగాలు కొన్ని మా కతి ముఖ్యంగా కనిపించేవి. అవి ఏమంటే: ఒకటి, బడికి పోనక్కరలేదు; రెండు, పుస్తకాలొకమూల పడవేసి సీతా, నేనూ ఇంకొక మూలచేరి కథలూ, కబుర్లూ, చెప్పుకోవచ్చు; మూడు, వాన మధ్య మధ్య తెరపి యిచ్చినప్పుడల్లా కాగితపు పడవలు చేసి నీళ్లలో వదులుతూ వాటి వెనకాల బట్టలు పైకి పట్టుకొని పరుగెత్తుతూ ఒళ్లంతా నీళ్లు చల్లుకుంటూ గంతులు వేయవచ్చు.

మా కోరికతీరా వానలు వచ్చాయి. రాత్రినుంచీ ఒకటే కుంభపోతగా వానకురుస్తోంది. ఆ ప్రొద్దున్న మేము రోజూ కన్న ఉత్సాహంతో లేచి, త్వరగా మొగాలు కడుక్కొని, చద్దన్నాలు తిని, వీథిచావిట్లో ఒకమూల చేరాము. చలిగా ఉందని సీతి దుప్పటి తెచ్చింది. ఇద్దరం ఆ దుప్పటే కప్పుకొని దగ్గరగా కూర్చున్నాము. ఇంతలో కిష్టిగాడు వచ్చి "నేకూడా మీతో కూచుంటా" నన్నాడు - పెంకి వెధవ! వాడంటే నాకు చెడ్డ అసహ్యం. కాని వాడి నేమైనా అంటే అత్తయ్య మామీద విరుచుకుపడుతుంది. అందువల్ల, వాడిని నా పక్కన కూర్చోమని దుప్పటి కొంచెం ఎడం చేశాను. కాని వాడువచ్చి మా యిద్దరి మధ్యా కూర్చుంటానని పేచీపెట్టాడు. వాడెప్పుడూ అంతే - పానకంలో పుడక! అలాగే కూర్చోనిచ్చాం. మరి ఏంచేస్తాం? పోనీ కూర్చున్నవాడు ఊరికే ఉండవచ్చా, ఉహుఁ, అలా ఊరుకోడు. మేమేం చెప్పుకుంటే అది ఇక్కడనుంచే పెద్దగొంతుకతో అత్తయ్యకు చెప్పివేస్తాడు. కాబట్టి, మేమేమీ కబుర్లు చెప్పుకోడానికి వీలులేకుండాపోయింది. మరి చేసేది లేక వానకేసి చూస్తూ కూర్చున్నాము.

వాన జడికట్టి కురుస్తోంది. మా కాంపౌండు గోడా, గేటూ, ఎదర ఇళ్లూ, చెట్లూ, ఆ చెట్లమీద కాకులూ అన్నీ సన్నని గుడ్డ తెరలోనుంచి కనిపించినట్లుగా మసక మసకగా కనిపిస్తున్నాయి. మా అత్తయ్య చూరుక్రిందపెట్టిన రెండు బిందెలూ నిండి నీళ్లు పొర్లిపోతున్నాయి. మూడో బిందె ఇంకా నిండలేదు. ఠణ, ఠణ చప్పుడు చేసుకుంటూ ధారపడుతోంది. పెరడంతా నీటితో నిండిపోయి చిన్న చెరువులా తయారైంది. వాన ఎప్పుడు తెరపి యిస్తుందా, ఎప్పుడు కాగితపు పడవలు వదులుదామా, ఎప్పుడు నీళ్లలో గంతులు వేద్దామా అని ఎదురుచూస్తున్నాం. గేటు కొట్టిన చప్పుడైంది. "మామయ్య వచ్చాడు" అంటూ నేనూ, "నాన్న, నాన్న" అంటూ సీతీ, కిష్టిగాడూ ఒక్కసారే అరిచాము. నన్ను గొడుగు వేసుకొని వెళ్లి గేటు తీయమని అత్తయ్య వంటింట్లోనుంచే కేక వేసింది. నీళ్లలో దిగేందుకు మంచి అవకాశం దొరికిందికదా అని నేను ఒక్క ఉరుకులో గొడుగు తీసుకుపోతూంటే, సీతి తనుకూడా వస్తానంది. కిష్టిగాడు అంతకు ముందే తయారు! వాళ్ళ నిద్దరినీ ముందు పెట్టుకొని కాళ్ళతో నీళ్లు తోసుకుంటూ వెళ్ళి గేటు తీశాను.

మామయ్య కాదు!—ఎవరో కొత్త మనిషి. ఎత్తుగా, నల్లగా లావుగా వున్నాడు. పంచ పైకి కట్టుకొని ఒక చేతిలో సంచీ, రెండో చేతిలో తెల్లగుడ్డ వేసిన గొడుగూ పట్టుకొనిఉన్నాడు. ఆయనను చూస్తే మాకు భయంవేసింది. 'ఎవరూ ఎవరికోసం వచ్చారు' అనేవి అడగడం మరచిపోయాము. ఆయనకూడా మమ్మల్ని ఏమీ అడగకుండా లోపలికి వస్తున్నాడు. మేము గేటు వేయకుండానే వెనకకు తిరిగాము. "ఇక్కడా ఒక సముద్రంలా ఉందే!—ఏం వానలు, ఏం వానలు" అంటూ మెల్లగా రహదారి పడవలా ఆయన మావెనకాలే వచ్చాడు. మామయ్యేమోనని అత్తయ్యా, సుబ్బులు వదినా గుమ్మంలోకి వచ్చి, ఎవరో కొత్తమనిషి రావడం చూసి 'ఎవరీయనా' అని ఆశ్చర్యపోతూ అలాగే నిల్చొనిపోయారు.

మేము పైకి వచ్చాము. మా వెనకాల వస్తూ ఆయన క్రిందిమెట్టుమీద అడుగువేసి జర్రున జారాడు. అక్కడ జారుడుగా వుందన్న సంగతి ఆయనకు చెప్పడం మరచిపోయాం మేము. జారడం జారడం ఆయన నీళ్లతో నిండిన బిందెలు దొర్లించివేసి గచ్చు మీదనుంచి తిన్నగా నీళ్లలోకి పోయాడు. బిందెలు కూడా ఆయన వెనకాలే దొర్లుకుంటూపోయాయి. మేంముగ్గురం ఫకాలున నవ్వేశాం. మా అత్తయ్యా, వదినలకి కూడా నవ్వాగలేదు. వదిన పక్కకు తప్పుకుంది. ఆయన 'అమ్మో, అమ్మో' అంటున్నాడు. కాని మేము నవ్వాపుకోలేకపోతున్నాము. ఏం చెయ్యాలో తోచడంలేదు. అంతలో అత్తయ్య నవ్వాపుకొని, కొత్తమనిషి అన్న సంకోచం ఎలాగో వదులుకొని, "రండ్రా. ఆయన్ని పైకి లాగుదాం, పాపం" అంటూ ఎదరకు వచ్చింది. వదినా, మేమూ అంతా కలిసి ఆయన్ని పైకి లాగడానికి ప్రయత్నించాము. కాని సామాన్యంగా కదులుతుందా ఆ పర్వతాకారం! పైగా నీళ్లలో ఉన్నాడాయె! ఉన్న శక్తి నంతా ఉపయోగించి ఎలాగో ఆయనను గచ్చుమీదకు యీడ్చాం. తల పట్టుకొని నడుంవరకూ ఎత్తాం. ఆయన కూడా ప్రయత్నంచేసి లేచాడు. ప్రభను లేపినంత ఆనందం కలిగింది మాకప్పుడు. మేమంతా ఇవతలికి వచ్చాము. ఆయన బట్టలన్నీ పూర్తిగా తడిసిపోయాయి. సంచీ మా యింటి పై గుమ్మంలమీదే పడిపోయింది కాబట్టి అందులోవి మాత్రం తడవలేదు. ఆయన కాళ్ళు కడుక్కొని, తడిబట్టలు విప్పేసి, పొడివి కట్టుకున్నాడు. తడిబట్టలు పిడిచి, మాకడ్డంగా వీథి కనపడకుండా ఆరగట్టి, కుర్చీలో కూర్చున్నాడు. మేము మా స్థానం మార్చుకోవలసి వచ్చింది. వీథి కనబడేటట్లు ఇవతలవైపుకు వచ్చి కూర్చున్నాము.

ఆయన నన్నడిగాడు: "రామయ్యగారు లేరా?"

"లేరండీ, ఊరు వెళ్లారండీ" అన్నాను.

"ఊరా! ఎందుకూ?"

"మా సుబ్బులు వదినకు ఏదో సంబంధం ఉందట, చూడడానికి వెళ్లాడండీ."

నేను ఈమాట అన్నానో లేదో ఆయన ఎగిరి గంతువేశాడు. నిజంగా ఎగరలేదు లెండి, కాని అంత పనీ చేశాడు. కుర్చీ గట్టిగానే మూలిగింది. కళ్లు పెద్దవిచేసి నాకేసి వింతగా చూశాడు. ఎందుకలా చూస్తున్నాడో నాకర్థం కాలేదు. ఆయన

మళ్ళీ ఇంటి కప్పువైపు చూస్తున్నాడు. ఇంతలో మా సుబ్బులు వదిన కాఫీ పట్టుకు వచ్చింది. ఆయన మా వదినకేసి తేరిపార చూడసాగాడు. వదినకు భయంవేసి గ్లాసు అక్కడపెట్టి లోపలకు పరుగెత్తింది. అంత పెద్దమనిషీ మా వదినకేసి అలా చూడడం నాకు చెడ్డ ఆశ్చర్యం వేసింది. ఆయన నా వైపుకు తిరిగి "రామయ్యగారు మీ నాన్నగారేనా ?" అని అడిగాడు.

"కాదండీ మామయ్య అవుతాడ"న్నాను.

"ఆ పిల్లలూ ?" అని ప్రశ్నించాడు.

వాళ్లు మా మామయ్య రెండో కూతురూ, కొడుకూ అనీ, సుబ్బులు వదినే పెద్దకూతురనీ చెప్పాను. ఆయన ఆలోచిస్తూ కూర్చున్నాడు.

గేటులో ఏదో గుర్రపుబండి వచ్చి ఆగింది. ఈవేళ చుట్టాలమీద చుట్టాలు వచ్చి పడుతున్నారు, ఏదో విశేష ముండాలి అనిపించింది నాకు. బండివాడు ముందుకు వంగి, "అబ్బాయిగారూ, ఇలా రాండి" అని కేకవేశాడు. నేను గొడుగు తీసుకొని వీధిలోకి పరుగెత్తాను. "కొవ్వూరి రామయ్యగారి యిల్లు యిదేనా, అబ్బాయిగారూ," అని అడిగాడు బండివాడు. "ఏ కొవ్వూరి రామయ్యగారు?" అని నే నడిగాను—మామయ్య తన పేరూ, ఇంటిపేరూ గలవారింకా నలుగు రీఊళ్ళోనే ఉన్నారని చెప్పాడు కాబట్టి. బండిలో నుంచి పెద్ద రంకె వినబడింది: "కొవ్వూరి రామయ్యగారి యిల్లు ఇది అవునా కాదా?" అని. ఆ కంఠంవరస చూస్తే ఆయన ఎవడో బండి దిగివచ్చి కొడతాడేమో ననిపించింది "ఇదేనండి" అని అక్కడ ఆగక లోపలికి పరిగెత్తుకు వచ్చాను.

ఒక ఏభైఏళ్ళ ఆయనా, ఒక ఇరవైఏళ్ల కుర్రవాడూ, వెనకాల చిన్నపెట్టె చేతిలో తీసుకొని బండివాడూ వచ్చారు. 'మెట్టు జారుతుంది' అంటూనే ఉన్నాం: ఆ పెద్దాయన అక్కడే అడుగువేసి జారాడు. చటుక్కున ఇరవైఏళ్ళ కుర్రవాడూ, బండివాడూ పట్టుకున్నారు కాని లేకపోతే అంతకు ముందువచ్చినఆయన గతే ఈయనకూ పట్టేది. ఆయన ఇవతలికివచ్చి బండివాడికి డబ్బులిచ్చివేసి, "ఈ వానలలో ఏ పనీ పెట్టుకోకూడదండీ. కాని వస్తామని



"మీరు కనుక అలా చేశారు. మాలాంటి వాళ్ల దేముందండీ? ఒక్క పిల్లకే పెళ్లి చేయలేక తన్నుకులాడుతున్నాం" అన్నది అత్తయ్య.



# జారుడు మెట్టు



చెప్పినతర్వాత రాకపోతే బాగుండదని వచ్చాం. సగందారిలో పట్టుకుంది ఈ దిక్కుమాలిన వర్షం" అన్నాడు. ఆమాట వినేసరికి గుమ్మంలో నిలుచున్న మా అత్తయ్య చేటంత మొగమూ రెండు చేటలంత అయింది. మా వదిన తలవంచుకొని లోపలికి ఒక్క పరుగు తీసింది. అంతకు ముందువచ్చిన ఆయన కొత్తవాళ్ళకేసి చురచుర చూస్తున్నాడు. వచ్చినవాళ్లుమాత్రం ఆయనకేసైనా చూడలేదు. అత్తయ్య, "అవిగో; ఆ నీళ్ళతో కాళ్లు కడుగుకోండి, బాబూ! వేన్నీళ్లు కాస్తాము. నీళ్లు పోసుకుందురుగాని" అని వాళ్ళతో చెప్పి మమ్మల్ని లోపలికి రమ్మంది. తలొకరికీ తలోపని అప్పజెప్పి, అటూ ఇటూ పరుగెడుతూ, అందరినీ నానా కంగారు పెట్టేస్తూ, మా వదినతో "ఒసేయి, త్వరగా నీళ్లుపోసుకొని కొత్తబట్టలు వేసుకోవే. నువ్వేం పనిచేయనక్కర్లేదులే" అంటూ ఎన్నడూ లేని ప్రేమంతా ఒక్కమారు వెళ్లబోసింది.

ఈ హడావుడిఅంతా ఏమిటో మాకింకా బోధపడలేదు. వెళ్లి వదిన నడిగాను— సంగతేమిటని. వదిన ముసిముసి నవ్వు నవ్వుతూ నా బుర్రమీద ఒక్క మొట్టికాయ పెట్టింది. మొట్టికాయ అవసరమేమిటో బోధపడక బుర్ర రాసుకుంటూ వుండగా కిష్టిగాడు నాదగ్గిరకి వచ్చి "అక్కయ్యకు పెళ్లివారురా, బావా" అంటూ చెవిలో ఊదాడు అంతత్వరగా ఎలా గ్రహించివేశాడో కాని—అందుకే అప్పుడప్పుడనుకునేవాడిని కుళ్ళుమోతు కిష్టిగాడికి తెలివితేటలుకూడా పెట్టి భగవంతుడు చాలా అన్యాయం చేశాడని. ఇంతలో "ఒరే సత్యం, త్వరగా నీళ్ళు కాచమంటే అటూ యిటూ తిరుగుతావేమిరా," అంటూ అత్తయ్య తరుముకు వచ్చింది. ఆ దిక్కుమాలిన కట్టెలు కళ్లు పోయేటట్లు పొగ చిమ్మతాయి కాని ఎంతసేపటికీ మండవు. ఎలాగో తంటాలుపడి నీళ్లుకాచే 'డ్యూటీ' పూర్తిచేసుకున్నాను. 'పెళ్లికొడుకూ,' (ఇంకా కాకపోయినా, అయినట్లే మేం భావించాం.) ఆయన తండ్రీ నీళ్లుపోసుకొని, బట్టలు వేసుకొని హాలులో కూర్చొని ఏమో చెప్పుకుంటున్నారు. 'పెళ్ళికొడుకు'ని తనివితీరా చూడాలన్న కుతూహలమొకవైపు లాగుతూంటే, వంటింట్లో పిండివంటల గుమగుమ లింకొకవైపుకు లాగుతూ వుంటే మేము సందిగ్ధావస్థలో పడ్డాం. ఆఖరికి కమ్మకమ్మని వాసనలు బాగా ఎక్కువయ్యేసరికి ఆగలేక పొయ్యిదగ్గర అత్తయ్య చుట్టూ చేరి గుటకలువేస్తూ కూర్చున్నాం సీత, నేనూ—కిష్టిగాడి సంగతి సరేసరి! పెళ్ళివారి ధర్మమా అని అత్తయ్య గారెలు, బజ్జీలూ తయారు చేస్తోంది. చేస్తూ తెగ విసుగుకుంటోంది: "సమయానికే రావాలీ ఆ ఘటంకూడా. చేసిందంతా తనే చెల్లించేటట్టున్నాడు. ఆ విఘ్నేశుడి పొట్ట కిదే దరి!" మేముకూడా కంగారుపడ్డాం— చివరికి మాకేమీ మిగలవేమోనని మా భయం మాది! ఉన్నట్లుండి కిష్టిగాడి కేం తోచిందో కాని, పరుగెత్తి వెళ్లి ఆ నల్లటి పెద్దమనిషి దగ్గరకుపోయి, "మా నాన్న రాలేదు; మీ రింకా ఇక్కడే వుంటారా?" అని అడిగాడు. అత్తయ్య తనకొడుకు అతి తెలివితేటలకి నాలుక కరచుకుంది. నేను పోయి కిష్టిగాడిని మెడపట్టుకుని యివతలకి లాక్కొచ్చాను.

వంటలయ్యాయి. 'పెళ్ళివారి'ని లేవమన్నాం. లావుపాటి ఆయననుకూడా లేవమన్నాం. ఆయన రెండుమూడుసార్లు అరుగు చివరకు వెళ్ళి చేయి చాపి వాన చూశాడు. ఇవతలికి వచ్చి మావంక తెల్లబోతూ చూశాడు. చూసిచూసి చివరికి మడికట్టుకు వచ్చాడు. మేము భయపడ్డట్టుగా ఏమీ జరగలేదు. మా అత్తయ్య జాగ్రత్తగా చూసి వడ్డించిందికూడా. ఆ నల్లటి ఆయన పూర్తిగా తినలేదు. పాపం, చాలా మంచివాడే ననుకున్నాం. నిజానికి చెప్పవలసివస్తే 'పెళ్లికొడుకు' తండ్రే తృప్తిగా భోంచేశాడు. భోజనమయిన వెంటనే అన్నాడు: "రామయ్య గారు బహుశా ఈ వర్షంలో రాలేరు. కాబట్టి ఆ చూపుల తతంగ మేదో త్వరగా కానిచ్చివేయండి. వర్షంలో తడిశాను. ఏ జ్వరమేనా వస్తుందేమో - అనుమానంగా ఉంది." - అలాంటి వాడు అంతగా మెక్కడ మెందుకో? తరువాత మూలిగి మమ్మల్ని చంపేందుకు! అత్తయ్య అలాగేనంది.

హాలులో కూర్చున్నారు వాళ్లు. మేము కూడా వాళ్లపక్కనే చేరాము. కొద్దిసేపటికి సుబ్బులు వదిన అలంకరించుకు వచ్చింది. సిగ్గుపడుతూ తలవంచుకొని ఒక పక్కగా నిలుచుంది. అప్పటి సుబ్బులు వదినను చూసి మేమే ఆశ్చర్యపోయాము. నామట్టుకు నాకు మా వదినంత అందకత్తె ప్రపంచంలో మరొకతె ఉండదనిపించింది. కాదని ఎవడేనా అంటే వాడితో కుస్తీ పట్టేసేవాణ్ణి. సీత కూడా పెద్దదైన తర్వాత అలాగే అవుతుంది కదా అనుకొంటూ, దానివంక చూశాను. సీతలో అప్పుడే ఆ ఛాయలు కనిపించాయి. 'పెళ్లికొడుకు' వదినకేసి కళ్లప్పగించి చూస్తున్నాడు. అతని తండ్రి "ఏదీ, ఒక పాట పాడమ్మా" అన్నాడు. పాట విషయానికి వస్తే మా సుబ్బులు వదినచేత పాడించక పోవడమే మంచిదని మా అభిప్రాయం. మా అభిప్రాయం ఎలా ఉన్నా, ఆయన చెప్పడం మూలాన, అత్తయ్య వెనకనుంచి పొడవడం మూలాన వదిన పాటకు వుపక్రమించింది. 'పెళ్లికొడుకు' అమృతం తాగినంత ఆనందంగా వదినపాట వింటున్నట్లు స్పష్టంగా తెలుస్తోంది. కాని వదిన మధ్యలోనే పాట ఆపేసింది. మంచిపనే చేసిందనుకున్నాము మేము. తండ్రి అన్నాడు. "పోనీలే అమ్మా, అంత సిగ్గుగా ఉంటే వద్దులే...ఏదైనా ఒక మంచం వాల్చు అమ్మా; చలివేస్తోంది."

కంగారుగా పక్క వసారా గదిలో మంచం వేసి పక్కవేశాం. ఆయన 'ఉహుహు,' 'అహహ,' 'హరిహరీ,' 'శ్రీహరీ' అంటూ వణకిపోతున్నాడు. దుప్పటీ కప్పి ఆయన పక్కనే కూర్చున్నాడు కొడుకు. కొంతసేపటికి చలి తగ్గి జ్వరం వచ్చినట్లుంది. ఆయన కళ్ళుమూసుకొని మూలుగుతున్నాడు. తండ్రి గాభరా కొంత తగ్గినతర్వాత 'పెళ్లికొడుకు' ఇవతలికి వచ్చాడు. నన్ను పిలిచాడు. దగ్గరకు వెళ్లి ఇట్టే స్నేహం కలిపివేసుకున్నాను. కిష్టిగాడు కూడా ప్రయత్నం చేశాడుగాని వాడిది ఒకరితో స్నేహం చేయగల స్వభావం కాదు. అందువల్ల నన్నుచూసి కుళ్లిపోతూ ఉంటాడని నాకు తెలుసు. నేను 'పెళ్ళికొడుకు'కు (-ఇక గోపాలరావు అంటాను, స్నేహమయింది కాబట్టి-) నా పుస్తకాలూ వగైరాలన్నీ చూపించాను. వదిన అల్లిన అల్లికలూ, మాకు వేసిపెట్టిన బొమ్మలూ కూడా చూపించాను. అతనిచేతకూడా కొన్ని బొమ్మలు వేయించుకున్నాను. బోలెడన్ని కత్తిపడవలూ, జంటపడవలూ, స్టీమరూ కూడా తయారుచేయించుకున్నాను. నాతో మాట్లాడుతూండగా అతని చూపులు చాలాసార్లు మా యింటి లోపలి గదివైపు పోతూ ఉండడం గమనించాను. పోయి సీతతో కథలో మేము నడిపించవలసిన భాగం విషయం చర్చించ సాగాను.

ఇంతలో దొడ్లోనుంచి "చచ్చానర్రో" అంటూ ఒక పొలికేక వినిపించింది. దొడ్లోకి పరుగెత్తాం. నూతి గచ్చుపళ్లెం మీద అత్తయ్య గిరగిర తిరుగుతోంది. మేము పైకి లేవనెత్తడానికి ప్రయత్నిం

చాము. కాని లేస్తేనా? మా అత్తయ్య కాయం కూడా చెప్పకోదగ్గదే. లేవడం మాట అటుంచి మమ్మల్ని కూడా క్రింద పడవేసేటట్లుంది. ఇంతలోకి గోపాలరావు అక్కడకు వచ్చి "అయ్యో, పాపం" అంటూ ముందుకు వచ్చాడు. అతనిని చూసి సిగ్గుతో మా వదిన అత్తయ్య సమాంతంగా వదిలేసింది. అత్తయ్య అరవసాగింది "అదే మిటే అలా వదిలేస్తావు? త్వరగా పైకి ఎత్తండే. వానలో తడిసిపోతున్నాం" అంటూ. గోపాలరావు ఒక చేయి పట్టుకు న్నాడు. వదిన రెండో చేయి పట్టుకోవలసి వచ్చింది. కాని ఒకరి మొగాలొకరు చూసు కుంటూ అత్తను ఎత్తడం మానేశారు. వాళ్ల మొగాలు చూస్తూ మేమూ ఎత్తడం మానేశాం. అత్తయ్య అరుపులు ఎక్కువయే సరికి ఆఖరికి ఎలాగైతేనేం లేవనెత్తి లోప లికి తీసుకువచ్చాం. "దిక్కుమాలిన వర్షం! ఒకటే జారుడు! కాలు బెణికిపోయింది గట్టి సమయంలో పని చేసుకోకుండా" అను కుంటూ వంటింట్లో చాపమీదకు చేరింది.

వదినే అన్ని పనులూ చేయవలసివచ్చింది. ఇదే మాకు మంచిసమయమని సీతా నేనూ కలిసి వదిన ఉన్న సమయంలో గోపాల రావునీ, గోపాలరావు ఉన్న సమయంలో వదిననీ ఒకే గదిలోకి వచ్చేటట్లు చేసి, వెన కకు తిరిగి తప్పకోకుండా అడ్డుపడి వాళ్ల దొంగచూపులూ, నవ్వులూ చూసి నవ్వుకుం టున్నాం. కిష్టిగాడు వెళ్ళి మేమిలా చేస్తు న్నామని తల్లికి రిపోర్టు చేశాడు. అత్తయ్య వాడి బుగ్గ పట్టుకొని గట్టిగా నలిపేసింది - అదీ! అదీ! బాగా అయింది వెధవకి అంటూ గంతులు వేశాను నేను. ఎన్నడూ చీమంత మాట అనని అమ్మ ఈనాడు ఇలా మారిపో యిందేమా అని తెల్లబోతూ ఏడవకుండానే ఊరుకున్నాడు వాడు. సీతీ, నేనూ కలిసి వదినా, గోపాలరావుల చూపు లెన్నిసార్లు కలుసుకున్నాయో జాగ్రత్తగా లెక్క పెట్టుకుంటున్నాం. మా లెక్కలలో ఏమైనా తేడా వస్తే సీతిదే 'రైటు'ని పేచీ లేకుండా చూసుకొన్నాను.

రాత్రి భోజనాలు కూడా అయ్యాయి. పడకల ఏర్పాటు కూడా అయింది. నేనూ, గోపాలరావు అన్నయ్య (ఇప్పుడు మా స్నేహం చుట్టరికంవరకూ వెళ్ళిపోయింది లెండి) ఒకే మంచంమీద పడుకున్నాం. అవకాశం దొరికింది కాబట్టి ఇక మా వది నను గురించి వర్ణించడం మొదలుపెట్టాను. కావాలంటే, మా వదినఅంత మంచిదీ, చక్కనిదీ, నేర్పుగలదీ ఇంకొకరుండరని బల్లగుద్ది చెప్తానన్నాను. అతను కాదం టేగా! వదినను గురించి ఎంత విన్నా అత నికి తనివితీరేటట్టు లేదు. ఇంక ఏకొద్ది సందే హం కూడా లేకుండా చేసుకోవాలని అందుకు, 'మనం మనం ఇక ఒకటే కాబట్టి, మనలో మనకి భేదా లేమిటి, మా వదిన అంటే నీకు పూర్తిగా ఇష్టమేనా' అని అతనిని నిలవదీసి అడిగివేశాను. "మీ వదిన చాలా బాగుంటుంది" అన్నాడతను



# జారుడు మెట్టు



మెల్లగా, కొత్త పెళ్ళికూతురులా సిగ్గు పడుతూ. అమ్మయ్య! నా గుండెలమీద నుంచి పెద్దభారం తొలగిపోయినట్టే! మా వదినకి నేనే సంబంధం ఖాయపరచానని పించింది. తరువాతకబుర్లలో నన్ను తనతో మద్రాసు కూడా తీసుకు వెళుతానని నా చేతిలో చేయివేశాడు 'అన్నయ్య'. కబుర్లలో పడి ఎప్పుడు నిద్రపోయానో కాని తెల్లగా తెల్లవారేవరకు మెలకువే రాలేదు.

మర్నాడు ప్రొద్దున తడిసి ముద్దై వచ్చాడు మామయ్య. వస్తూనే నల్లటి ఆయనను చూసి, "ఏమండోయి రామలింగం గారూ, ముత్తానికి మీరే ముందు చేరారే!" అన్నాడు.

అంతవరకు చచ్చు పెద్దమ్మలా కూర్చున్న రామలింగంగారు ఒక్కసారిగా ఠీవిగా కాలుమీద కాలు వేసుకొని "వస్తానన్న రోజుకు రాకపోతే ఎలాగండీ" అన్నాడు.

"అవును, మీరన్న రోజుకే వస్తారని తెలుసును. నేను లేనందుకు మీ రేమనుకుంటారో అని చాలా కంగారుపడాను సుమండీ. మీకన్నా ముందుగానే చేరవలసింది. కాని మధ్యలో ఒక చుట్టం కనిపించి తన పనికోసం వాడి ఊరుకి లాక్కుపోయాడు. పని అయిన తర్వాత బయలుదేర బోతూంటే వాన ఒకటి పట్టుకుంది. వర్షం వస్తే ఆ వూరికి బయట ప్రపంచంతో ఇక సంబంధం లేనట్లే. ఎలాగో చచ్చీ చెడి, ఈవేళకు రాగలిగాను—ఇంతకీ మీరు మా యిల్లు ఇబ్బందిలేకుండా తెలుసుకో గలిగారా?"

"ఆహా, మీరు వివరంగా చెప్పినతర్వాత ఇబ్బంది ఏముంది?"

"ఇక్కడ సరిగానే ఉంటోంది కదూ, లోటు జరగలేదు కదా" అని అడిగి ఆయన జవాబు చెప్పకముందే, "ఇప్పటికే వస్తున ,మర్యాదా, ఎందుకూ కాని వాళ్లకు రాజ ఉండండి" అంటూ లోపలికి వచ్చాడు మామయ్య. రామలింగంగారు మూతి బిగించుకొని జవాబు చెప్పలేదు. గోపాలరావు 'అన్నయ్య' మామయ్యనుచూసి గదిలోకి పరుగెత్తుకువెళ్ళి, తండ్రిని కంగారుగా లేపుతున్నాడు. మామయ్య అటు చూడనేలేదు. తిన్నగా వంటింట్లోకి వచ్చాడు. వెనకాలే మేమూ ఉన్నాము.

మామయ్య మొట్టమొదట అత్తయ్య నడిగిన ప్రశ్న "ఆయన్ని బాగా చూశారా?" అని.

అత్తయ్య సరిగా వినిపించుకోకుండానే "అందరినీ చాలా బాగా చూశాం" అంది.

"అందర్నీ ఏమిటే, ఒకరే అయితే!" అన్నాడు మామయ్య ఆశ్చర్యపోతూ.

"ఎవరిని గురించి మీరు మాట్లాడుతూంటా?" అంది అత్తయ్య మరీ ఆశ్చర్య పోతూ.

"ఎవరిని గురించి నువ్వు మాట్లాడుతూంటా," అన్నాడు మామయ్య.

"కొంపతీసి ఆ పిల్లవెనుగును గురించి కాదుకదా మీ రనేది!"

"ఏమిటా మాటలు!" అన్నాడు మామయ్య మండిపోతూ.

అత్తయ్య అమాంతంగా వెనక్కి పడిపోయి అలానే మూర్ఛపోయింది. తొందరగా నీళ్లు చల్లి తేరుకోజేశాము.

తెలివిరాగానే మామయ్య అడిగాడు. "నీ ఆశ్చర్యాని కేంగాని, ఇందాకటినుంచీ నువ్వు చెపుతున్న దెవరిని గురించి? ఆయన కాక మరెవరు వచ్చారు?"

"అదేమిటి, ఆ కుర్రవాడూ, తండ్రీ వస్తే—తెలియదంటారేమిటి!"

"ఎవరూ? నేను మాడలేదే! ఈ వరస చూస్తే మీ రసలాయన కీసడింపుల మర్యాదలూ చేసినట్లున్నా" రంటూ మామయ్య కంగారుగా రామలింగంగారి దగ్గరకు పరుగెత్తాడు.

అప్పటికి గోపాలరావు తండ్రి లేచి కూర్చున్నారు. మామయ్యను ఆపి "అయితే మీరు రామయ్యగారు కారన్న మాట" అన్నారు.

"నేను రామయ్యనే నండి" అన్నాడు మామయ్య తెల్లబోతూ.

"అంటే అదే, కావూరి రామయ్య గారు."

"నేను కావూరి రామయ్యనే నండి!"

"మా కింకొక రెవరో తాము కావూరి రామయ్యగారమని చెప్పారే!"

"ఓహో, అదా అండి, కావూరి రామయ్య అనే పేరున్నవాళ్ళం మొత్తం నలుగురమున్నా మీ ఊళ్లో."

"ఈ దిక్కుమాలిన ఊళ్లో ఈ గందరగోళం కూడానా. ఇలా ఉంటుందని ఎన్నడూ అనుకోలేదు. సరిగా కనుక్కుందామన్నా వెధవ వర్షం ఒకటి తయారైంది!"

"తమరు చెప్పిన కావూరి రామయ్యగారెవరై ఉంటారు చెప్మా? - ఇంతకూ మీరు వచ్చిన పని?"

•"పెళ్ళిసంబంధం కోసమండీ. వారం రోజుల క్రితం కావూరి రామయ్యగారనే, ఆయన ఒకరువచ్చి తమ దగ్గర ఒక పిల్ల ఉందనీ, చూసుకొని వెళ్లవలసిందనీ అడిగారు."

"కట్నం ఏమాత్రంలో ఉన్నారు?"

"మూడు వేలు కట్నమూ, లాంఛనాలూ ఇస్తామన్నారండి. ఇంకా తేల్చుకోలేదు."

మామయ్య పెదవి విరుచుకున్నాడు. కొంతసే పాలోచించి, "వాన వెలిసిన తర్వాత తెలుసుకుందాం లెండి," అని చెప్పి రామలింగారి దగ్గరకువెళ్ళి "సమయానికి నేను లేకపోయాను. మావాళ్ళు మీకేమీ_" అంటూ నసిగాడు మామయ్య.

ఆయన మామయ్య అనుమానం ధృవపరుస్తూ "ఆఁ, ఆఁ, దానికేం లెండి." అని, మళ్లీ భీషణంగా "మీరేదో మరో సంబంధం విషయమై-" అంటూండంగానే

మామయ్య "ఇంకో సంబంధ మేమిటండీ? నే నెరగనే! ఆ వచ్చినవాళ్ళు మాకోసం కాదు, ఇంకొకరికోసం," అన్నాడు.

"వారో మరొకరో"

"రామ, రామ! అదేమీ లేదండీ. అంత నిజాయితీ లేనివాడినా నేను? - ఆఁ, ఆఁ అది. నేను మీకోసం వెళ్ళి ఇంతవరకూ రాకపోవడం, ఈలోగా మీరు రావడం, మీరు ఘనాలా అని తెలియక పోవడంవల్ల

మా వాళ్ళు మీకలా చెప్పటం జరిగివుంటుంది. అంతే కాని మరేమీ కాదండి. మీకేమైనా లోటుపాట్లు జరిగితే క్షమించాలి. ఈవేళ నేను సర్దుకుంటాను. తెలియకపోవడంవల్లనే ఇలా జరిగిందండి. మీరు మరోవిధంగా మనసులో పెట్టుకోకండి" అంటూ లోపలికి వచ్చాడు మామయ్య.

"అయితే, ఆయన ఫలానా అని అంతమాత్రం తెలుసుకోలేరూ? ఇంటికి వచ్చిన పెద్దమనిషిని అలా అవమానం చేస్తారా?" అని అడిగాడు మామయ్య కోపంగా.

"నా కన్నయ్యలా గున్నాడు ఆయన నా కల్లుడా?" అంది అత్తయ్య వింతగా చూస్తూ.

మాకు రామలింగంగారు రావడం, జారి పడడం వగైరా సంగతులు జ్ఞాపకం వచ్చి, ఒక్కసారిగా పక్కున నవ్వేశాం. అది చూసి మామయ్య "ఛత్, ఛడవల్లారా, పొండవతలికి" అంటూ మమ్మల్ని అక్కణ్ణుంచి తరిమేశాడు. మేము తలుపులచాటున దాగి వినసాగాం.

"నీ కెలా నచ్చుతుందీ ఈ సంబంధం! అలాంటి పిల్లవాడు కావాలాయె!" అన్నాడు మామయ్య.

"ఆ పిల్లవాడికేం? నిక్షేపంలా ఉన్నాడు. కళ్ళకద్దుకు చేసుకోవలసిన సంబంధం" అంది అత్తయ్య.

"అవునవును పాపం - తేరగా వస్తేనూ! కట్నమెంతో తెలుసా?"

"ఎంతేమిటి?"

"మూడు వేలూ, లాంఛనాలూను. ఇంకా పైకి కూడా ఉండవచ్చు."

అత్తయ్య నోట్లో పచ్చి వెలగకాయ పడింది.

"ఆ పిల్లవాడు కావాలిగా? తే మూడు వే లీయడానికీ, మరి మూడు వేలు పెళ్ళి ఖర్చులకీ! చేసేస్తాను. నీకే కాదు నాకూ చేయాలనిఉంటుంది,అటువంటి సంబంధం. కాని డబ్బండీ, డబ్బు!" అన్నాడు మామయ్య వెటకారంగా.

అత్తయ్య అలా నోరు తెరచుకొనే ఉంది. ఇటు నా నెత్తిమీద చినుకులు పడుతూవుంటే 'ఇదేమిటి ఇంట్లో కూడా కురుస్తోందా ఏమిటి' అనుకొంటూ పైకి చూశాను. నా వెనకాలే నిలుచున్న వదిన కళ్లనుంచి రాలుతున్నాయి ఆ బొట్లు. నేను చూడనేలేదు; వదిన అక్కడ ఉందని. నెత్తి పూర్తిగా తడిసిపోతుందేమోనని భయపడి పక్కకి తిప్పుకున్నాను వదిన కన్నీళ్లు చూసేసరికి నాకూ కళ్ళనీళ్ల పర్యంతమయింది.

మామయ్య వదినవైపుకు తిరిగి "అమ్మాయి, నీ కదృష్టముంటే ఏ ధనవంతుల ఇంట్లోనో పుట్టవలసింది, కర్మం కాలే ఇలాంటి దరిద్రుల కొంపలో జన్మించావనుకో అమ్మా. నేనేదో నీ కపకారం తలపెట్టాననిమాత్రమనుకోకు తల్లీ" అన్నాడు.

అత్తయ్య అప్పటికి తేరుకుంది. "అందుకోసం ఇలాంటి సంబంధమా చేసుకోవడం" అని అడిగింది.

"ఏం, ఈ సంబంధానికేం? ఏభై ఎకరాల బంగారంలాంటి భూమి ఉంది. రెండు మేడ లున్నాయి. వెనకటి పెళ్ళిళ్ళవల్ల కొడుకు లెవరూ లేరు. ఇంతకన్న మంచి సంబంధ మెక్కడినుంచి వస్తుంది?"

"ఆయన వయ సెక్కడ, దీని వయసెక్కడ? అందులోనూ తుమ్మమొద్దులాంటి మనిషి"—

"ఎంచడానికేం, ఎందుకూ మారని పీగా నమ్మయినా ఎంచుతుంది. సెంటుభూమి, ఉండేందు కాఖరికి ఒక పూరికొంపైనా

# ★ జారుడుమెట్టు ★

లేక, స్కూలు ఫైనలు కాదు, థర్డ్ ఫార్మ్ మూడుసార్లు తప్పిన చవటదద్దమ్మ కూడా చెయికి దిగడంలేదు. ఈ రోజుల్లో అటువంటప్పుడు అందమైనవాడినీ, చదువుకున్నవాడినీ, ఆస్తిపరుణ్ణీ నీ కూతురికి ఎలా తెస్తావు! - పిల్ల సుఖపడుతుందని నిక్షేపంలాంటి సంబంధం తీసుకువస్తే వేయి వంకలా.?"

"ఏమయినా సరే ఈ సంబంధానికి నేనెంతమాత్రమూ ఒప్పుకోను"అంది అత్తయ్య ఖండించివేసినట్లు.

మామయ్య భ్రుమన్నాడు. "ఒప్పుకోవు, ఒప్పుకోవు! నీకేం? పడేది నేనూ. నలుగురిచేత మాటలు పడలేక, కాళ్లరిగేటట్లు తిరిగినా చేతికందే సంబంధాలు కనిపించకుండా చస్తూంటే అదృష్టవశాత్తు ఈయన సంబంధం తెలిసింది. అది కాదంటావు! గట్టిగా చెపుతున్నాను. చేస్తే ఈ సంబంధమే; మరొక సంబంధం చేయలేను, చేయను. చూడను కూడా."

"చేయకపోతే ఊరుకోండి. కాని ఈ సంబంధానికి నే నొప్పుకోను, ఒప్పుకోను, ఒప్పుకోను!"అంది అత్తయ్య అంత ఖచ్చితంగాను.

మామయ్య కరికొలిమంట నెత్తికెక్కింది. పళ్లు పటపట కొరుకుతూ, "నోరుమూసుకో. పెద్దమనిషిని తీసుకువస్తే అవమానం చేయడం, వచ్చిన సంబంధం తిరగకొట్టడమూ - ఈ యింట్లో మగవాడి మాట చెల్లడం అనేది ఉందా! ఛీ, వెధవ సంసారం! ఎవడు భరిస్తాడు? ఏం సుఖముందని? ఏ సన్యాసుల్లోనో కలిసిపోతే నా పీడ మీకు వదిలిపోతుంది, మీ పీడ నాకు వదిలిపోతుంది" అంటూ మామయ్య విసవిస వెళ్ళిపోయాడు.

రామలింగంగారికేసి కూడా చూడకుండా వెళ్ళిపోతున్నాడు. ఆ విసురులో ఆఖరి మెట్టుమీద కాలువేసి జారిపడ్డాడు కాని, వెంటనే ఒక్క గంతులో లేచి, వెనక్కైనా తిరగకుండా వీధిలోకి వెళ్ళిపోయాడు. మామయ్య మళ్ళీ రాడేమో, నిజంగానే బైరాగుల్లో కలిసిపోతాడేమోనని మాకు భయం వేసింది. కాని ఏంచేయం? అత్తయ్యను చూస్తే నేలమీద చతికిలబడి, యింకా కోపోద్రేకం తగ్గకపోవటంవల్ల దగ్గరకు వస్తే కరచేటట్లుగా ఉంది. ఇటు వదిన తలుపుమూల నక్కిపోయి తన కన్నీటితో నేలమీద పెద్దమడుగు చేసింది.

మామయ్య వెళ్ళిపోయేసరికి, రామలింగంగారు మళ్ళీ రేపీ గీపీ లేని చచ్చుపెద్దమ్మలా తయారయ్యారు. ఇటు గోపాలరావు తండ్రి, అతనితో అంటున్నాడు"ఒరే? ఆ రామయ్యగారింటికి పోదాం పదరా" అని.

"ఈ జ్వరంతో ఈ వర్షంలో వెళ్తే న్యుమోనియాలోకి దింపుతుందేమో, నాన్నా" అన్నాడు గోపాలరావు.

ఆయన మంచంమీదనే వెనక్కి పడిపోయారు. "ఏం మాటలురా! పోనీ" నువ్వేనా పోయి కనుక్కొని రారా అన్నారు.

గోపాలరావు నసగడం మొదలుపెట్టాడు "మనం వెతుక్కొని వెళ్లడం బాగుండదు నాన్నా. పైగా ఈ వర్షంలో ఎక్కడని కనుక్కోను.?"

"మరి ఏంచేదాంరా!" అన్నారాయన విసుగ్గా - తప్పంతా గోపాలరావుదే అయినట్లు.

మరి కొంతసేపటికి మామయ్య వెళ్ళి చెప్పాడో ఏమో, ఇంకో కావూరి రామయ్యగారి వాళ్లు వచ్చారు. "ఏమండోయి, సీతారామయ్యగారూ, వీళ్లింటికి వచ్చారా? మేము వివరంగా చెప్పకపోవటం పెద్ద పొరబాటైంది. రండి మాయింటికి పోదాం" అన్నారు వాళ్ళు. సీతారామయ్యగారు కదలడానికి ఉత్సాహం చూపలేకపోయారు. "నా ఒంట్లో బాగాలేదండి. మావాడు చూస్తే చాలు, వాడిని తీసుకువెళ్ళండి," అన్నారు. అలాగేనని వాళ్లు గోపాలరావును వెంటబెట్టుకు వెళ్ళారు.

గోపాలరావు 'అన్నయ్య' ఇక అన్నయ్య కాడనేది, వదినకు మొగుడు కానేది ఖాయమే! నాకు గుండెల్లో ఏదో పొడిచినట్లయింది. సీత అక్కగారి దగ్గర కూర్చొని, అక్క కన్నీళ్ళు చూసి తానూ కళ్ళనీళ్లు పెట్టుకొంది.

కొంతసేపటికి గోపాలరావు వాడిపోయిన మొఖంతో తిరిగివచ్చాడు. కూడా వాళ్ళూ వచ్చారు. సీతారామయ్యగారు వాళ్ళతో చెప్పారు: "చూడడం అయిపోయింది కాబట్టి, మా ఊరు వెళ్ళిన తర్వాత పూర్తిగా ఆలోచించుకొని రాస్తాము. అప్పుడు మీరు వస్తే అన్ని విషయాలూ తేల్చుకోవచ్చు." అలాగే నన్నారు వాళ్లు. మరి కొంతసేపు ఆయనతో అవీ, ఇవీ మాట్లాడి వెళ్ళిపోయారు.

గోపాలరావు మెల్లగా "నాన్నా—" అని ఆగిపోయాడు.

"ఒరేయి, పిచ్చిపిచ్చి ఆలోచనలేమీ పెట్టుకోకు. అనాకారి కాకుండా ఉంటే చాలు. ఏదో సంసార పక్షంగా ఉండాలి కాని సినిమావాళ్ళలా ఉండాలేమిటిరా?" అన్నారాయన.

గోపాలరావు తలవంచుకొని ఉండిపోయాడు.

రామలింగంగారు కూడా మాలుగ

ప్రారంభించారు. మా అత్తయ్యకు ఒళ్లు మండుకువచ్చింది. విసుగులో పైకే అనేసింది కూడా- (వాళ్ళకు వినబడిందో ఏమో కాని) "వధవ కొంప! అడ్డమయినవాళ్ళకూ ఆసుపత్రిలా తయారైంది. ఎందుకూ పొందని వాళ్ళంతా మూలుగులతో తయారు; మా ప్రాణాలు తీసేందుకు! చుట్టాలా, పక్కాలా ఏమన్నా నా?"

అయినా రామలింగంగారికి కూడా సీతారామయ్యగారి పక్కనే మంచం వేశాం. మెల్లిగా మూలుగుతుంటున్నాడాయన కాళ్ళు నొప్పులుగా ఉన్నాయో ఏమో ఏ లఘుశంక తీర్చుకోడానికో పోవలసివస్తే గోపాలరావు సాయం తీసుకొని నడవవలసి వస్తోంది.

అత్తయ్య ఏ మాలోచించిందో కాని, రామలింగంగారిదగ్గరకు చేరింది. ఎంతో ఆదరంగా అడిగింది: "మీకు ఏం చేయించమన్నారు, బాబు గారూ?"

"ఈపూటకు గోధుమజావ పెట్టించండమ్మా" అన్నాడాయన అతి మెల్లగా.

"అలాగే చేస్తానండి" అని అక్కడే కూర్చుంది అత్తయ్య కదలకుండా.

"బాబూ, ఇదివరకు మీకు—"

"రెండు వివాహాలయ్యాయండి," అన్నాడాయన నిట్టూరుస్తూ.

"కొడుకులు లేరా అండీ?"

"లేరమ్మా నలుగురు కూతుళ్ళకీ పదేసివేలు కట్నాలిచ్చి పెళ్లిచేసి అత్తవారిళ్లకు పంపించేశానమ్మా."

"మహా బాగా చేశారండి. మీరు కనక అలా చేశారు. మాలాటివాళ్ళేముందండీ? ఒక్క పిల్లకే పెళ్ళిచేయలేక తన్నుకులాడుతున్నాము," అంది అత్తయ్య, పొగడ్తతో ఆయన ఉబ్బి, తబ్బిబ్బయేటట్లుగా. మళ్ళీ అంది "మళ్ళీ ఈ పెళ్ళిప్రస్తావన?"—

"వంశం నిలబెట్టేవాడొకడూ లేడుకదా అన్న బాధవల్ల ఇంకొక ప్రయత్నానికి సిద్ధపడుతున్నానండి."

"ఇంతకు ముందు కలగనిది ఇకముందు కలుగుతుందని నమ్మకమెలా, బాబు గారూ?"

"అది మన నిమిత్తంలో లేదమ్మా. అంతా భగవదాయత్తం" అన్నాడాయన వేదాంత ధోరణిలో.

ఇది విని సీతారామయ్యగారు మనస్సులో అందుకున్నారు. ఒంట్లో నలతతో డైందేమో గట్టిగా అనేశారు. "భగవదాయత్తంట, భగవదాయత్తం! ఇంకొ కొడుకులు పుట్టారనేటయ్యా? పుట్టే యోగముంటే ఇదివరకే పుట్టేవాళ్లు. కాటికి కాళ్ళు చాచుకున్నవాళ్లం మనలాటివాళ్లకయ్యా మళ్లీ పెళ్ళిళ్ళు!...అన్యాయంగా ఆ పిల్ల జీవితం పాడుచేస్తారు. మిమ్మల్ని చేసుకుని ఆ పిల్ల ఏం సుఖపడుతుందని? డబ్బు తింటూ కూర్చుంటుందేమిటి!"

రామలింగంగారు ఆయనకేసి తీక్ష్ణంగా చూశారు. కాని ఏమీ అనలేక పెదవులు కొరుకుకొని, ఊరుకున్నారు. అత్తయ్య వైపు చూశారు. మళ్ళీ అవసరం వచ్చింది కాబోలు గోపాలరావును పిలిచి, అతని ఆసరాతో వాకిట్లోకి పోయి వచ్చారు. మంచంమీద కూర్చొపెట్టినతర్వాత గోపాలరావు అడిగాడాయనను "మంచినీళ్లు తెచ్చి పెట్టనా, అండి" అని. "తెచ్చిపెట్టు నాయనా" అన్నాడాయన. గోపాలరావు తెచ్చియిస్తే త్రాగి అతని మొగంకేసి చూశారు. మళ్ళీ అత్తయ్య మొగంకేసి చూసి, మళ్లీ గోపాలరావు మొగంలోకి చూసి, అత్తయ్యవైపు తిరిగి మెల్లగా అన్నారు.

"మీ అమ్మాయికి వేరేసంబంధం చూచుకోండమ్మా. నే నడ్డుపడను. తగిన వరుడికే ఇచ్చివెయ్యండి," అంటూ గోపాలరావుకేసి చూశారు. అత్తయ్య ముగంలో ఒక్కసారి ఉత్సాహం పొంగివచ్చింది. గుడ్లు పెద్దవి చేసి అలాగే వుండిపోయింది. రామలింగంగారింకా అన్నారు: "నిన్నా అనుకోకండమ్మా. బాగా ఆలోచించిమిక్కిలి తర్వాతే మళ్ళీ వివాహం ఉద్దేశ్యం విరమించుకోదలచాను. మరోవిధంగా అనుకోకండి. ఈ వానలవల్ల స్వాస్థ్యం కొంచెం చెడింది. వాన తగ్గగానే వెళ్ళిపోతాను."

మమ్మల్ని అందరినీ ఖైదులోనుంచి విడి

# ఆంధ్రమాత

శ్రీ లింపొందగ యావదాంధ్ర జనమాతృత్వస్ఫూర్తలీ
నూత్న తే
జోలీనామృతమాని, తద్బలవదౌత్సుక్యంబునన్
తావకో
ద్వేలప్రాక్తనకీర్తి గీతముల నర్థిన్ పాడు నీ పుత్రపు
త్రీలోకమ్మున కేమి దెల్పెదవు సందేశంబు నాంధ్రావని!

ఆశల్ కౌతుక పూర్ణచంద్రికలు పూయన్, దుర్దినాచ్ఛా
దమా
కాశమ్మున్ విడిపోవ, నూతనకళోత్కర్షాపి మై మాతృపూ
జాశోభల్ దయివారు నీశుభదినోత్సాహంబునీక్షించి, నీ
యాశీర్వాదములిమ్ము పుత్రకుల కంబా! యాంధ్ర
దేవీమణీ!

జారిన దేశగర్వమును చక్కనదిద్ది, మహాంధ్రమండలీ
భారము శ్లాఘనీయముగ బాలన చేసి, సమాన రాష్ట్రముల్
కూరిమి నాన జేయ తెలుగుంబుడమిన్ గయిసేయరయ్య,
దీక్షారతి నాంధ్రపుత్రులు! జగజ్జనధర్మమె దృష్టి
నిల్పుచున్.

రాయప్రోలు సుబ్బారావు



# జారుడు మెట్లు



పించినట్లయింది! అత్తయ్య "జావ త్వరగా చేస్తాను, బాబుగారూ," అంటూ వంటింట్లోకి పోయింది. భోజనాలూ, జావల తంతూ పూర్తి అయింది. అత్తయ్య యీ మారు సీతారామయ్యగారి దగ్గరికి చేరింది. ఆయన ఇది చూసి ఏదో ఉపాయం మీదే వచ్చినట్లు పసికట్టి సందేహంతో దగ్గుతున్నారు.

"మా అమ్మాయిని చూడడానికే వచ్చారనుకున్నాం, అన్నగారూ" అంది అత్తయ్య.

"పొరబాటైందమ్మా. ఇంకొకరింటికి పోవలసింది: వానలవల్ల చిక్కుపడి ఇక్కడికి వచ్చాం" అన్నారాయన.

"ఆ సంబంధం వారెంత వరకూ ఉన్నారు?"

"మూడు వేలూ, పై లాంఛనాలూ."

"పిల్ల నచ్చిందాండి?"

"నచ్చకేం జేస్తుంది?" అన్నారు సీతారామయ్యగారు.

"నచ్చకేం జేస్తుంది మూడు వేలు చేతిలో పడుతోంటే!" అందుకున్నారు రామలింగంగారు చేతిలోకి అవకాశం రాగానే.

"మీ కెందుకయ్యా మధ్య?" అని విసుక్కున్నారు సీతారామయ్యగారు.

"ఇందాక నా విషయంలో ఏదో చెప్పారే! ఇప్పుడు మీ విషయంలో నేనెందుకు మాట్లాడకూడదు? ఇందాక చెప్పిన నీతులన్నీ ఎక్కడికి పోయాయి? మూడు వేలు చేతిలో పడితే ఎటువంటి సంబంధమైనా ఉత్తమమైన సంబంధమై పోతుంది గదూ?" అంటూ రామలింగంగారు,— మూలుగంతా ఎక్కడికి పోయిందో కాని— ఉత్సాహంగా లేచి కూర్చున్నారు. చేజిక్కిన అవకాశం ఒక పట్టాన విడిచిపెట్టేవాళ్ళు లేరు. అత్తయ్యా, మేమూ అంతా కొయ్యబొమ్మల్లా వాళ్ళ వాగ్వాదం వింటూ కూర్చున్నాం.

"నీకేమిటయ్యా, నీతి?" ఎంగిలాకు పనికి రానివాళ్ళే కట్నాలు పుచ్చుకుంటూంటే మేము మూడు వేలు పుచ్చుకుంటే తప్పా? అక్కడికి మేం కోరింది చాలా తక్కువే," అన్నారు సీతారామయ్యగారు గట్టిగా.

"మీ కెంత ఆస్తి ఉంది?"

"ముప్ఫయి ఎకరాలూ, మూడిళ్ళూ."

గర్వంగా చూశారు సీతారామయ్యగారు.

"కొడుకులూ, కూతుళ్ళూ?"

"కొడుకులు ముగ్గురు, కూతుళ్ళు లేరు."

"చేయవలసిన పెళ్ళి ఖర్చులూ లేక, అంత ఆస్తి ఉన్నప్పుడు ఈ ముష్టి మూడు వేలు పుచ్చుకోకపోతే నేమయ్యా. డబ్బేం శాశ్వతమా?"

"డబ్బు శాశ్వతం కాకపోతే మనుష్యులూ శాశ్వతం కాదు. నలుగురితో బాటే నేనూ. కట్నాలిచ్చి పిల్లనిస్తామని కాళ్ళ మీద పడుతోంటే వద్దనేటంత మూర్ఖుణ్ణి కాను నేను"

"ఇస్తే? - ఇచ్చినంత మాత్రాన పిల్లవాడికి సంబంధం నచ్చిందీ లేనిదీ చూడవద్దూ? మీవాడి ముఖం చూస్తేనే ఇందాక చూసి వచ్చిన సంబంధమేమీ నచ్చలేదని స్పష్టంగా తెలుస్తోంది."

"ఆఁ, వాడి ముఖం, వాడికేం తెలుసు" అన్నారు సీతారామయ్యగారు నిర్లక్ష్యంగా.

రామలింగంగారు "ఏం నాయనా, నీకా సంబంధం నచ్చిందా?" అని అడిగారు గోపాలరావుని. సీతారామయ్యగారు 'గోపాలం' అంటూ ఉరిమినా అతను తండ్రికేసి చూడకుండా "నాకు బొత్తిగా నచ్చలేద"న్నాడు.

"అదీ! చూశారా?" అన్నారు రామలింగంగారు సంతోషంతో. "పిల్లవాడికి నచ్చని సంబంధం చేస్తారా? మీరా, అతనా, పెళ్ళి చేసుకునేది? నాలుగు డబ్బుకోసం పిల్లవాడికి సుఖం లేకుండా చేస్తారా? మీరిందాక చెప్పినట్లే మనం కాటికి కాళ్ళు చాచుకున్నవాళ్ళం. ఈవేళ ఉండి రేపు 'హరీ' అంటాం. ఆపైన మీ కొడుకు జీవితకాలం మీరు చేసిన అన్యాయానికి బాధపడుతూనే ఉంటాడు; అనుకుంటూనే వుంటాడు."

సీతారామయ్యగారు దీనికి జవాబు తోచక పిచ్చకోపంతో పళ్లు పటపట లాడిస్తూ మంచంమీద పడిపోయి మరింత గట్టిగా మూల్గ నారంభించారు—"ఈ పీడ ఎక్కడ దాపురించిందిరా, భగవంతుడా" అంటూ.

రామలింగంగారికి హుషారు హెచ్చింది. "నేను సంబంధం చూసుకుందామనే వచ్చాను. కాని వీరి అమ్మాయినీ, గోపాలాన్నీ చూశాక అటువంటి ప్రయత్నం విరమించుకున్నాను. ఇద్దరినీ చూస్తే నాకెంతో ముచ్చటగా ఉంది. ఇద్దరూ ఈడూ జోడుగా ఉంటారు. మనసులు కలిసి చిలకా గోరింకల్లా సుఖంగా ఉంటారు. నేనేదో పెద్దమనిషిగా సలహా ఇస్తున్నాను వినండి. ఒక కట్నం మినహా మిగతా అన్ని విషయాలలో వీరి అమ్మాయి నచ్చింది కాబట్టి, ఆ కట్నాని కాశించక ఈ సంబంధం చేసుకోండి. ఏం గోపాలం, వీరి అమ్మాయి అంటే నీ కిష్టమేనా?"

ఇష్టమే నన్నట్లు తల ఊపాడు గోపాలరావు.

సీతారామయ్యగారు మండిపడుతూ అన్నారు: "మీ సలహా ఎవరూ అడగలేదు, అక్కరలేదు కూడా. నా పిల్లాడికి ఏ సంబంధం చేయాలో నాకు తెలుసు. లక్ష సంబంధాలు వస్తున్నాయి. ఇందాకటివారిది కాకపోతే ఇంకోకటి చేస్తాను. కట్నం, లాంఛనాలూ లేకుండా మాత్రం చేసుకోను. నే నంత తలమాసినవాడిని గాను."

అంత మొండిగా చెప్పిన ఆయనకు ఇక సమాధాన మెలా చెప్పాలో తోచక ఊరుకున్నారు రామలింగంగారు. సీతారామయ్యగారంటే మాకు పరమద్వేషం పుట్టుకు వచ్చిందని వేరే చెప్పనక్కరలేదు. అత్తయ్య రామలింగంగారిని దేవుణ్ణి చూసినట్లు చూస్తోంది. ఆయన కాళ్ళు రాతివై యుంటే అక్కడే వేయి కొబ్బరికాయలు కొట్టివేసేది

కొంతసేపుండి రామలింగంగారు మళ్ళీ ప్రారంభించారు: "గోపాలం మీ కెన్నోవాడు?"

సీతారామయ్యగారి ఓర్పు హరించిపోయింది. "ఏమిటయ్యా నీ ఇన్వెష్టిగేషన్! నీ పనేదో చూసుకోని చేతకాకపోతే నీదారిన నువ్వు పోక, మామీద విరుచుకుపడతావేమిటి? నువ్వా నీ అడ్డదిడ్డ ప్రశ్నలూను!"

"నీవు" వరకూ వచ్చింది వ్యవహారం! కాని రామలింగంగారు తగ్గలేదు. ఆయనకు పట్టుదల మరింత హెచ్చింది.

"అడ్డదిడ్డ ప్రశ్న లేమిటి? ఎన్నోవాడని అడిగితే చెప్పడానికేం? నీఆస్తేమీ దోచుకోబోవడం లేదే?"

# ఆంధ్ర పౌరుషము

గోదావరీపావనోదారవాఃపూర
మఖిలభారతము మా దన్ననాఁడు,
తుంగభద్రాసముత్తుంగరావముతోడ
కవులగానము శ్రుతిఁ గలయునాఁడు,
పెన్నానదీసముత్పన్నకైరవదళ
శ్రేణిలో తెన్గు వాసించునాఁడు,
కృష్ణాతరంగనిర్ణిద్రగానముతోడ
శిల్పమ్ము తొలిపూజ సేయునాఁడు
అక్షరజ్ఞాన మెఱుఁగదో యాంధ్రజాతి ?
విమలకృష్ణానదీసైకతములయందు
కోకిలపుఁబాట పిచ్చుక గూండ్లు కట్టి
నేర్చుకొన్నది పూర్ణిమానిశలయందు.

విశ్వనాథ సత్యనారాయణ

"రెండోవాడు. అయితే ఏం చేస్తావు?"

రామలింగంగారొక క్షణమాగి, గొంతుక కొంత తగ్గించి అన్నారు. "మీకు ముప్ఫయి ఎకరాలూ, మూడిళ్ళూ ఉంటే నాకు ఏభై ఎకరాలూ, రెండు మేడలూ ఉన్నాయి. నలుగురు కూతుళ్లకూ పదేసివేల కట్నాలిచ్చి అత్తవారిళ్లకు పంపివేశాను. కాని యింత ఆస్తి ఉన్నందుకు నా పేరుతో అనుభవించేవాడెవడూ లేడనే చింతతో యింకో పెళ్లికి సిద్ధపడ్డాను. అది వదులుకున్నాను ఇప్పుడు. మీవాడిని చూసినప్పటనుంచీ నాకెంతో సంతోషంగా వుంది. ఇంత చక్కనివాడూ, మంచివాడూ కొడుకైతే ఎంత బాగుండునో అనిపిస్తోంది. కాబట్టి నామీద దయతలచి నాకు మీవాడిని దత్తత యీయండి. మన కన్నీ కలుస్తాయి. ఈ సంబంధమే చేసి మీవాడిని సుఖపెడతాను."

"నేను పెంపుడు యివ్వను" అని గట్టిగా అన్నారు సీతారామయ్యగారు.

"ఏభై ఎకరాల భూమీ, రెండు మేడలూ మీ కొడుకుకు వస్తాయంటే కూడా?"

"నా కొడుకులు నాకేమీ బరువు కారు."

"కొడుకుమీద అంత ప్రేమ ఉన్నవారైతే, కొడుకుని సుఖపెట్టేందుకు ఈ సంబంధమే చేయండి. వారి అమ్మాయి అంటేనే మీవాడికిష్టం."

సీతారామయ్యగారు గట్టిగా శ్వాస వదలి, "నేను పెంపు యివ్వను. కట్నం లాంఛనాలూ లేకుండా పెళ్ళిచేయను" అని ఖండించి చెప్పివేశారు.

మళ్ళీ మొండికెత్తింది వ్యవహారం. ఇక లాభం లే దనిపించింది. గోపాలరావు, అత్తయ్య, వదినా—మా అందరి మొగాలలోనూ నైరాశ్యం తాండవిస్తోంది. నాకు మాత్రం సీతారామయ్యగారిని చీకటి మొట్టి

# ★ జారుడు మెట్టు ★

కాయలు వేయాలనిపించింది. కాని అది చేతనయ్యే పని కాదని ఊరుకున్నాను. ఇంతలో రామలింగంగారి కేమి తోచిందో "ఇటు రా, నాయనా," అంటూ గోపాలరావును పిలిచి, "నన్ను కాస్త అటు తీసుకు వెళ్లు," అని, అవతల సీతారామయ్యగారు 'గోపాలం, గోపాలం' అని అరుస్తున్నా లెక్క చేయకుండా వాకిట్లోకి వెంట బెట్టుకు వెళ్లారు. కొద్దిసేపటికి తిరిగివచ్చారు.

"ఇదుగో సీతారామయ్య గారూ, మెల్లగా ఆలోచించి చెప్పండి" అన్నారు రామలింగం గారు. "ఇప్పుడొకవేళ వీళ్లే మూడు వేలూ, లాంఛనాలూ ఇస్తే మీకు యీ సంబంధం యిష్టమే అవుతుందికదూ?"

"కావచ్చు" నన్నారు సీతారామయ్యగారు నానుస్తూ.

"కావచ్చు నేమిటి యింకా! ఇంతకన్న మంచి సంబంధం వేరొకటి వుంటుందా? ఈ మూడు వేలూ, లాంఛనాలూ నేనిస్తాను. పెళ్ళి కూడా చేయిస్తాను. ఒప్పుకోండి. మూడు వేలు నాకొక లెక్క కాదు."

సీతారామయ్యగారు ఆశ్చర్యంతో మాట్లాడలేకపోయారు.

"మీకు కావలసింది ఈ వేలేగా? ఇంకెందుకు సందేహం?"

"నీవేమిటయ్యా తెగ దెప్పుతున్నావు, మధ్య నీ వెవడవు? అసలు వాళ్లు మాట్లాడకుండా."

"ఇదుగో మర్యాదగా చెపుతున్నాను, సీతారామయ్యగారూ, ఇంక కాదూ కూడదూ అంటే మీవాడు మీమాట వినకుండా చేస్తాను. ఏం గోపాలం, ఈ సంబంధం కాక, మరో సంబంధం చేసుకుంటావా?"

"చేసుకోను. చేసుకుంటే యిదే" నన్నాడు గోపాలరావు ధైర్యంగా.

సీతారామయ్యగారు ఏమీ మాట్లాడలేకపోయారు.

"ఆట్టే ఆలోచించక ఈ అమ్మాయిని చేసుకోండి. మీరు కోరినట్లే జరుగుతోంది కదూ, ఇక కాదన్నారంటే వ్యవహారం బెడిసిపోతుంది" అని బెదిరించారు రామలింగంగారు.

అయినా మాట్లాడలేదు సీతారామయ్యగారు.

"ఇక మీ రంగీకరించినట్లే. ఇదుగో అమ్మాయి: ఇటు రావమ్మా ఒకసారి" అని పిలిచారు రామలింగంగారు వదినని.

వదిన గుమ్మంలోకి వచ్చి సిగ్గుపడుతూ తలవంచుకొని నిలబడింది.

"ఇదుగో, చెపుతున్నానమ్మా - నీ పెండ్లి వైభవంగా జరిపించే బాధ్యత అంతా నాది. కాని ఒక్కటే షరతుఉంది. గోపాలరావు అంగీకరించాడు. ఇక నీదే తరవాయి—" అన్నారు రామలింగంగారు నవ్వుతూ.

"అదేమిటండోయి మీరు ఏ షరతు పెట్టినా మా అమ్మాయి ఒప్పుకుంటుంది, కాదనగలదా?" అంది అత్తయ్య స్థిరంగా కూర్చోలేక.

"అమ్మాయిని చెప్పనీయండి. షరతు ముందే చెపుతున్నానమ్మా. మీకు కలగబోయే సంతానంలో రెండో కొడుకుని నాకు దత్తత యివ్వాలి. అంగీకారమేనా?" అని అడిగాడు రామలింగంగారు నవ్వుతూ.

వదిన గబుక్కున కొంగు మొగాని కంటి పెట్టుకొని నవ్వుతూ గుమ్మంచాటుకు డ్డంగత్తింది.

ఇంతలో సీతారామయ్యగారు మంచపు మీదనుంచి లేచి కూర్చుని అరిచారు: "నీ మూడు వేల దానం నా కక్కరలేదయ్యా! నేనంత గతిలేనివాడి ననుకొన్నావా? మా వాడికి అక్కరలేనిది నా కేమిటి? నేను కట్నం లాంఛనాలూ లేకుండానే ఈపిల్లను మావాడికి చేసుకోగలను. "మధ్యవాళ్ళతో నాకేంపని!"

రామలింగంగారు నోరు తెరచుకొని ఉండిపోయారు.

మామయ్య తిరిగి వచ్చాడు మధ్య దారిలోనే సన్యాసంమీద మోజు తగ్గిపోయిందేమో? మామయ్యను చూసి రామలింగంగారు తేరుకొని, "ఏమండోయి రామయ్యగారూ, సమయానికే వచ్చారు, రండి, రండి" అంటూ నన్ను తమలపాకుల పళ్లెం తెమ్మన్నారు. తెచ్చాను. రామలింగంగారు రెండు తాంబూలాలు మామయ్య చేతిలో పెట్టి, "ఇదుగో ఇది సీతారామయ్యగారికీయండి, ఇది గోపాలరావు కీయండి" అన్నారు. మామయ్య తెల్లబోతూ అత్తయ్య వైపు చూశాడు.

రామలింగంగారు, "ఊం, ఇవ్వండి, అలా చూస్తారేం? 'అలస్యాత్ అమృతం విషం' అన్నారు పెద్దలు. వారి చేతుల్లో తాంబూలాలు పెట్టండి" అని మామయ్య చేత అలా చేయించారు. సీతారామయ్యగారు 'దరిద్రపు వానలు, దరిద్రపు వానలు' అంటూ జపిస్తూ, విసుగుగా తాంబూలం అందుకున్నారు "సరే సీతారామయ్యగారి తరపున నేను చెపుతున్నాను. సంబంధం ఖాయమైంది కాబట్టి త్వరలో ముహూర్తం పెట్టించవచ్చు. ఈలోగా పెళ్లిపనులు ప్రారంభించవచ్చు" నన్నారు రామలింగంగారు.

వాన వెలిసింది. చుట్టాలు వెళ్లిపోయారు. మేము మా నౌకాదళంతో వీధుల్లోకి విజృంభించాం. ★



# అభివందనములు...

ఆంధ్ర రాష్ట్ర

సౌభాగ్యమునకు

ఆంధ్రరాష్ట్రమునకు మా హృదయ పూర్వక శుభాకాంక్షలు. ఈ నూతన రాష్ట్రము అచిర కాలములోనే సకలైశ్వర్యాభివృద్ధుల నందుగాక

... from the makers of

# AFGHAN

## SNOW & COLD CREAM

*Leading Beauty Creams of the East*

ESP PERFUMS — ESP THE MARK OF EXCELLENCE

Patanwala

for PERFUMES AND COSMETICS




ESP-R/I

నాటిక:

# కమలా-విమలా

## కొమ్మూరి వేణుగోపాలరావు

(విమల యింట్లో)

కమల: విమల ఏం చేస్తున్నదండీ శాంతమ్మగారూ? (ఆదుర్దాగా)

శాంతమ్మ: ఎవరూ?...కమలా. రా అమ్మా రా. ఇదేనా రావటం?

క: అవునండీ, విమల రాసిన ఉత్తరం అందాక చూసి తెల్లబోయాను. ఇంతలో యిలా జరుగుతుందనుకోలేదు, వెంటనే బయల్దేరి వచ్చేశాను.

శాం: (గాద్గదికంగా) ఎవరుమాత్రం అనుకున్నారమ్మా యిలా జరుగుతుందని. దాని కర్మ అలా కాలిపోయింది తల్లీ. లేకపోతే పసిడి నిగ్గులు తేరే యీ వయసులో పదిహేడేళ్ళయినా నిండకుండా దానికప్పుడే యీ వైధవ్యమేమిటి చెప్పమ్మా?

క: హఠాత్తుగా ఉత్తరం వచ్చేసరికి నేనూ స్తంభించిపోయాను...ఇంతకీ విమల ఎక్కడున్నదండీ?

శాం: ఆ గదిలో పడుకుని ఏడుస్తున్నట్టుంది. పోయిరామ్మా.

(కొంచెంసేపు నిశ్శబ్దం)

క: (మెల్లగా) విమలా.

విమల: (ఉలుక్కుపడి, గద్గదంగా) ఎవరూ? కమలా?

క: ఏమిస్తున్నావా విమలా?

వి: అయ్యో, ఏంచేసేదే. నా జీవితమంతా నాశనం అయిపోయిందే (పెల్లుబికిన దుఃఖంతో)

క: (ఓదారుస్తూ) ఊరుకో విమలా.

వి: ఎలా ఊరుకునేదే? నే నింక ఏం చూసుకుని బ్రతికేది? నా జీవితంలో యింకా ఏం మిగిలింది? నేను పూర్తిగా నాశనం అయిపోయాను కమలా. అయ్యో. (ఏడుస్తుంది).

క: (గద్గదంగా) నీ స్థితి చూస్తుంటే నా కడుపు తరుక్కుపోతూందే - చిన్నప్పుడు మన జీవితాలను గురించి ఎన్ని కలలు కన్నాం? "నీ పెళ్ళయి ఏడాదన్నా తిరగక మునుపే మనం కన్న కలలు భిగ్నమయే సమయం ఆసన్నమయిందా?" అని నీ ఉత్తరం చూసినప్పటినుంచి కుమిలిపోతున్నా నే.

వి: ఏం చేసేది? ఏ ఆశతో నా జీవితం గడుపుతాను యిక. నా కింతకంటే ఉరి...

క: చాల్లే విమలా. అటువంటి పిచ్చిపనులు మాత్రం చేయబోక. మీ అమ్మగారి కడుపున చిచ్చుపెట్టి, ఆవిడని కూడా నాశనం చేద్దామనుకుంటున్నావా?

వి: లేకపోతే బ్రతికి ఏంచేసేదే.

క: నేను నీకన్నా ఒక ఏడాది చిన్నదాన్నే విమలా, నిన్ను ఓదార్చటంకూడా నాకు తెలీదు. కాని ఒక్క విషయం మట్టుకు విను. మనం బ్రతికేది మనకోసమే కాదు. ఇతరులకోసం కూడా.

వి: నే నెవరికోసం బ్రతకాలో వారే నన్ను శాశ్వతంగా వదిలివెళ్ళిన తర్వాత యింకెవరికోసమే నేను బ్రతికేది?

క: పొరపాటు. మీ అమ్మగారు నిన్నెంత కష్టపడి పెంచి పెద్దచేసిందో నీకు తెలీదా? ఆమె ప్రాణాలన్నీ నీమీద నే. నువ్వు ఏ అఘాయిత్యానికో దిగబడితే ఆవిడ ఏమయిపోతుందో ఊహించావా?

వి: మరి బ్రతికి ఏంచేసేది?

క: అది తరువాత మాట......నువ్వు ఏ అఘాయిత్యం తలపెట్టనని ప్రమాణం చెయ్యి.

వి: అబ్బ, ఏమిటే?

క: ఊఁ. నువ్వు అలా చేస్తేగాని నాకు తృప్తివుండదు. అను. ఊఁ?

వి: అలాగేలే కమలా.

క: నువ్వు అటువంటి పని చేయటానికి ఏమాత్రం ప్రయత్నంచేసినా నామీదఒట్టే.

వి: అబ్బ. ఏంమాటలే.

శాం: (వస్తుంది) అన్నాలు వడ్డించాను. రండమ్మా.

వి: నా కాకలిగా లేదు నువ్వువెళ్లు కమలా.

శాం: నువ్వన్నా చెప్పమ్మా కమలా. రోజూ యిదే వరస. (గద్గదికంగా) ఆరోజు నుంచి ... పిచ్చితల్లి నాలుగు మెతుకులు తినటం బ్రహ్మాండమయిపోయింది.

క: ఏమిటి విమలా? ఉపవాసాలు చేసి ఏంసాధిద్దామని. లే.

వి: నా కాకలి లేదు కమలా. నన్ను బలవంతం చెయ్యబోకు.

క: చాల్లే. మీరు వెళ్ళండి శాంతమ్మగారూ. నేను తీసుకువస్తాను...రా విమలా.

వి: నన్ను చంపబోకే.

క: ఊహు. ఇప్పటికే ఎలా పాలిపోయావో తెలుసా? నువ్వు యీపూట అన్నం తినకపోతే నామీద ఒట్టే.

వి: అబ్బ. అవేంమాటలే.

క: అయితే రా.

వి: ఊఁ. సరే పదవే.

*  *  *

వి: అమ్మా! (మరికొంత గట్టిగా) అమ్మా.

శాం: ఏమిటి తల్లీ?

వి: కమల ఉత్తరం రాసిందమ్మా.

శాం: ఏమని?

వి: కమల పెళ్లిట. విచారం మరిచిపోయేటంత కాలం గడవకముందే పెద్దవాళ్ళ ఒత్తిడిమీద అప్పుడే పెళ్ళి చేసుకోంటున్నందుకు క్షమించమని రాసింది. పిచ్చి కమల. తనేంతప్పుచేసిందని. రమ్మని మరీ మరీ రాసింది.

శాంత: అలాగా? అయితే వెళ్లమ్మా తప్పకుండా.

వి: ఎందుకమ్మా? శుభమా అని పెళ్ళి జరుగుతుంటే యీ దరిద్రపు మొహంతో నే నెందు కక్కడికి?

శాంత: అవేంమాటలే తల్లీ? నువ్వలా అంటూంటే నా హృదయం ఎంతబాధపడుతుందో తెలుసా?

వి: కష్టం నాకుండాలిగాని నీ కెందుకమ్మా?

శాం: ఇంత చదువుకున్నావు? మాతృహృదయాన్ని గురించి నీకు తెలిసింది యింతేనా తల్లీ?

వి: పోనీలేమ్మా. ఆ విషయం తలుచుకోవటం మానివేద్దాం...కాని కమల పెళ్ళికి నాకు వెళ్ల బుద్ధిపుట్టటల్లేదమ్మా.

శాం: పర్వాలేదులే వెళుతల్లీ. లేకపోతే ఏమయినా అనుకుంటుంది.

వి: వద్దులేమ్మా. నావిషయం కమలకు తెలీదు గనుకనా ఏమయినా అనుకునేటందుకు. ఏమయినా ప్రెజంటేషన్ మాత్రం పంపిస్తాను.

శాం: పోనీ నీయిష్టప్రకారమే చెయ్యి తల్లీ.

(కొంచంసేపు నిశ్శబ్దం)

శాం: ఒకమాట అడుగుతాను. ఏమీఅనుకోవుకదా విమలా.

వి: ఏమనుకుంటానమ్మా? నన్నడగటానికి సందేహ మెందుకు?

శాం : అదికాదు విమలా. ఇది పూర్వ కాలం కాదు. పూర్వపు పద్ధతులూ, ఆచారాలు అన్నీ యిప్పుడు మారిపోయినై. పూర్వం వితంతు వివాహాలు చేస్తే సంఘం వెలివేసేది. కాని యిప్పుడు తప్పు అనే మాటకు అర్థం లేకుండా పోయింది.

వి : ఇదంతా ఏమిటమ్మా ?

శాం : వినుతల్లీ. ఇప్పుడు ఎంతమందో వితంతు వివాహాలు చేసుకొంటున్నారు. నువ్వు యింటర్ వరకూ చదువుకున్నావు. వయస్సా అంటే యింకా చిన్నదానివే. అందరిలాగా నువ్వుకూడా ఎందుకు...

వి : అర్థమయిందమ్మా. కాని నన్ను మామూలుగా బ్రతకనియ్యా దల్చుకుంటే యిటువంటి మాటలు నాముందు ఎప్పుడూ అనవద్దమ్మా. నిన్ను బ్రతిమాలుతాను.

శాం : కాదు విమలా. నేను చెప్పేది విను. నువ్వు యిలా నాశనం అయిపోతుంటే చూస్తూ ఎలా ఊరుకోగలను? నా మాట విని......

విమ : (వినిపించుకోకుండా) నన్నిలా బ్రతకనియ్యి అమ్మా.

శాం :................

వి : నువ్వు తీరుస్తానంటే నాకు ఒక్కటే కోరిక వుంది. డాక్టరు చదవటం. ఇంటర్మీడియట్ ప్యాసయాను. ఊరికినే యిలా కూచుని కాలం వ్యర్థం చేసేకంటే డాక్టరునై మిగిలిన కాలం గడిపేస్తాను. అంతో యింతో పరులకి ఉపకారం చేసినట్లూ వుంటుంది. నాకు ఆత్మసంతృప్తి వుంటుంది. నా కోరిక ఒప్పుకోవమ్మా.

శాం: ఒప్పుకోక ఏం చేస్తానమ్మా. నీ సంతృప్తికంటె నా కింకా ఏం కావాలి? కాని నిన్ను విడిచి నేను అంతకాలం ఎలా ఉండగలననేదే చింత.

వి : నన్ను విడిచి వుండవద్దమ్మా. ఇద్దరం కలిసే వుందాం. నిన్ను దగ్గర పెట్టుకునే నేను చదువుతాను.

శాం : అంతకంటేనాకింకా యేంకావాలి తల్లీ?

* * *

(కమల యింట్లో)

ఆనందరావు : కమలా !

క : ఊ.

ఆనం: అలా వున్నావేం?

క : ఎలా ?

ఆనం: ఏదో దిగులుగా, బాధగా కనిపిస్తున్నావు. ఈ సంతోష సమయం కోసం నేనెంత ఆదుర్దాపడ్డానో నీకు తెలుసా? ఇటువంటి సంతోష సమయంలో అలా మౌనంగావుంటే నేను సహించలేకుండా వున్నాను. కారణం చెప్పవ్.

క : ఏం చెప్పేది?

ఆనం: నా యెదుట బిడియమా ? లేక సిగ్గా? నేను నీవాడ్ని కమలా. మన యిద్దరి హృదయాలు ఒకటైపోయి అరమరికలు లేకుండా హాయిగా జీవితం గడపటమే నా ఆశ. నాదగ్గర సంకోచము.

క : ఏం చెప్పాలో నాకు తెలియటం లేదు.

ఆనం: నీ మనస్సులో ఏదయినా బాధ వుంటే నిస్సంకోచంగా నా ఎదుట బయట పెట్టు కమలా!

క : (కొంచెం ఆగి) ఆఫోటో చూశారా?

ఆ: ఆమె ఎవరు ?

క : నా ప్రాణ స్నేహితురాలు. చిన్ననాటినుంచీ ఒకే బడిలో చదువుకుని ఒకే ప్రాణంగా మెలిగాం. మా నాన్నగారికి ఆవూరినుంచి ట్రాన్స్‌ఫర్ అయి యిక్కడికి వచ్చేసిం తర్వాత యిద్దరం విడిపోవల్సి వచ్చింది.

ఆ : ఆమె పేరు?

క : విమల. చాలా ఉత్తమురాలు. మేమిద్దరం విడిపోయేసమయం వచ్చినప్పుడు నన్ను కన్నీళ్లతో సాగనంపింది. అటువంటి విమలకు యిప్పుడు దారుణమైన అవస్థ పట్టింది.

ఆ : ఏమిటి?

క : ఆమె వివాహం జరిగి ఒక ఏడాది గడిచిందేమో. కొద్దిరోజుల క్రితమే ఆమె భర్త మరణించాడు. ఈ విషయం విని ఓదార్చటానికి వచ్చిన నన్ను చూసి భోరున విలపించింది. నా హృదయం బ్రద్దలైంది. అప్పట్నుంచీ నామనస్సు ఏమిటో బాధగానే వుంటున్నది.

ఆ : ఆమె విషాదజీవితాన్నితలుచుకునా?

క : ఇంకా నేను చెప్పలేని కారణం ఏదో. మానవ జీవితాలు ఒక్కక్షణంలో ఏవిధంగా తారుమారయిపోతాయో, వినోదవంతం అనుకున్నది ఏవిధంగా విషాదవంతంగా పరిణమిస్తుందో తలుచుకుంటుంటే నేను తెలియనిబాధలో మునిగిపోతున్నాను.

ఆ : నీబాధ అర్థమయిందిలే కమలా !

క : ఆఁ?

ఆ : కాని ఒక్కవిషయం ఆలోచించు. మన వయస్సులు ఎంతచిన్నవో తెలుసునా? ఒక్కొక్కరి జీవితంలో ఒక్కొక్కసంఘటన జరుగుతూంటుంది. దాన్ని ఖర్మ అని పిలవాలో మరేమనాలో నాకూ తెలీదు. కాని అందరి జీవితాలూ అలానే వుంటాయని ఎందుకు అనుకోవాలి కమలా? మానవుడు పుట్టిందే విషాదం అనుభవించటానికే అనుకుంటే అసలు మానవజాతే అవతరించి వుండేదికాదేమో.

క : కాని మనసుల్ని అరికట్టేశక్తి మనుషులికి వుంటుందా?

ఆ : తప్పకుండా. నిజమైన మానవుడయితే పరిస్థితుల్ని, పరిసరాల్ని అనుగుణ్యంగా చేసుకుని ప్రవర్తిస్తాడు. అలా ప్రవర్తించాలి...(ఉలుక్కుపడి) అదేమిటి? ఏడుస్తున్నావెందుకూ.

కమ : అబ్బే ఏంలేదు.

ఆ : నామాటలవల్ల బాధ కలిగిందా?

క: బాధకలిగించేమాటలుమీరేమన్నారు?

ఆ: మరి! ఈ సంతోష సమయం యిలా విచారపూరితంగాగడవటం నాహృదయంలో ముల్లు గుచ్చుకున్నట్లుగా వుంది కమలా నాకోసం ... నాకోసం సంతోషంగా వుండవూ ?

క : (తేరుకుని) పాపిష్టిదాన్ని. మీకు బాధకలిగిస్తే క్షమించరూ?

ఆ : ఇటువంటి మాటలు అనకుండా వుంటేనే మన భావిజీవితంలో ఒకరికొకరు ఎక్కువదగ్గర అయిపోగలం కమలా.

క : (స్నిగ్ధంగా) అబ్బ.

ఆ : (మృదువుగా) కమలా.

* * *

(ఆరు సంవత్సరాలు గడిచిపోయిం తర్వాత)

శాం: విమలా ఎక్కడున్నావమ్మా.

వి : ఏమిటమ్మా ?

శాం: ఎవరో ఒకావిడ వచ్చిందమ్మా నీకోసం. ఆవిడ కూతురికి చాలా ప్రమాదంగా వుందిట. పాపం ఒకటే విధంగా ఏడుస్తున్నది.

వి : అలాగా? కాని (బాధగా) కమల దగ్గర్నుంచి ఉత్తరం వచ్చిందమ్మా.

(55-వ పేజీ చూడుడు)



# విజ్ఞానవీధులు

"డాక్టర్"



## 151. జడత్వము

జడత్వము అంటే కదిలే చైతన్యము లేక పోడమని మామూలు అర్థము. రాయీ, రప్ప, కొండ, చెరువులోని నీరూ, ఇవన్నీ జడములు. న్యూటన్ మహాశయుడు జడత్వానికి ఇంతకంటె విశాలమైన నిర్దుష్టమైన అర్థము చెప్పేడు. జడత్వమంటే స్థితి మారడానికి బద్ధకమన్నాడు. ఒకచోట పడవేసిన రాయి తనంతటస్థితి మారకుండా పడివుంటుంది. బిలియర్డ్సు బల్లమీద కొట్టిన బంతి, బల్లకి అంచులులేక, ఇప్పటికంటె నున్నగా తయారుచేస్తే, అలా ముందుకి సాగిపోతూనే వుంటుంది. గతిని నిరోధించే రాపిడిగానీ, అడ్డంకిగానీ లేకపోతే కదిలే పదార్థము కదుల్తూనే వుంటుంది. ఇదీ జడత్వమే. ఇంకొక విశేషముంది. కదిలేవస్తువు సామాన్యముగా తిన్నగా ఋజురేఖమీదనే కదుల్తుంది. ఋజురేఖతప్పి వంకర తిరిగిందంటే దానిమీద ఏదోశక్తి పనిచేసిందన్నమాటే. మనము విసిరినరాయి తిన్నగా పోక, భూమివైపు మొగ్గుతూ పోడానికి, మనము విసరిన శక్తి మాత్రమేకాక, భూమ్యాకర్షణశక్తి దానిని లాగుతూండడమే కారణము.

జడత్వమును ఉదాహరించడానికి అనేక అనుభవాలు చెప్పవచ్చును. రైలులోకూర్చున్నప్పుడు గభీమని రైలు కదిలితే తల గోడకి కొట్టుకుంటుంది. రైలుతో సంబంధమున్న మన పృష్ఠభాగము రైలులాగుటవల్ల కదిలింది. రైలుతో అంతసంబంధములేని మన తల ఇదివరకు ఉన్నట్లే అక్కడే వుంది. రైలుగోడ కదిలివచ్చి తలకు కొట్టుకుంది. తలకాయ యొక్క జడత్వమువల్ల ఇది జరిగినది. ఇట్లే, కదిలేరైలు ఆగినప్పుడు, ఇంతసేపూ ముందుకి సాగిపోతూన్న తలా, రొమ్మూ అలాటే ముందుకుపోతున్నాయి. రైలూ, రైలుతో పాటు మన పృష్ఠమూ ఆగినవి. రొమ్మూ, తలా, తమ జడత్వమువల్ల ముందుకే పోతూ రైలాగినతర్వాత ముందుకి పడినవి.

చక్కని ప్రయోగము ఇదిచెయ్యండి. ఒక చెంబుమీద పోస్టుకార్డు పెట్టి కార్డుమీద ఒక రూపాయి పెట్టండి. ఇప్పుడు కార్డుని పట్టుకుని ఒక్క ఊదుటున లాగెయ్యండి. కార్డుని లాగినారు కనుక అది వచ్చేస్తుంది. నాణెమునకు ఆ వేగము సంక్రమించనంత త్వరగా లాగినారు కనక నాణెము జడత్వమువల్ల అక్కడే వుండి, ఆధారములేక, చెంబులో పడుతుంది.

విజయనగరమునుంచి జె. వి. సూర్యం గారు రాస్తున్నారుగదా, "నిలువుగా తాపింపబడిన ఒక గాజుపలకను రాయితో విసరికొట్టినచో అద్దము పగులును. తుపాకి గుండు పేల్చినచో పగలక గుండ్రని కన్నము పడునట. ఎందువల్ల?" అని. రాయి వేగము తక్కువ. అది గాజుకి తగిలి తగిలిన చోటికి ఎక్కువ వేగాన్నీ, దాని పక్కచోటికి అంతకంటె తక్కువ వేగాన్నీ, చివరకి గాజుపలక అంచుకికూడా ఎంతో కొంత వేగాన్నీ ఇస్తుంది. ఈ వేగ తారతమ్యము వల్ల వంగలేక, గాజుపలక విరిగిపోతుంది. తుపాకిగుండు వేగము సెకనుకి 1100 అడుగులు మించి వుంటుంది. కనక అది గాజుపలకని తగులుతూండిన కాలము లిప్తకూడా ఉండదు. ఈ లిప్తలోనూ అది ఏమి చేస్తుంది? తనంత మేర గల గాజుబిళ్లకి తన వేగాన్నిస్తుంది. తన కింత వేగము వచ్చిందని తన పక్కనున్న గాజుతో 'చెప్ప'డానికి ఆ గాజుబిళ్లకి వ్యవధి లేదు. కనక వేగము అందుకున్న జడమైన భాగము విసురుకుంటూ పోతుంది, వేగము అందని జడవస్తువు అక్కడే వుంటుంది. అంటే గాజుకి కన్నము పడుతుందన్నమాట.

కంసాలి సుత్తి బిగించడానికి సుత్తిని తిరగవేసి కర్రను దాగలికి కొట్టితే, సుత్తీ కర్రా అతని చేతితోపాటు అధోగమనము చేస్తాయి - కర్రకి దాగలి అడ్డువచ్చింది కనక కర్ర ఆగిపోయింది. సుత్తి అధోగమనము చేసి బిగుస్తుంది. చాకలి తడిసిన మురికి గుడ్డను బల్లకి కొట్టితే, గుడ్డా, మురికి నిండిన నీరూ అతని చేతి వేగముతో దిగుతాయి. బల్లకి తగిలి గుడ్డ ఆగుతుంది. మురికి నీరు ముందుకు సాగుతుంది. ఇలాగ కొన్ని పెట్లతో మురికంతా నీటితో దిగిపోతుంది. మురికి పొడిదైనా బూడిదైనా, ఆకులపొడి అయినా, నీరు అక్కరలేదు. దులిపితే, గుడ్డతోపాటు కదిలి, గుడ్డ ఆగగానే ఆ దుమ్ము మాత్రము ఆగక గుడ్డను విడిచిపోతుంది. ★

## చిట్టి ప్రశ్నలకు జవాబులు

—"పొద్దుతిరుగుడు" పువ్వులన్నీ పొద్దువైపు తిరిగే ఉండవు.

—మబ్బులు రెండు మూడు మైళ్లకన్నా ఎత్తుగా పోవు. మబ్బుల నీడలు చంద్రుడుమీద పడాలంటే, సూర్యుడికీ చంద్రుడికీ నడుమన మబ్బులు రావాలి. అలాగ జరగదు. కనక మబ్బుల నీడలు చంద్రుడిమీద పడవు.

—ఉత్తర దక్షిణ ధ్రువములవద్ద వాతావరణము 0 డిగ్రీలకన్న తక్కువగా ఉండుట వల్ల నీరు గడ్డకట్టుతుంది. గడ్డ కట్టినప్పుడు నీరు పరిమాణములో కొంచెము పెరుగుతుంది. కనక మంచుగడ్డ నీటికంటె తేలిక, తేలిపోతుంది. నీటి ఉపరిభాగాన్ని మంచు ఆక్రమించినప్పుడు అడుగున ఉన్న నీరు, మంచుకి అడుగున గడ్డకట్టుకుని చేరుతూంటుంది, చలి తగ్గగానే పైనున్న మంచుగడ్డ పెళ్లలు కరుగుతాయి. నీటిపైన ఉన్న మంచుగడ్డ నీటివలెనే వేడిమిని (గాని చల్లదనమును గాని) తనలోనుంచి పోనివ్వదు. కనక, గడ్డకట్టిన చెరువులో మంచుకింద నీళ్ళూ దానిలో చేపలూ కూడా వుంటాయి.

—కలలు వచ్చే పరిస్థితులు అందరికీ అవే కావు. మీకు గుండెలపై చేతు లుంచుకో

కుని పడుకున్నంటే కలలు వస్తాయంటున్నారు నాకు అలాగ రావు. వెల్లకిల పడుకున్నంటే వెన్నెముకకీ, మెడ వెనకగల నాడులకీ కలిగే ఒత్తిడివల్ల మెదడులో నాడుల వికారము కలిగి కలలు రావచ్చును. మన జ్ఞానమంతా నాడులలోనే కదా నిక్షిప్తమై యున్నది? అవి ఒత్తబడితే కలలు రావచ్చును.

—మన కళ్ళు రెండింటికీ రెండు వేర్వేరు దృశ్యాలు కనబడినా, సర్దుబాటువల్ల ఈదృశ్యాలకు సమంగా ఉండే భాగాలు మాత్రం చేరుకుని ఒకటిగా కనబడతాయి. ఒక కంటిని రెప్పమీద, అంటే గ్రుడ్డుమీద నొక్కితే ఈ ఏకమత్యము చెడి, రెండు కళ్ళకీ కనపడే బింబాలు వేరువేరవుతాయి.

—దయ్యాలు మేము చూడలేదు. అవి ఉన్నాయని పూర్వులనేవారు. నేటివారు లేవంటున్నారు. వాటి జోలి మనము పెట్టుకపోతే అవి ఉండవు

—ఎక్కువ హాయి కల్గించే వాద్యము వేణువు.

—జ్ఞాపకశక్తి వృద్ధికావాలంటే, సాధకము ఎక్కువ చెయ్యాలి. ఒక విషయాన్ని వినీ, వల్లించీ, చూసీ, రాసీ చేస్తే అది ఎక్కువ జ్ఞాపకముంటుంది. శిరసాసనము మెదడులో రక్తప్రవాహాన్ని ఎక్కువ చేస్తుంది. మనము శిరస్సు క్రిందివైపుండే స్థితిలో ఉండనే ఉండము. కనక శిరసాసనము మంచిదే.

—గడియారములో రేడియంఅంకెలు యశద గంధకిదమూ, రేడియో ధార్మిక పదార్థము కలిపిన ముద్దతో వేసినవి. రేడియో ధార్మికపదార్థము వెలువరించే ఆల్ఫా, బీటాకణములు యశదగంధకిదకణములను ఛేదించి మినుకు మనిపించును. మీరు చూచే మినుకు మినుకులవే.

—శూద్రులే కాదు మానవు లెవరేనాసరే, వేదములు చదువుటకు అర్హులే అని మా అభిప్రాయము. ఎవరి అభిప్రాయము ఎలాగున్నా, వేదములు ఇంగ్లీషులోకి తర్జుమా అయివున్నాయి. ఎవరు చదువుకోడానికీ అభ్యంతరము లేదు. ప్రపంచ జాతులన్నిటిలోనూ పురోహితజాతివారు తమ 'ఆధిక్యాన్ని' నిలబెట్టుకోడానికి ఇతరులు చదవరాని గ్రంధాలు ఎప్పుడూ కేటాయించుకునేవారు. ఈనాడు కూడా స్పెయిన్ దేశములో క్రైస్తవేతరుల శవములను క్రైస్తవుల స్మశానాల్లో పాతిపెటనివ్వరు. అంటే మానవుల తత్వంలో ప్రత్యేక హక్కులుంచుకునే గుణమే మన పురోహితులకూ వచ్చింది. ఈ కళ్మలాన్ని కెలకకుండా ఎండగట్టేయడమే నేర్పు.

—మత్స్యావతారము వాస్తవంగా జరిగిందని మాకు నమ్మకములేదు. ఇంకొకరికి అందినంత మాత్రమున మైలపడిపోయేటంత తేలిక వాఙ్మయము కాదు వేద వాఙ్మయము. అయినా సోమకాసురుడికి వేదాలు దొరికినంతమాత్రమున వానిని సరికేయవలసినంత అపాయమేమీ జరగిపోలేదు లోకంలో. జగత్ప్రళయ మెప్పుడో జరిగిందనే గాధ క్రైస్తవ మత గ్రంధాలలో కూడా వుంది. ఆ ప్రళయముప్పుడు నోవా అనే రాజు ఒక ఓడలో రక్షణపొందేడు. ఆర్యులు ఈలాంటి గాధనే తమ పురాణాలలోనికి అన్వయించుకున్నారు. పురాణగాధలు ఒళ్ళు పెంచేసుకుని రూపు మారిపోయిన చరిత్రలన్నా అనవచ్చును. ఇవి జరిగినవి కావు. మహాభారతములో చూడండి, భీష్ముడు అభిమన్యుడితో యుద్ధము చేశాడట. ఎన్ని తరాలు బ్రతికేడంటారూ భీష్ముడూ?

—కాకి గూట్లో మూడు గ్రుడ్లు చూశాను నేను ఒక మారు. కోయిల కాకిగూట్లో గుడ్డు పెట్టుట నిజమే కావచ్చును గాని ప్రతి కాకి గూట్లోనూ కోయిలగ్రుడ్డు ఉండి తీరుతుందనడము నిజము కాగలదా? కాకులున్నన్ని కోయిలలు లేవుగదా? పిచికగూట్లో కోయిల గుడ్డు పెట్టడమూ, కద్దు. పిచికల జంట కోయిల పిల్లకి మేత పెట్టడము చూచాను నేను.

—కారణాల్ని ఎన్నిటినో కాదు కాదని, చివరికి వంశ పరంపర వల్లనే బట్టతల వస్తుందని శాస్త్రజ్ఞు లనుకుంటున్నారు. ఇదీ పురుషులలోనే ఎక్కువట. ఏ కారణము వల్లనో ఆడవారికి ఈ వంశపరంపరాగత గుణము అంత ఎక్కువగా సంక్రమించదట అయితే ఆడవారిలో కూడ బట్టతల లేకపోలేదు.

అన్నిరకాల 'బట్ట'లూ—కనురెప్పలూ కనుబొమలూ మాత్రమే వెంట్రుకలు లేక ఉండడమూ, నడునెత్తి దగ్గర వెంట్రుకలు రాలిపోడమూ, వంటిమీద ఎక్కడా వెంట్రుకలే లేకపోవడమూ—తాత ముత్తాతలనించి ఆ వంశములోని పురుషులకు దిగివస్తున్నాయని శాస్త్రజ్ఞులు కనుక్కున్నారు. అయితే బీ-కాంప్లక్సు విటమిను లోపమువల్ల బట్టతల వస్తున్నదని కూడా అంటున్నారు. మనకింకా తెలియని కారణమువల్ల బి-విటమిను ఆ 'రోగు'లకు ఇచ్చినా, వారి తత్వానికి అది వంటబట్టదట. ఏతావాతా బట్టతలకు నిశ్చయమైన మందు తెలియలేదు.

నీగ్రోజాతిలోనూ, మంగోలియను జాతిలోనూ కంటె కాకేషియను(ఆర్య)జాతిలో బట్టతల ఎక్కువట.

—ఒక గాజుబుడ్డీలోని గాలి నంతటినీ తీసెయ్యడానికి 'సులభమైన' సాధనా లేవీ లేవు హనుమంతరావుగారూ. ముప్ఫయి అంగుళాలు దాటిన పొడవున్న గాజుగొట్టములో పాదరసము నింపి, మూతి మూసి, ఆ గొట్టాన్ని తలక్రిందులు చేసి, ఒక పాత్రలోని పాదరసములో ప్రేలూ, మూతీకూడా ముంచి వేలు తీశేస్తే, గొట్టాములోని పాదరసమంతా పడిపోక ముప్ఫయి అంగుళాలు దాకా నిలబడి, ఆపైని కాళీ ప్రదేశము వచ్చిందని టారిసెల్లి అనే ఇటాలియను వైజ్ఞానికుడు కనిపెట్టాడు. పంపులవల్ల ఒక పాత్రలోని గాలిని తోడెయ్యడమే నేటి మార్గము. ఎలక్ట్రికు బల్బులలో గాలిని పంపులవల్లనే తోడేస్తారు. రేడియో వాల్వులలోని గాలిని పంపులతో తోడెయ్యడమే గాకుండా, కొబ్బరిపెంకు కాల్చిన బొగ్గుతో మిగిలిన గాలిని పీల్పించేస్తారు. (చల్లారే కొబ్బరి బొగ్గు గాలిని పీలుస్తుంది.) వాల్వులలో గాలి ఏపాటి వున్నా వాల్వు పని చెయ్యడానికి అడ్డంకియే.

—శకునాల్ని? ఎంతవరకూ నమ్మవచ్చునంటారా? పరీక్షచేస్తే, అంతా అబద్ధమే ననిపించేవరకూను. ★



అమృత హస అంద జవని

# ఆంధ్రగీతిక

పి. గణపతి శాస్త్రి

జయము! జయ మ్మాంధ్ర జగజ్జననీ! మము గన్న తల్లి!
జయ! జయ హే! ద్వీపాంతర చలితలలిత కీర్తివల్లి!

నీపురాప్రభం దలంచి, నీపదముల పూలు లుంచి,
పూజించెద మెదల మేము తేజోమయ విగ్రహమ్ము!
తరళకృష్ణవేణీ గోదావరీ హృదయహారా!
చరణోచ్చల సాగరమణి కిరణోజ్జ్వల మంజీరా!

నిఖిలాంధ్ర మ్మొకగళముగ, నీఘన జయమంగళముగ
స్థాపించెద మనుదినమ్ము, మాపూర్వ ప్రాభవమ్ము!
వీర రెడ్డినృపతి మనోహారి మధూత్సవతోరణ!
భారతకవితారుణ మందార మాలికాభరణా!

దిగ్దిగంత జలనిధులన్. దిగ్దంతి శ్రవణములన్,
భో రను గా కాంధ్రయశోభేరిగంభీర ఘోష!
శాసితాంధ్ర రాణ్మహేంద్ర జనపతి పూజిత చరణా!
సార్వభౌమ కృష్ణరాయ జయ నీరాజితవదనా!

జయము! జయ మ్మాంధ్ర జగజ్జననీ! మము గన్న తల్లి!
జయ! జయ హే! ద్వీపాంతర చలిత లలిత కీర్తివల్లి!




# తెలుగుబిడ్డ

రచన: మునిపల్లె రాజు

మా చిట్టి పుట్టింది కరువు దేశములోన
పుట్టగా కురిసినవి పూలవానల్లు
మా జ్యోతి ప్రభవించె కాలమేఘాలలో;
ప్రభవించ చంద్రుడే దోబూచులాడాడు.

మా బుజ్జి వుదయించె యుద్ధనాదాలలో
ఉదయించ శాంతియని లోకమే మేల్కొంది.
మాపాప పేరెట్టి శాంతియని పిలిచాము
మాపాప పేరెట్టి జ్యోత్స్నయని పిలిచాము.

ఆటలకు మా పట్టి బహుదొడ్డ దిట్ట
పాటలకు మాచిట్టి రత్నాల రాశి
హాలము జూపెట్టింది, కలము తాబట్టింది,
వరికంకి విసురుతూ ముత్యాలు కురిసింది.

బుద్ధుణ్ణి చూపెట్టి బోసినోటితో నవ్వి
జీసస్‌ను జీరుతూ చేతు లెగరేసింది
గాంధితాతను జూచి కిలకిలా నవ్వింది,
నాకు నీకూ గూడ పళ్లు లేవన్నట్లు
"శిశువు నేనూ గూడ ఫలములమె" అన్నాడు.

"హంపి శిథిలాలలో మూగబొమ్మను నేను;
తల్లికోటస్థలిలో కూలి లేచినదాన్ని,
కాకతీయాగ్నిలో అమరజ్వాలను నేను,
రెడ్డిరాజుల నెమలి బురుజు జెండా నేను

క్రిష్ణదేవుని కీర్తి తిరిగి వస్తుందోయి!
కలముపట్టిన కవులు కత్తులెత్తండోయి !
పొలముదున్నినవాళ్లు హాలములెత్తండోయి!
ముక్కోటి ప్రజలకూ ముత్యాలదీపాన్ని
కొత్తకాంతిని నేను, కొత్తక్రాంతిని నేనె.

రుద్రమ్మఖడ్గాన్ని, మల్లమ్మ శౌర్యాన్ని,
విశాలాంధ్రకు నేను కొత్తవారసురాల్ని.
ఈ పాతగడ్డకూ కొత్త చిగురాకునోయ్
తెలుగుబొమ్మల్లోని మధురామృతము నేను.

ఇంటిబిడ్డను నేను, మింటి తారను నేను.
కథలోని కన్యను, కావ్యాలమాలను
కలలోని నిజమును, కాలమాతను నేను.
కొత్తవారసురాల్ని, కొత్తవారసురాల్ని!"



## బొమ్మరిల్లు సీరియల్

# అద్దెబోటులో— ముచ్చటగా ముగ్గురు

## (కుక్క సంగతి సరే సరి!)

## 15

మరునాటి సూర్యోదయం మేము ముగ్గురమూ చాలా పొద్దుపోయి నిద్రలేచాం. అతి సాధారణమైన ఫలహారం ఏదో చేసి, కంచాలు పళ్లేలు కడిగి, ఎక్కడి సామాను అక్కడ సద్దేశాం. (ఆరోజు సామాను సద్దుతుండగా, మన యిళ్లల్లో ఆడవాళ్లకి పొద్దు ఎట్లా పోతుందో నాకు కొంతమటుకు అర్థమైందనిపించింది.) పది గంటలప్పుడు పడవకి లంగరు ఎత్తాం.

ఈవేళ తాడుపట్టుకులాగటం మానేసి, తెడ్లతోనే పడవని నడిపించుకు పోదామని మాలో మేము తీర్మానించుకొన్నాం. నన్నూ, జార్జినీ తెడ్లు వెయ్యమనీ, తాను చుక్కాని పట్టుతాననీ హారిస్ అన్నాడు. ఈ ఏర్పాటు నాకేమీ నచ్చలేదు. నన్నూ, జార్జినీ తెడ్లు వెయ్యమనకుండా, తనూ జార్జి తెడ్లువేసి, నన్ను కాస్త విశ్రాంతిగా చుక్కానిదగ్గర కూర్చోనిచ్చివుంటే హారిస్ని నేను నిజంగా మెచ్చుకొనే వాణ్ణి. ఈ పడవ ప్రయాణం సందర్భంలో అప్పటికే నా మటుక్కు నాకు నేను చేయవలసినదానికంటే, చాలా ఎక్కువగా పని చేస్తున్నాననిపిస్తున్నది. నా మనస్సుకి ఎంతో కష్టంగాకూడా వుంది.

అసలు నాకు ఎప్పుడూ అలాగే అనిపిస్తుంది— నేను న్యాయంగా చేయవలసినదానికంటే చాలా ఎక్కువపని నామీద పడుతూ వుంటుందని. అంటే— పనిచెయ్యటం నాకు ఇష్టంకాదని మాత్రం అనుకోకండి. పని అంటే నాకు చాలా సరదా. పనులు జరుగుతుండగా గంటలతరబడి నేను ఆ పనులు జరిగే చోటనే కూర్చుని ఎంత సేపైనా చూస్తూ వుండగలను!

నిజంగా నాకు పని అంత యిష్టమైనప్పటికీ, ఏపనిల్లో ఎంతభాగం న్యాయంగా నావాటాకి రావాలో అంతకంటే ఎక్కువ కావాలని నేను ఎప్పుడూ కోరుకోను. అలాచేస్తే యితరులకి అన్యాయం చేసినట్లు ఔతుంది.

పనులను గురించి నాకు యింత న్యాయమైన ఆలోచనలు వుండగా, అదేమి కర్మమో— నా వంతు వచ్చేసరికి ఎక్కడలేని పనీ వచ్చిపడుతుంది. నన్ను పట్టుకొని వేధించే సమస్యల్లో యిదొకటి.

న్యాయంగా రావలసినదానికంటె ఎక్కువపని మీద పడుతున్నదేమోనని, నేను అస్తమానం బాధపడుతూవుండటం శుద్ధ అనవసరమనీ, నిజానికి యిప్పుడు నేను చేస్తున్నదంతా కలిపి చేయవలసిన దాంట్లో సగమైనా వుండదనీ నన్ను జార్జి అప్పుడ

మూలం :
జెరోమ్ కె. జెరోమ్

అనువాదం :
విశ్వాత్ముల నరసింహమూర్తి

 **ముచ్చటగా ముగ్గురు** 

ప్పుడూ బుజ్జగిస్తుంటాడు. అది కేవలం బుజ్జగింపేనని నాకు బాగా తెలుసు.

మామూలుగా పడవ నడిపేటప్పుడు, పడవలో ఎంతమంది వుంటే అంతమందీ, ఎవడికివాడు తనొక్కడే పనిఅంతా చేసుకుపోతున్నానని అనుకొంటాడు. అలాగే హారిస్సూ! తానొక్కడే పనంతా చేస్తున్నాడనీ, నేనూ జార్జీ సోమరితనంగా కాలం గడుపుతున్నామనీ, వాడికి ఒక గట్టినమ్మకం. ఆ మాట బయటికి అనేసరికి జార్జికి వొళ్లు మండుకొచ్చింది. హారిస్సుగాడు పడవలో ఎక్కింది మొదలు యీ క్షణంవరకు తినటం, నిద్రపోవటం తప్పించి మరే పనీ చెయ్యనేలేదనీ, తాను (అంటే జార్జి!) ఒక్కడే అంతపనీ చేసుకొస్తున్నానని గట్టిగా వాదించాడు.

అంతటితో ఆగకుండా నన్నూ, హారిస్సునీ పోలిన సోమరిపోతువెధవలతో తను ఇంతవరకు ఎన్నడూ ప్రయాణం చెయ్యలేదు పొమ్మన్నాడు.

వీడి ధోరణి చూసి హారిస్సుకి నవ్వువచ్చింది. "జార్జిగాడు పనిచేస్తున్నాడా? గట్టిగా అరగంటసేపు పనిచేస్తే ఆవలించి చచ్చే యీ చచ్చువెధవ పని చేస్తున్నాడంటే ఎవడు నమ్ముతాడు?" అంటూ నావైపుకి తిరిగి "పోనీ నువ్వు చెప్పరా; వీడు పనిచేస్తుండగా నువ్వెప్పుడైనా చూశావా?" అని నన్నడిగాడు.

ఇదివరకటిమాట ఏమోకాని, ఈ ప్రయాణం సందర్భంలో మాత్రం జార్జిగాడు పనిచెయ్యటం నాకంట ఎన్నడూ పడలేదని, నేనూ హారిస్సునే సమర్థించాను.

"కాకపోయినా— నేను పనిచేస్తున్నదీ లేనిదీ నీకు ఎల్లా తెలుస్తుంది? రోజుకి ఇరవై గంటలు నిద్రేపోతుంటావాయె!" అంటూ జార్జిగాడు హారిస్సుమీద విరుచుకుపడి "పోనీ నువ్వు చెప్పరా జెరోమ్;— వీడు తిండి తినేటప్పుడుతప్ప ఎప్పుడైనా పూర్తిగా మేలుకొని వున్నాడేమో?" అన్నాడు.

నిజం అంటే నాకు వున్న పక్షపాతంకొద్దీ, నేను జార్జినీ సమర్థించక తప్పలేదు.

"తల బిరుసుమాటలు మాట్లాడకండి... కనీసం ఈ జెరోమ్‌గాడు చేస్తున్నదానికంటే ఎక్కువపనే నేనూ చేస్తున్నాను." అన్నాడు హారిస్సు, నామీద మండిపడుతూ.

"అవును. అంతమటుకు నిజమే. కావాలన్నా, జెరోమ్‌కంటే తక్కువపని చేయడం ఎవరికీ చేతగాదు." అన్నాడు జార్జి.

"కాకపోయినా— ఈ జెరోమ్‌గాడు తాను ఈబోటులో ప్రయాణీకుడైనట్లూ, మనమిద్దరమూ పడవనడిపే కూలివాళ్లమైనట్లూ అనుకొంటున్నట్లున్నాడు!" అన్నాడు హారిస్సు.

చూడండి ఎల్లా వుంటుందో— వాడూ, వాడూ ఒకటైపోయారు. ఈ వెధవల నిద్దరినీ, ఈ వెధవలు ఎక్కిన ఈ వెధవబోటునీ కెన్సింగ్‌టన్ నుంచి చచ్చిచెడి లాక్కొచ్చినందుకూ, పడవలోనూ బయటా ప్రతిపనీ, ప్రతి విషయమూ పర్యవేక్షించినందుకు, వాళ్లు నాకు చూపే కృతజ్ఞత యిది! అసలు మనుష్యులు అంతా యింతే సుమండీ!!

చివరికి ఎల్లానైతేనేం— 'రీడింగ్' దాకా హారిస్సు, జార్జి తెడ్లు వెయ్యటానికీ, ఆ తరువాత నేను పడవ తాడు లాగటానికీ ఒప్పందానికి వచ్చాం. ఇదివరకు ఒకప్పుడైతే, నాకు వొళ్లు అలిసేపని అంటే మహా సరదాగా వుండేది. ఆరోజుల్లో అయితే— యింత పెద్ద పడవనీ ఏటికి ఎదురు లాగటం నేను అట్టే లెక్కచెయ్యకపోయివుందునేమో కాని, యిప్పుడు మాత్రం నాకు అందులో సరదా పడవలసింది ఏమీ కనిపించలేదు.

పడవల్లో ఏళ్లతరబడి పనిచేసినవాళ్లకి కూడా నాలాగే, వృద్ధాప్యం వచ్చేసరికి పడవలు నడపటంలో వుత్సాహం పూర్తిగా హరించిపోతుంది. అందులోనూ— నలుగురూ బాగా కష్టపడి పనిచేస్తేకాని వీలులేని పరిస్థితుల్లో వీళ్లకి తప్పకుండా ఆ నిర్లిప్తత వచ్చేస్తుంది. పడవల్లో పనిచేసిచేసి, రాటుతేలిపోయినవాడెవడో, తేలనివాడెవడో గుర్తుపట్టటం చాలా తేలిక. పదిమందీ పనిచెయ్యవలసిన సమయంలో చక్కగా పరుపు పరుచుకొని దిళ్లు పేర్చుకొని

వాటిమీద ఏటవాలుగా కేళీవిలాసంగా పడుకొని, ఎవడైతే పడవలాగటంలో గల ప్రత్యేకతనిగురించీ, ఆ విద్యలో తన పూర్వానుభవాలను గురించీ వుపన్యాసం యిస్తుంటాడో ఆ వ్యక్తే రాటుతేలిన వ్యక్తిగా గుర్తించండి.

నా చిన్నతనంలో యిల్లాంటి పెద్దవాళ్లు చెప్పే పెద్దపెద్ద కబుర్లన్నీ నేను అతిశ్రద్ధగా విని, అతిభక్తిగా నమ్మి, వాళ్లు చెప్పినదాంట్లో ప్రతి మాటనీ ప్రతి అక్షరాన్నీ పూర్తిగా జీర్ణం చేసుకొనేవాణ్ణి. ఈతరం కుర్రాళ్లు అల్లాకాదు. పెద్దవాళ్లమీద భక్తీలేదు. వాళ్ల అనుభవాలమీద విశ్వాసమూ లేదు. నిరుడు నేనూ, జార్జి, హారిస్సు కలిసి, పడవ నడపటం బొత్తిగా తెలియని ఒక కుర్రాణ్ణి పట్టుకొచ్చి వాణ్ణి కూర్చోబెట్టి మా పూర్వానుభవాలన్నీ ఏకరువు పెట్టేశాం.

పడవలు నడిపే వాళ్ల సంప్రదాయాన్ని పూర్తిగా పాటించి, తరతరాలుగా వస్తూవున్న అబద్ధాలనుకూడా గుచ్చెత్తి మా అనుభవాలు అన్నీ వాడికి చెప్పేశాం. వీలైన చోట్ల ఆ అబద్ధాలకి మరికొన్ని కల్పించికూడా చెప్పాం. మా అనుభవాలనే కాకుండా మా మిత్రులూ, వాళ్ల మిత్రులు పడవ నడపటంలో చేసినట్లుగా చెప్పుకొన్న ఫీట్లు అన్నీ మేం చేసినట్లే చెప్పేశాం. మేము చెప్పిన ధోరణిని బట్టి చూస్తే చిన్న అంత పిల్లఅయినా అవన్నీ మేం చేసినవనే నమ్మితీరాలి. ఈ కుర్రవెధవ తను ఛస్తే యీ



# ముచ్చటగా ముగ్గురు



మాటలు నమ్మనన్నాడు. మేము అప్పటికప్పుడు పడవలో బయలుదేరి ఆ ఫీట్లు అన్నీ చేసిచూపించాలన్నాడు. మేము చేసినట్లుగా చెప్పుకొన్న ఫీట్లు మొత్తం సంఖ్యంలో పదింట ఒక్కటైనా మేము చేసివుండమని వాడు పందెంకూడా వేస్తానన్నాడు.

ఆ ప్రాతఃకాలపు ప్రశాంత వాతావరణంలో మేము పడవలు నడిపే కళకు సంబంధించిన విషయాలు ముచ్చటించుకొంటూ, మొదట్లో తెడ్లు వెయ్యబోయి మేము పడ్డతిప్పలు జ్ఞాపకం తెచ్చుకొన్నాం.

వాళ్లిద్దరి తొలి అనుభవము ఎట్లావున్నా, నా అనుభవం మాత్రం యిలా నడిచింది:

మేము మొత్తం ఐదుమంది కలిసి తలాఒక ఐదుపెన్నీలు చందావేసుకొని 'రీజెంటుపార్కు-లేక్'లో పడవ ఒకటి అద్దెకు తీసుకొని, తెడ్లువెయ్యటం నేర్చుకొన్నాం.

ఎప్పుడైతే ఒకసారి నీటిమీద ప్రయాణం జరిగిందో అప్పటినుంచీ నాకు అదంటే విపరీతమైన సరదా పుట్టుకొచ్చింది. మా యింటికి దగ్గిర ఇటికాముల మధ్యగా ఒకపెద్ద చెరువు వుంది. అందులో కొన్ని తెప్పలు పడివుండేవి. తెప్పతాలూకు యజమాని ఎవడూ దగ్గరలో లేకుండాచూసి, ఒక తెప్పని విప్పేసి, దానిమీద చెరువులంతా షికార్లు చేస్తుండేవాణ్ణి. ఆ హుషారులోపడి వొళ్లు తెలియని స్థితిలోవుండగా తెప్పతాలూకు యజమాని దుడ్డుకర్ర పుచ్చుకు తయారయ్యేవాడు. వాణ్ణి చూడనట్టే నటిస్తూ, వాడు యివతలగట్టుమీద వుంటే, తెప్పని అవతలిగట్టుమీదికి పట్టించి తప్పించుకు పారిపోయేవాణ్ణి.

ఆ విధంగా మూడు మాసాలపాటు తెప్పలమీద తంటాలుపడ్డాక పడవలునడపటం నేర్చుకోవటం కోసం మావూళ్లో ఒక ఆ విద్యనేర్పే సంఘం ఒకటి వుంటే అందులో చేరాను. చేరానన్నమాటేకాని, నాకు అందువల్ల పడవ నడపటంలో 'స్టయిల్' ఏమీ పట్టుబడలేదు. ఇటీవల 'థేమ్స్' నదిమీద పడవ షికార్లు చేయటం మొదలుపెట్టాక కాని, నాకు తెడ్డు వెయ్యటంలో 'స్టయిల్' రాలేదు. ఇప్పుడిప్పుడు నా 'స్టయిల్'ని నలుగురూ మెచ్చుకొంటున్నారనుకోండి- అది వేరేవిషయం.

మా జార్జి వున్నాడంటే— వాడికి పదహారేళ్లు వచ్చేవరకు నదిఅంటే ఏమిటో ఎరగకుండా బ్రతికాడు. పదహారోఏట మరొక ఎనిమిదిమంది కుర్రకారు వెధవల్తోకలిసి 'థేమ్స్' నదిమీద పడవప్రయాణం చేశాడు. అందులోనూ ఏదో సంసార పక్షంగా వుండే పడవకాకుండా పందేలలో వుపయోగించే పడవ నొకదాన్ని అద్దెకు తీసుకు బయలుదేరారు. వొళ్లు తెలియని వుత్సాహంలో వాళ్లు గాలివాలైనా సరిగా చూసుకోకుండా బయలుదేరారు. నానా తిప్పలుపడి కొంపకి క్షేమంగా చేరారు. అప్పటి అనుభవాల మూలంగానే కాబోలు— జార్జిగాడు తనకు పడవలు నడపటంలో ఆట్టే సరదా లేదని చెప్తుంటాడు.

హారిస్సు తనకి యిలా నదులమీద నావల్లో ప్రయాణం చెయ్యటంకంటే, సముద్రంలో ప్రయాణం చెయ్యటంలోనే ఎక్కువ అనుభవం వున్నదనీ, తనకి సముద్రయానం నచ్చినంతగా యిది నచ్చదని అంటాడు. అది ఎంతవరకు నిజమో నాకు తెలియదు. సముద్రయానంలో నా అనుభవం వేరు.

గడిచిన వేసవికాలంలో ఒకసారి యిలాగే పడవ ఒకటి అద్దెకు తీసుకొని సముద్రంమీద షికారుకు వెళ్లాను. కొన్నిసంవత్సరాల క్రితం నేను చాలాసార్లు సముద్రంమీద పడవనడిపాను. అంచేత యీ సారికూడా సునాయాసంగా పడవ నడపగలననుకొన్నాను. కాని తీరా తెడ్లుతీసుకొని వెయ్యబోతే, పట్టుకోవడం ఎట్లాగోకూడా జ్ఞాపకం రాలేదు. ఒక్కపక్క తెడ్డు నీటిలో వున్నప్పుడు రెండో పక్కది గాలిలోవుండేది. రెంటినీ ఒకేసారి నీటిలో పడేట్లు వెయ్యటానికి ఎంతకీ కుదరక పడవలో లేచి నిల్చోవలసివచ్చింది. అలా ఎంతసేపని వెయ్యగలను? అరఘట్టాంగైనా పోకముందే పడవని ఒడ్డుని పెట్టించేసి అక్కడ ముసలి బెస్తవాడొకడు వుంటే వాడికి కూలి డబ్బులుయిచ్చి పడవ నడిపించిపెట్టమన్నాను.

గంటకి యింత అని కుదుర్చుకొన్న కూలీతాత తెడ్లు వేస్తుండగా చూడటం నాకు చెడ్డసరదా. ఏళ్ల

తరబడి చెయ్యితిరిగిన మనిషేమో — అల్లాటి ముసలివాడు తెడ్లువేసే పద్ధతిలో ఏదో గాంభీర్యం, ఏదో గొప్పదనం కనిపిస్తుంది. ఈ శతాబ్దపు జీవితంలో వుండే త్రొక్కిళ్లాట, ముసలివాడు చేసే ఆ పనిలో ఎంతమాత్రమూ కనిపించదు. కనిపించిన ప్రతిపడవనీ దాటెయ్యాలని ఎప్పుడూ అతను ప్రయత్నించడు. పరాయిపడవ మన పడవని తోసుకొని ముందుకు పోయిందంటే, అతడు మనలా కలవరపడిపోడు. జరిగేదికూడా అంతే — ప్రతి చిల్లిపడవా యితని పడవని వెనకపడేసి ముందుకు పోతుంది. అదే మరో వాళ్లయితే ఎంతగా వుడుక్కొందురో కదా? కూలికి వచ్చిన యీ తాతకిమాత్రం అల్లాంటి వికారాలు ఏవీ రావు. అల్లాంటి వ్యక్తిని చూస్తే, లేనిపోని ఆశలకి పోకుండా వుండటం ఎంతహాయి అయినపనో మనకు కొంతమటుకు అర్థమౌతుంది.

ఏదో చేరినప్పటికి చేరుతుంది లెమ్మన్న ధోరణిలో అయితే సముద్రంలో, అయినా పడవ నడపటం అట్టే ప్రయాసతో కూడుకొన్న పనికాదు. అదే — పక్కబోటులో ఆడంగులు కూర్చునివుండగా, వాళ్లు చూస్తూవుండగా, పడవ నడపవలసివస్తే చిన్న చెరువులో అయినా మహాకష్టం. ఎంత గింజుకున్నా పక్కపడవవాడి తెడ్లకి తగలకుండా మీ పడవ తెడ్లు మీరు వేసుకోపోవటం ఛస్తే కుదరదు.

జార్జి అప్పుడప్పుడూ మార్పుకోసం పంటులో ప్రయాణం చేయాలంటూవుంటాడు. పంటుని నడపటం పైకి కనిపించినంత తేలికకాదు. నీళ్లు మీదికి చిందకుండా తెడ్లు వెయ్యటం కుదిరేటప్పటికే తల ప్రాణం తోకకి వస్తుంది.

నేను ఎరిగివున్న పడుచువాడొకడు యిదివరకు యిలాగే ప్రథమ పర్యాయం పంటులో ప్రయాణం చేయబోయి నానా అభాసు చేసుకువచ్చాడు. మొదట పంటులో ఎక్కినప్పుడు వాడికి అంతా కరతలామలకం అనిపించింది. ఆహుషారులో గడకర్ర తీసుకొని యిష్టంవచ్చినట్లు పంటులో పైకీ కిందికీ నడవటం మొదలుపెట్టాడు. పంటు చివరిదాకా చిందులు తొక్కుతూపోయి, అక్కడ క్షణంసేపు నిలిచి, నీటిలోకి గడగుచ్చి, గబిక్కున వెనక్కి తిరిగి పరుగెత్తుకు వచ్చేవాడు. అదంతా చూస్తున్నవాళ్లకి చాలా చిత్రంగా వుంది.

చివరిదాకా అలాగే వుండేదేమో కాని మధ్యలో చిన్న అవాంతరం ఒకటి వచ్చిపడింది. పంటుమీద నడుస్తూ వున్నవాడు ఆ పని చూసుకోకుండా చుట్టూవున్న ప్రకృతి దృశ్యం చూసి మురిసిపోతూ, కాలు ఎక్కడవేస్తున్నదీ గమనించుకోకుండా పంటుదాటి అడుగు వెయ్యబోయాడు. అప్పటికప్పుడే వాడిచేతిలోని గడకర్ర నీటిఅడుగు బురదలో గుచ్చుకుపోయింది. వీడు దాని రెండోకొసని పట్టుకు వేళ్లాడుతూ గాలిలో కాళ్లు కొట్టుకుపోవటం మొదలుపెట్టాడు. ఈలోగా పంటు అంతదూరం వెళ్లిపోయింది. ఆక్షణాన వాడు వున్న పరిస్థితిని దూరంగా ఒడ్డుమీదనుంచిచూసిన కొంటె కుర్రాడొకడు, 'కర్ర మీద కోతి ఎక్కింది: చూద్దాం రండోయ్' అంటూ మరో పదిమంది పోకిరి వెధవలని పోగేసుకు వచ్చాడు.

ఆ సమయానికి పంటులో వుండికూడ మా మిత్రుడికి నేనేమీ సహాయం చేయలేకపోయాను. ఇటువంటి పరిస్థితి ఒకటి వస్తుందని ముందుగా వూహించివుంటే, అదనంగా యింకో గడకర్రకూడా పంటులో పడేసి తెచ్చుకొనేవాళ్లం. కేవలం కళ్లు అప్పగించి వాడికేసిచూస్తూ కూర్చోవటంకంటే నేనేమీ చేయలేకపోయాను. బురదలో పాతుకుపోయిన గడకర్ర క్రమంగా వొంగిపోతున్న కొద్దీ మా మిత్రుడి ముఖంకవళికల్లో వచ్చిన మార్పులు వర్ణనాతీతం.

నింపాదిగా వాడు నీటిలోకి ఒరిగిపోతూవుండగా చూశాను. నీళ్లలో మునిగినవాడు మళ్లీ పైకివచ్చి గిజగిజలాడుతూవుంటేనూ చూశాను. నాకు నవ్వు ఆగలేదు. వాడి వాలకం అల్లావుంది: నేనుమాత్రం ఏంచెయ్యను? నవ్వు ఆపలేక కాసేపు పొట్టపట్టుకు నవ్వేశాను. నవ్వుతూవుండగా నాలో నాకే, యిందులో నవ్వదగిందేముందనిపించింది. పంటులో వున్న నేనుమాత్రం పదిలంగా వున్నానని నమ్మకమేమిటి? దాన్ని నడపటానికి కావలసిన గడకర్ర నాదగ్గిర లేదు. పంటు చూడబోదామా అంటే, నదీప్రవాహంలో అతివేగంగా కొట్టుకుపోతున్నది. ఇలా పోయిపోయి

(43-వ పేజీ చూడండి)

# [illegible]

ఇప్పుడు నేను నాల్గవ ఫారం చదువుతున్నాను, అప్పటి రోజుల్లో మాకు శరభయ్య పంతులుగారే తెలుగు మాష్టారు. కళ్లజోడు, గ్లాస్కో-పంచ, ఖద్దరులాల్చీ, లోపల అల్లికబనీను వేసుకుని స్కూలుకు వచ్చేవారు. పాఠాలు బోధించడంలో ఆయన యెంత శ్రద్ధగా వుండేవారో, పిల్లలందరూ కూడా పాఠం వినడంలో అంత శ్రద్ధగా వుండేవారు. పిల్లలు వేసే టోపీలలో సాధారణంగా పడేవారే కాదు. కాని ఒకవేళ పడ్డారా, ఆ రోజున పిల్లలమీద మండిపడి, పాఠాలు చెప్పకుండా, క్లాసుకు సెలవిచ్చి గాడిదలల్లే తిరగమనే వాడు. అందుకని యెప్పుడూ మేము ఆయనగార్ని టోపీలో వేయాలని చూసేవాళ్లం.

ఆయనకి పొడుం అలవాటు బాగావుంది. అంటే ఆయన పట్టినంత పొడుం పట్టు పట్టేవారు అరుదుగా వుంటారు. అందుచేత నశ్యం ముక్కులో మూడునిద్రలు చేస్తూ, ఆయనదగ్గిరకి ఒకసారి వెళ్లిన వారిని మళ్లీ వెళ్లకుండా చేస్తుంది. అంటే అంతకంపు అన్నమాట. క్లాసులో యెవరైనా అల్లరిచేస్తే వాళ్లని శరభయ్య పంతులుగారు దగ్గిరకి పిలిచేవాడు. అంటే ఆయన దగ్గరకి వెళ్లినవాడు మళ్లీ తన స్థానంలోకివచ్చి కూర్చునే వరకు శ్వాస పీల్చ లేదనే మనం అర్థం చేసుకోవాలి. "కాబట్టి ఆయనగారి దగ్గరకి వెళ్లే అవసరం లేకుండానైనా చేసుకోవాలి, లేకపోతే ఆయన దగ్గర ఆకంపు లేకుండానైనా చేయాలి" అని మేమందరం ఆలోచించాము.

మేము ఆయన దగ్గరకి వెళ్లకుండా చేసుకోవటం అసంభవం. ఎందుచేత నంటారా, మేము అల్లరిలో ప్రసిద్ధికాంచిన వాళ్లము. అందుచేత ఆయనగారి దగ్గరనుంచి ఆకంపు రాకుండా చేసుకోవాలి అంటే ఆయనగారి పొడుం అలవాటు మాన్పాలి. అదియెట్లా?

**పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి**

అప్పట్లో మాదొక బాచ్ వుండేది. ఆ బాచ్‌లో నేను, నరహరి, రఘు,— మేము ముఖ్యమైన వాళ్లం. రోజూ రాత్రిపూట ఎనిమిదిన్నర గంటలకి పడుకుని తీవ్రంగా ఆలోచించే వాళ్లం.

ఎన్నడూ శరభయ్యగారు పొడుం పీల్చినప్పుడు తుమ్మేవాడు కాదు. కాని ఒక రోజున పొడుం పీల్చిన తర్వాత గంటన్నర వరకూ తుమ్ముతూనే వున్నారు. ఇది నాకేమీ అర్థంకాలేదు. కాని నరహరి మాత్రం యెందుకో తెగనవ్వుతున్నాడు. ఏమిటిరా అని అడిగితే నవ్వే జవాబు.

ఇంకొక రోజున వస్తూనే డ్రాయరు తెరిచి పొడుండబ్బా తీసి, పీల్చకుండానే మళ్లా మూతవేసి, బెత్తంతీసి 'ఈ వెధవపని చేసిందెవడురా?' అంటూ సరాసరి నాదగ్గరికే వచ్చా .

"ఏమిటిసార్?" అన్నాను.

"అలాగేం? నీకేమీ తెలియదన్నమాట!" అని నాదగ్గరనుంచి రఘు దగ్గరకు వెళ్లారు. "ఏరా, రఘూ! ఏమిటి?" అన్నాడు శరభయ్యగారు వికటంగా. "అబ్బెబ్బె బ్బెబ్బే! నాకేమీ తెలియదుసార్!" అన్నాడు ముందుగానే రఘు. ఇంతలోనే ప్యూను యేదోనోటీసు తీసుకువచ్చాడు. లేకపోతే రఘు వీపు వాచిపోయేదే.

అసలు కారణం లేకుండానే యెందుకు బెత్తం తీసుకువచ్చాడో నా కప్పట్లో తెలియలేదు.

ఆ మర్నాడు నేను తల దువ్వుకుంటుంటే "చూశావురా, మన తడాఖా?" అంటూ నరహరి సరాసరివచ్చి నా చేతులోని అద్దం, దువ్వెన లాక్కుని తను తలదువ్వుకోటం మొదలెట్టాడు.

"ఏమిటిరా?" అని అడిగా.

"ఏమిటంటూ వేమిటీ" మొన్న క్లాసులో మన శరభయ్యగారు అంతంత తుమ్ములు యెందుకు తుమ్మారనుకున్నావ్?"

"అవును, ఎందుచేత నంటావ్?" అన్నాను.

"అదంతా మనచేతి చలవేరా భాయ్"

"అంటే?"

"అంటే, శరభయ్యగారి నస్యంలో కారం కొట్టేశాంరా

బ్రదర్. అందుచేతనే పాపం శరభయ్యగారు గంటన్నర వరకూ మేక తుమ్ముతూనే వున్నారు" అన్నాడు.

"అయితే మాత్రం ఆయన పొడుం మానేయ లేదుగా?"

"ఆయన చేత పొడుం మాన్పించటం మనవల్ల కాదురా" అన్నాడు. ఇంతలో రఘుకూడా వచ్చాడు.

"నిన్న మాస్టారు నిన్ను కొట్టబోయా రెందుకురా?" అని రఘును అడిగాడు.

"ఇందుకు!" అని జేబులోనుంచి ఒక చిన్న పొట్లం తీసి బయట పెట్టాడు నవ్వుతూ.

అది ఏమిటో అని పొట్లం విప్పి చూస్తే, పొడుం.

"ఇదేమిటిరా?"

"శరభయ్యగారి పొడుం."

"సాంతం ఖాళీ చేసావల్లే వుందే?"

"ఓ శుభ్రంగా"

"ఏరా, రఘూ! శరభయ్యగారి పొడుం అలవాటు పోయినట్లేనా?" అని అడిగాడు నరహరి.

"ఓరి బాబూ అదిమాత్రం మనవల్ల కాదురా!"

"అయితే మనం మాన్పుతాం చూడరా" అని నా మేకపోతు గాంభీర్యం చూపించాను.



డ్రాయరు తెరచి పొడుండబ్బాతీసి పీల్చుకుండానే మళ్ళా మూతవేసి, బెత్తంతీసి 'ఈ వెధవపని చేసిందెవడురా?' అంటూ సరాసరి నా దగ్గిరకే వచ్చారు.

ఆ మధ్యాహ్నమే ఒక అణా మైనం కొని తెచ్చి, యెవరికీ చూపకుండా ఒక తేలును తయారు చేశాను. ఆ మైనాన్ని కరిగి కరిగి నానా తంటాలుపడి చేసినందుకు అది బాగానే తయారయింది. అది జాగ్రత్తగా జేబులో పెట్టుకొని తీసికెళ్లి, శరభయ్య పంతులుగారు డ్రాయరులో పెట్టిన నశ్యండబ్బిలో దానిని పెట్టి, మళ్లీ యథాప్రకారంగా యివతలకు వచ్చేశాను.

శరభయ్యగారికి సహజంగా తేలంటే భయమే. కాని ఆరోజున మాత్రం అది మైనపుతేలని ఆయనకి యెలా తెలిసిందో యేమో గాని, దాన్ని పట్టుకుని నెమ్మదిగా డ్రాయరుమీద పెట్టి అది మైనపు తేలో, లేక నిజమైన తేలో చెప్పమన్నాడు క్లాసులో ప్రతివాణ్ణీ. అందరూ నిజంగా తేలేనని చెప్పారు. కాని నన్నడిగే సరికల్లా వెంటనే మైనపుతేలని చెప్పేశాను, నోటి నుండి ఆమాట అప్పటికి వచ్చింది కనుక.

అప్పుడాయన నవ్వుతూ నాదగ్గ

(43-వ పేజీ చూడండి)

# దాగుడు మూతలు

పెళ్ళిళ్ళలో నలుగురు పిల్లలం జేరతాం. అది మహా సరదాగా ఉంటుంది. నాకు బాగా జ్ఞాపకం మా అక్కయ్యపెళ్ళి. మా పెద్దబావ గారబ్బాయి, మా అన్నయ్యగారి కొడుకూ, మా చిన్న మామయ్య పిళ్ళూ వాళ్ళూ...ఓ.. కుర్రాళ్ళం... ఒక తోంబగా చేరాం. పెళ్ళిగొడవ పెళ్ళిగొడవే.. మాగొడవ మాదే! దాగుడుమూతలాడదామంటే ఆడదామనుకున్నాం పిల్లకాయలం. పల్లెటూరు... అంచేత పెద్దదొడ్డి.

పంటలు వేసికొన్నాం. పిల్లికి సాయం నేను వెళ్ళాను, ముందుగానే పండిపోయాను కాబట్టి చిన్న మామయ్య దొంగయ్యాడు. "బలే! బలే" అన్నాడు మా పెద్ద

పి. సీతాపతి

బావగారబ్బాయి. వాడికి వీడికీ... కసి! మా పిన్నిగారమ్మాయి... ఓ పద్నాలుగేళ్ళుంటాయి... దొంగ కళ్ళుమూసింది. ఆవిడ తల్లి... దొంగ బయలుదేరాక ఆవిడని ముట్టుకునేవాడిని ఇంక దొంగ అవుటు కొట్టడానికి వీల్లేదు.

దొడ్లో గడ్డిమేటి చాటున దాక్కోడానికి ఒక్క ఉదాం తీశాను. దొడ్లో మామేనత్త, మా మేనత్తకూతురూ ఉన్నారు. మా మేనత్తకూతురు సుబ్బమ్మ దొంగకు నేదాగినచోటు చెప్పేస్తుందేమోనని, నాకు భయంవేసింది. ఇంతట్లోకి ఆమే నన్ను పిలిచింది. "ఒరే సూరీ ఇల్లారారా!" అని.

సుబ్బమ్మవదిన చేతిలో పొతకలాంటి పిల్ల ఏడుస్తోంది. బాబోయ్! ఆపిల్లని ఎత్తుకోమంటుందేమోనని "రాను" అన్నాను. "నీకు...బహుమతీ ఇస్తారా" అంది. నాకు ఆశ పుట్టింది. దగ్గరకు వెళ్ళాను. "వదినా ... పిల్ల ఏడుస్తోందే" అన్నాను. "జ్వరంరా... నా తండ్రీ" అని నాచేతిలో... ఓ... రాగిడబ్బు పెట్టింది. నా ముఖం వికసించింది. లంచమిచ్చి పిల్లను చంక ఎక్కిస్తుందేమోనని తుర్రుమన్నాను.

ఇంతట్లోకే "రంగడవుటో హోయ్!" అని కేక వినిపించింది. తల్లిదగ్గిరకు పరిగెట్టాను. మా అన్నయ్యగారి కొడుకు 'సాని' నాకు డబ్బుఇచ్చిన ఉదంతం కనిపెట్టాడు. "సుబ్బమ్మ పిన్నెం... సూరిగాడికి డబ్బు ఇచ్చిందిరోయ్!" అన్నాడు.

"వెధవది... ఆడబ్బు దిష్టిడబ్బు"

## జోతలు

బొడ్డు బాపిరాజు

జోతలనరా చిట్టి తండ్రీ!
జోతలనవే చిట్టి తల్లీ!
చిన్ని చేతులుమోడ్చి భక్తిని
కన్నతల్లికి ఆంధ్రభూమికి ॥జోత॥

పాలవెల్లువలైన నదులను
పసిడిపండు పొలాల బిడ్డల
కాంచి పెంచెడి కన్నతల్లికి
కరుణాగల మన కల్పవల్లికి ॥జోత॥

పెంపు తరుగని కావ్యఖనులను
సొంపుచెరుగని శిల్పనిధులను
తరతరమ్ముల కీర్తి సిరులను
దాచి ఇచ్చిన జన్మభూమికి ॥జోత॥

వీరవిక్రములైన రాజుల
పేరు గల విజ్ఞానవంతుల
భక్తగాయక చక్రవర్తుల
రక్తినేలిన రాజ్యలక్ష్మికి ॥జోత॥

లలిత కళలను రాచసిరులను
తెలివిగల యిల్లాలితనమున
తేజునించిన తెలుగుబోటుల
దిద్దితీర్చిన దేశమాతకు ॥జోత॥

చిరతపస్సులు ధారవోసిన
చివరకిది లభియించె రాష్ట్రము
పండు మన బంగారు కలలిక
నిండుస్వేచ్ఛను నేడు తల్లికి ॥జోత॥

దేశభాషల లెన్ని తెలుగని
దేశమాతల మేటి తెలుగని
వాసికెక్కగ కన్న బిడ్డలు
చేసి చూపగవలయు తల్లికి ॥జోత॥

ఏదిరా మన తల్లివంటిది
లేదురా మరి ఎవ్వరికి నిక
సాధుమూర్తి సుధా స్వరూపిణి
ఈ ధరిత్రికి ఎత్తి హారతి ॥జోత॥

అంది పెద్దక్కయ్యగారమ్మాయి చిట్టి.

"నువ్వు చూశావేమిటి?" అన్నాను.

"ఓ... నే చూశా రా" అన్నాడు రంగడు.

"ముందు... నన్ను పుచ్చుకోమందిరా" అంది చిట్టి...

"నేనుగడ్డిమేటిచాటు నించి చూశాను... జ్వరమొచ్చిన వాళ్ళమ్మాయికి, దిగదుడిచింది ఆ రాగి డబ్బు... నాకిస్తే మొహమ్మీద గిరవాటేశాను".

"దిగదుడుపు డబ్బురా... పారేయ్" అన్నాడు నాని.

"ఏది చూపించు..." అంది మాకు తల్లిగాఉన్న పిన్నిగారమ్మాయి చిన్నమ్మ.

నా గుప్పిట తెరచి చూపించాను. రంగడు ఆ డబ్బుని ముట్టుకొని బొమ్మా, బొరుసూ పరీక్షించి చూచాడు. "దాన్ని ముట్టుకోకురా... జ్వరమొస్తుంది." అంది వాళ్ళ అక్క. "నిజంగా!... జ్వరమొస్తుందేమిటే?" అన్నాను.

"ఆ!" అని రంగడి అక్క దిగదుడుపు డబ్బువలనజరిగిన చిన్నకథ ఒకటి చెప్పింది. నాకు భయంవేసింది. జ్వరమొస్తుందేమో అనుకున్నాను. ఎందుకు పుచ్చుకున్నానురా" అనిపించింది. చచ్చిపోతారని కూడా చెపుతున్నారు. నిజంగా చచ్చిపోతానేమో... ఏడుపొచ్చింది. బిక్కముఖం వేశాను.

నాచుట్టూ మూగిన కుఱ్ఱాళ్ళు ఒక సలహా చెప్పారు. తోటలోని బావిలో డబ్బు గిరవాటువేసి మళ్ళీ అటు చూడకుండా తిరిగివచ్చేస్తే దిగదుడుపు డబ్బువల్ల భయంలేదన్నారు.

ఇంతట్లోకే మా పొరిగింటి పుల్లన్నగారి కొడుకు విశ్వం వచ్చి అన్నాడు. "పోండిరా! డబ్బు ఏం చేస్తుందేమిటి దిగదుడుపైతేనేం... మరొకటి అయితేనేం... నన్ను చెయ్యమను చూస్తాను" అని నా చేతిలో డబ్బు తీసికొన్నాడు.

"దాన్ని అడుగులోతు గొయ్యి తీసి పాతెయ్యాలి.. తీసికో చూద్దాం నీకు జ్వరం రాపోతేనూ!..." అంది చిట్టి ఛాలంజీగా. విశ్వానికి కస్సుమనిపించింది. "రారా! సూరీ... వీళ్ళమాటలు నీకెందుకు... నీకేదైనా వస్తే మా సాయిబుచేత రక్షరేకు కట్టిస్తాను" అన్నాడు విశ్వం నా చెయ్యిపట్టుకుని లాక్కుపోతూ. "పోనిండిరా... మనకేం" అన్నారు కొంతమంది.

* * *

"నిజంగా చచ్చిపోరేంరా?" అన్నాను విశ్వానికేసి చూస్తూ. వాడు మంచి ధైర్యస్తుడు. నీటిపాముతోక పట్టుకొని ఆడిస్తాడు. ఒకసారి తేలుకొండికి తాడుకట్టి పిల్లల్ని గోలెత్తించాడు.

"చచ్చిపోరుకాని..." అన్నాడు సంకోచంగా

"మరి ఏంచేస్తుంది?"

"...జబ్బు చెయ్యదులే!" అన్నాడు. వాడుచెప్పింది నాకు నచ్చలేదు. "ఒరే నువ్వు చెపితే చెప్పు లేకపోతే రంగడు చెప్పినట్టు చేస్తా"నన్నాను.

"సాయిబు నడుగుతానుగా?" అన్నాడు.

"అందాకా ఈడబ్బు ఏం చేద్దాం" అన్నాను.

"పాతిపెడదాం" అన్నాడు.

"మరి ఇందాకా పెద్దధైర్యంగా చెప్పావే!"

"...మరి నాకూ భయంగానే ఉందిరా" అన్నాడు. కానే పయ్యాక పెద్దనవ్వు నవ్వాడు. నేను హడలిపోయాను.

"ఎందుకురా నవ్వుతున్నావ్." అన్నాను. వీడు డబ్బుని తిట్టాడు.. దెయ్యం పట్టుకోలేదు కదా అని అనుమానం కలిగింది.

గట్టిగానవ్వి అన్నాడు "ప్రాణం లేని డబ్బు ఏంచేస్తుందిరా... దాని మొహం... చూడు! నీకో మంచి ఉపాయం చెబుతా"నని వాళ్ళ మామిడి చెట్టుక్రిందకి తీసుకుపోయి కూర్చోపెట్టాడు. నాకు ఇంకో డబ్బు దిగదుడిచాడు. ఆ రెండు డబ్బులతో చెయ్యవలసిన పని చెప్పాడు.

* * *

దానికి బిక్కపైకేడివే?" అంది మాసుబ్బమ్మవదిన— వాళ్ళ పిల్లను ఎత్తికొన్న 'చిన్నమ్మ' తోటి.

"సూరిగాడు... ఏడుస్తోంటే పెట్టాడు" అంది.

"వాడికి డబ్బెక్కడివో!" అంది సంశయంగా.

"ఏమో!" అంది చిన్నమ్మ ఏమీ ఎరగనట్టు.

"వాడేడీ?"

"దొడ్లో గూటీబిళ్ళ ఆడుతున్నారనుకో" జవాబిచ్చింది

(42-వ పేజీ చూడండి)

# చిన్నన్నయ్య సైకాలజీ

"ఒరేయి చంద్రం మన సూర్యం స్కూల్ ఫైనల్ ప్యాసయినాడురా", అని మా పెద్దన్నయ్య చిన్నన్నయ్యతో అన్నాడు.

"అలాగా" అంటూ చిన్నన్నయ్య తన ముఖంలో ఏ విధమైన మార్పూ చూపలేదు.

మా పెద్దన్నయ్య ఆశ్చర్యపోయేడు. "వాడ్ని పట్టణానికి పంపించాలి, కాలేజీ చదువుకి" అన్నాడు మా పెద్దన్నయ్య. ఏమన్నా వినిపించుకోనట్లు కమీజు వేసుకొని తన సొంత స్టోర్సుకు వెళ్ళిపోయేడు చిన్నన్నయ్య.

మా పెద్దన్నయ్య వ్యాపారం పడిపోయింది. చిన్నన్నయ్యది, ఏదో ఒక మాదిరిగా ఉంది. చిన్నన్నయ్యతో ఎక్కువ మాట్లాడడము సంభవించదు. వాడు ఎవ్వరితో సరిగ్గా మాట్లాడడు. మాట్లాడినా ముక్తసరిగా మాట్లాడి ఊరుకుంటాడు. ఒక్క విషయము మాత్రము చిన్నన్నయ్యలో గోచరిస్తుంది. జీవితములో తను అనుకొన్న గమ్యస్థానము చేరనట్లు బాధపడతాడు. చిన్నన్నయ్యని 'పెండ్లి చేసుకుంటావా' అంటే మాట్లాడడు. చిరుబురుమంటాడు. ఇతనితో మాట్లాడడము మా యింటిలో అందరికీ భయమే. ఎవరివల్ల ఏ చిన్న తప్పు జరిగినా, సహించడు. ఎవరివల్ల తప్పు ఉన్నా, కుండ బ్రద్దలు కొట్టినట్టు మాట్లాడతాడు. ఒక్కొక్క సైములో వేదాంతిలాగా మాట్లాడతాడు. మా చిన్నన్నయ్యని మా యింట్లో ఎవరూ అర్థం చేసుకోలేడు. 'చంద్రం కోపగొట్టివాడు' అని ఒక ముద్ర మా చిన్నన్నయ్య మీద పడింది. కాని వాడు ఇలాంటి స్వల్ప విషయాలకు లొంగిపోయే మనిషి కాదు. ఇంటిలోగాని, పొరుగులోగాని ఎవరికీ జడవడు. అనవసరంగా

వై. కొండలరావు

తెలివితేటలు ప్రదర్శిస్తూ మాట్లాడే వారిని అసహ్యించుకుంటాడు. తన వ్యాపారంలో కూడా, యితర షావుకార్ల మాదిరిగా మెత్తగా గొంతులుకోసేవాడిలాగా మాట్లాడడు. వ్యాపారలబ్జులు ఉపయోగించడు.

వాడిని మా బావ యింకో విధముగా అపార్థం చేసుకుంటాడు. ఆ స్టోర్సులో బావకూడా భాగస్వామి. చిన్నన్నయ్య ప్రవర్తన గురించి మా బావ రోజూ అక్కతో చెప్పుతూవుంటాడు. ఆమె ఈ విషయం గురించి చాలా బాధపడుతుంది. భర్తమాట త్రోసిపుచ్చి చిన్నన్నయ్యని సమర్థిస్తే, తమ్ముడ్ని వెనకవేసుకొచ్చావంటారని భయం.

వ్యాపార విషయంలో రోజురోజుకీ బావకీ చిన్నన్నయ్యకీ మన స్పర్థలు ఎక్కువౌతున్నాయి. ఇది చూసి "ఏరా చంద్రం, నీవు వ్యాపారంమానివేసి ఎక్కడైనా గుమస్తాగిరికి కుదరకూడదురా" అంటారు అమ్మ, నాన్న. "విషయం తెలియకుండా మాట్లాడుతారు మీరు" అంటాడు చిన్నన్నయ్య. ఏదైనా పండుగవస్తే, కొత్త బట్టలు పసుపు అంటించి తొడుక్కోవాలిరా అంటే, వినడు. ఆ నాడు చాకలి తెచ్చిన, ఉతికిన బట్టలు వేసుకొంటాడు. ఒక్కొక్కప్పుడు వాడ్ని పిచ్చివాడనుకుంటారు. పండుగనాడు విస్తట్లో భోజనం చేయాలిరా అంటే, కంచంలో పెట్టమంటాడు. అన్నయ్య మనస్తత్వము అదో విధంగా కనపడ్తుంది.

నేను కాలేజీచదువుకి విశాఖపట్నము వెళ్ళిపోయేను. పట్నంలో ఇంటర్మీడియట్ రెండు సంవత్సరములూ చదవడానికి మా పెద్దన్నయ్య నాకు ఆర్థికసహాయం చేయడంలో చాలా చిక్కులుపడవలసివచ్చింది. పెద్దన్నయ్య వ్యాపారం బాగా చితికిపోయింది. వచ్చిన లాభమంతా నా చదువు ఖర్చులకు రెండు సంవత్సరముల లోనూ అయిపోయింది. రోజులు కష్టంతో గడుస్తున్నాయి. మా పబ్లిక్ పరీక్షలయిపోయినాయి. పెట్టే

(42-వ పేజీ చూడండి)

# అవమానం

మా క్లాసులో అందరికంటె, అన్నిటిలోను వెనకబడివున్నవాడిని నేనే. క్లాసులో అందరికంటె వెనుక కూర్చుండే వాడిని. ఒక్కరోజునైనా సుబ్బయ్య శాస్త్రిగారితో దెబ్బలుతిననిపాపానపోలేదు. ఏ రోజు నాయెక్కాలు, పాఠాలు ఒప్పగించేవాడిని కాదు.

ఒకరోజున లెఖ్ఖలమాష్టారు పది లెక్కలు హోంవర్కు యిచ్చారు. తెలుగు మాష్టారు నాలుగు పద్యాలు ఒప్పజెప్ప మన్నారు. మరునాడు బడికివెళ్లాను. లెక్కల మాష్టారు యిచ్చిన లెక్కలూ చేయలేదు. తెలుగు పద్యాలూ రాలేదు. లెక్కల మేష్టారు వచ్చారు. లెక్కలు నేను చేయలేదండీ అని ఖచ్చితంగా చెప్పి వేశాను. బెత్తంతో ఒక అరడజను వడ్డించి యివాల్టివి, నిన్నటివి, రేపు చూపించు అని మళ్లీ పది లెక్కలు హోంవర్కు యిచ్చారు.

రోజు రోజుకు తిట్లు, దెబ్బలు యెక్కువై పోతున్నవి. చేయవలసిన లెక్కలుకూడా యెక్కువై పోతున్నవి. బడికి వెళ్లకపోతే నాన్నగారు కొడుతున్నారు. బడిలోకెళ్లితే మేష్టారు కొడుతున్నారు. ఒకరోజున మేష్టారు "రేపు లెక్కలు చేసుకొనివస్తేనే బడిలోకి రా. లేకపోతే రావద్దు" అని గట్టిగా చెప్పివేశారు. నాగుండె ఝల్లుమన్నది. నాకేమీ వుపాయము తోచలేదు. నా స్నేహితుడు సోముదగ్గరికి వెళ్లి యేదైనా వుపాయము చెప్పమన్నాను.

సోము యిటువంటి వుపాయాలు చెప్పటంలోను, కొంటె పనులు చేయుటంలోను చాల నేర్పరి. కనుక వెంటనే "దీనికేముందిరా! కాలులో గాజుపెంకు దిగిందని యెవ్వరికీ తెలియకుండ కాలుకు కట్టుగట్టి మంచంమీద మూలుగుతూ పడుకునేదానికి" అన్నాడు యేమీ ఆలోచించకుండా.

బి. వేంకటరత్నం చౌదరి

మంచి వుపాయం చెప్పాడని సంతోషిస్తూ నేను యింటికి జేరాను. ఆ సాయంత్రమే కాలుకు కట్టుకట్టి పడుకొని మూలగడము ప్రారంభించాను. మా నాన్నగారు వచ్చి యేమిటిరా అని అడిగితే "కాలులో గాజుపెంకు గుచ్చుకుం" దన్నాను. 'ఏదీ చూద్దా'మంటూ కట్టు విప్పబోయారు. 'బాబోయ్! నొప్పి'అంటూ కట్టు విప్పకుండా కాలు లాగేసుకున్నాను. భోజనానికి వెళ్లవలసివస్తే కట్టువున్న కాలు కుంటుకుంటూ వెళ్లేవాడిని. ఇట్లా రెండు రోజులు బడిలోకి వెళ్లకుండా, కట్టు విప్పకుండా జరిపేశాను.

మూడవరోజున కూడా మూలుగుతూ పడుకున్నాను. దురదృష్ట వశాత్తు నిద్ర పట్టేసింది. గాజుపెంకు యెంతలోతు దిగిందో చూద్దామని మా నాన్నగారు మెల్లిగా కట్టు విప్పారు. చూస్తే గాయమూ లేదు, ఏమీ లేదు. వెంటనే యెడమ కాలుకుకట్టిన కట్టువిప్పి కుడి కాలుకు కట్టి యేమీ యెఱుగనట్లు వూరుకున్నారు.

నేను కొంతసేపటికి లేచాను. కాని కాలికట్టు మారినసంగతి గమనించలేదు. మా అమ్మ భోజనానికి పిలిచింది. నేను యెప్పటివలెనే కట్టువున్న కాలు కుంటుతూ భోజనానికి వెళుతున్నాను. మా నాన్నగారు నవ్వుతూ "ఏరా అబ్బాయి! నిన్న యెడమకాలుకు కట్టుగట్టి యెడమ కాలు కుంటావు. ఇవాళకట్టు కుడి కాలికిమార్చి, కుడికాలు కుంటుతున్నావేరా?" అన్నారు.

జరిగినది గ్రహించాను. నా నోట మాటరాలేదు. 'బడిమానటానికి వేశావా యెత్తు'అని గట్టిగా మందలించి, అప్పటినుంచీ కట్టుదిట్టముగా ప్రైవేటు చెప్పించారు. నాటి అవమానముతో నాబుద్ధి మారింది. నాటినుంచీ శ్రద్ధగా చదివి, ఒక్క క్లాసైనా తప్పకుండా యిప్పుడు థర్డ్ ఫారం చదువుతున్నాను.

★

## ★ దాగుడు మూతలు ★

(39-వ పేజీ తరువాయి)

చిన్నమ్మ. "కేకేట్టు" అన్నది సుబ్బమ్మ వదిన.

నేను ఆడుకుంటున్నప్పటికీ ఈ మాటలు, నా చెవిలో పడుతున్నాయ్. చిన్నమ్మవచ్చి నన్ను సుబ్బమ్మవదిన కేకేస్తోందని చెప్పి లాక్కెళ్ళింది. భయపడవద్దన్నాడు విశ్వం. అయినా, నాగుండెలు "టువ్వ టువ్వ" మంటున్నాయ్.

"ఏరా! నీకు డబ్బు లెక్కడివి? దానికి బిస్కట్లు కొనిపెట్టావ్" ప్రశ్నించింది సుబ్బమ్మవదిన.

మాట్లాడ్డానికి భయంవేసింది. గట్టిగా నిలవేసి అడుగుతోంది. సమాధానం చెప్పలేక పోతున్నాను. "వాళ్ళమ్మ ఇచ్చిందేమో!" చిన్నమ్మ సమర్థించింది.

"కా—దు!" అన్నాను.

"మరెక్కడివి?" సుబ్బమ్మ వదిన నిక్కదీసింది. వెనకాలనించి మా అమ్మ ఈ గొడవచూసి... నేనేదో తప్పు చేశానని "వెధవా!.. మాటకి సమాధానం చెప్పవేం?" అని ఛెళ్ళున నా వీపుమీద చరిచింది.

ఆరున్నొక్క శ్రుతిలో రాగము పల్లవింప, భయం బుప్పతిల "సుబ్బమ్మ వదినా నిన్నపొద్దున్న.. ఇచ్చిన డబ్బా ... బూ ..." అన్నాను.

"అదా ... దిగదుడుపు డబ్బు..." అని నాలుక కరచుకుంటూ అంది చిన్నమ్మ.

సుబ్బమ్మవదిన తెరచిననోరు తెరచినట్లుగానే ఉండిపోయింది. ముఖంలో కత్తివాటుకు నెత్తురు చుక్కలేదు. సుబ్బమ్మ వదిన కేసి చురుక్కున చూసి, మా అమ్మ "ఎదటివాడికి బంధం వెయ్యబోతే మన కాళ్ళకే చుట్టుకుంటుంది" అంటూ రుసరుసా వెళ్ళిపోయింది.

పెళ్ళిఅయిన కొన్నాళ్ళకు మా అమ్మ చెప్పింది "సుబ్బమ్మవదిన గారిపిల్ల పోయిందిరా" అని.

నాకు చాలా విచారం వేసింది. "అమ్మా!... ఆడబ్బు చంపిందేమిటే?" అన్నాను.

"తప్పు! అల్లాంటి డబ్బులు నూతిలో పారెయ్యాలి..." అంది.

"విశ్వం... వాళ్ళ సాయిబు నడిగాడే! నాకు ఒకడబ్బు దిగతుడిచి వదినఇచ్చిన మరోడబ్బుతో

## ★ చిన్నన్నయ్య సైకాలజీ ★

(40-వ పేజీ తరువాయి)

బెడ్డింగ్ సర్దుకొని మా గ్రామము రామాపురము వచ్చేసేను. మా నాన్న, అమ్మా ఎంతో ఆనందించారు.

మధ్యాహ్నం అన్నయ్య కొట్టు దగ్గర్నుంచి భోజనమునకు వచ్చేడు. "ఏరా, సూర్యం ఎప్పుడొచ్చావు" అన్నాడు.

"వచ్చి ఒకగంట అయింది, అన్నయ్యా" అని జవాబిచ్చేను.

"చిక్కిపోయేడురా" అంది మా అమ్మ.

రెండు నెలలు గడిచాయి. ఒక రోజున పరీక్షాఫలితాలు ప్రకటించేరు. కాలేజిలో మా గ్రూప్‌లో, నా ఒక్కడికే క్లాసువచ్చింది. ఈ సంగతి తెలవగానే, చిన్నన్నయ్య వెంగున వచ్చి "సూర్యం, నీది ఫస్టు క్లాసురా" అని ఎక్కడలేని ఆనందంతో నన్ను కౌగలించుకొన్నాడు.

"ఒరేయి సూర్యం, నీకు స్కూల్ ఫైనల్లో మార్కులు సామాన్యంగా వచ్చాయని, అప్పుడు అలా అనుకున్నాను. ఇంటర్మీడియట్ లో అన్నీ యింగ్లీషులో వుంటే ఏమి ప్యాసవుతావు అనుకున్నాను. నీవు కష్టపడి క్లాస్‌లో పాసయినావు. నేను కష్టపడకుండా, రెండవఫారం రెండుసార్లు దండయాత్ర చేసేను. అందుచేత నన్నుచదువుమానిపించి, బావతో వాటాదారుగా స్టోర్సులో వుంచేరు. అప్పటినుంచి నాకు యింటిలో అమ్మ, నాన్న మీద కోపంరా" అని మనస్సు విప్పి నాతో అంతా చెప్పాడు.

"ఒరేయ్, సూర్యం, నీవు బి. ఏ. ఆనర్సు పరీక్షకు వెళ్ళి, లెక్చరరు అవ్వాలిరా" అని నవ్వుతూ అన్నాడు.

ఇంటిలోకి వస్తున్న మా పెద్దన్నయ్య ఈసంభాషణ విని చాలా సంతోషించేడు. "ఇకనుంచి నీ మదరాసు చదువంతా నాబాధ్యత. నీకెంత డబ్బుకావలసినా స్టోర్సుకి ఉత్తరములు వ్రాస్తూండు" అని మా చిన్నన్నయ్య అన్నాడు.

పెద్దన్నయ్య, వదినె ఒకరి ముఖం ఒకరు చూసుకొని నవ్వుకున్నారు. మాఅమ్మ నాన్న నవ్వుకున్నారు. ఇంతలో మాచెల్లాయి, "అన్నయ్యా కాళ్ళు కడుక్కొని, భోజనాలకు లేవండి" అని పిలిచింది.

మేమంతా లేచాము. ★

కలిపి బిస్కట్లుకొని ఆపిల్లకు పెట్ట మన్నాడు" అన్నాను.

"ఆమాత్రానికి చచ్చిపోతుందిరా!... ఖర్మ" అంది మాఅమ్మ.

"నేను పోవాలని అనుకుంటే.. వాళ్ళపిల్ల చావక ఏంచేస్తుందేమిటీ" అన్నాను.

"తప్పురా... నాయనా" అంది మా అమ్మ నానోరు నొక్కుతూ. ★

## మైనపు తేలు

(37-వ పేజీ తరువాయి)

రకువచ్చి దొంగని పట్టేశానన్నట్లు నా చెవి లంకించుకుని, డ్రాయరు దగ్గరకు నడిపించి తీసుకెళ్లి, నాము ఖం క్లాసులో వాళ్లందరికీ చూపించాడు. అది మైనపుతేలని యెలా కనిపెట్టాడో తెలుసు కోవాలనుకున్నాను. నాకళ్లు ఆతేలువైపుకు తిరిగినయి - అరె! అసలు దానికి కాళ్లే లేవు. అప్పుడు గుర్తు కొచ్చిందినాకు, ఆ హడావుడిలో దానికి కాళ్లుపెట్టటం మర్చిపోయినట్లు.

"ఏరానాన్నా! నువ్వేనటరా, యీ తేలును సృష్టించింది? బ్రహ్మ దేవుడు డిగ్రీ పొందుదామనుకున్నావేమిటి?..... వెధవ, వెధవ చేష్టలు చేస్తున్నావా" అని నన్ను ఆదవడా, యీదవడా యిడ్లీలంత మందాన వాచేటట్లు వాయించి, అది చాలక బెత్తంతో వీపు రామకీర్తన పాడించి, నా మైనపుతేలు కాస్తానలిపి అవతల విసిరేశాడు... చివరికి నేనెంతో కష్టపడి సృష్టించిన మైనపుతేలు కాస్తాపోయింది. ఆరోజున మాకు శెలవు కూడ యివ్వలేదు; నా దవడలు యిడ్లీ లంత మందాన వాచిపోయినయ్. ఇన్నికష్టా లనుభవించినా, ఆయన గారు పొందుం మాత్రం మాన లేదు. ★

## ★ ముచ్చటగా ముగ్గురు ★

(35-వ పేజీ తరువాయి)

చివరి కే అడ్డకట్టకో కొట్టుకొని ముక్కలు ముక్కలై పోతే నాగతి ఏమౌతుంది?

ఇవన్నీ ఆలోచించేసరికి నాకు మా మిత్రుడి మీద ఒళ్లు మండుకొచ్చింది. పంటులో రెండోగడ లేనప్పుడు, వున్న ఒక్క గడనీ వాడా విధంగా పట్టుకు పుడాయించినందుకు నాకు వాడిమీద నిజంగా కోపం వచ్చింది. పంటు వదిలిపోదల్చుకొన్నవాడు, కనీసం ఆ గడని వదలిపెట్టి పోవచ్చునే?

నాపంటు ఒంటరిగా పావుమైలు దూరం కొట్టుకు పోయింది. అక్కడ చేపలవేటకు వుపయోగించే పంటు యింకోటి ఎదురైంది. దాంట్లో యిద్దరు మునలి బెస్తవాళ్లు వున్నారు. వాళ్లపడవ పోతున్న దారికి అడ్డంగా నదీప్రవాహంలో పడి నాపంటు కొట్టుకు రావటం చూసి, వాళ్లు నాపంటుని ఆపమని కేకలు పెట్టారు.

ఈ పంటుని ఆపటం నాకు శక్యంకాదని నేనూ కేకపెట్టాను.

ప్రయత్నమైనా చెయ్యవేమని వాళ్లు నన్ను కోపంగా అడిగారు. అప్పుడు చెప్పాను— నా అవస్థ అంతా. నామీద జాలిదలిచి వాళ్లు నాకో గడ అందించి నన్ను బతికించారు. తరువాత కనుక్కొందును కదా— మరో ఏభైగజాల దూరంలోనే పెద్ద అడ్డకట్ట వుందట. వాళ్లు అక్కడ నాకు ఎదురైనందుకు నేను ఎంత సంతోషించానో మాటల్లో చెప్పలేను.

(ఇంకా వుంది.)

ఉపాధ్యాయుడు: సోమూ! సూర్యుని జగద్బాంధవుడని ఎందుకంటారు?

సోము: మనకి సగం కిరసనాయిల్ మిగుల్చుతాడండి సార్! అందుకని.

—పి. రామచంద్రరావు, జి. సాంబశివరావు, విజయవాడ.

"ముద్దాయిలా నిన్నేమని తిట్టారు?" అన్నారు పంతులుగారి ప్లీడరు, "పెద్దమనుష్యులు వినరాని"వని పంతులుగారంటే, "పోన్సి, జడ్జీ చెవులో వూదెయ్!" అన్నారు!

ప్రభాకరం, భాస్కరం.



ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి "పెంపుడు కొడుకు"లో కుమారి.



# తెలుగు సినిమా పరిశ్రమ—ఎన్నార్



అక్టోబరు ఒకటో తేదీన ఆంధ్రరాష్ట్రం ఏర్పడుతోంది నలభై ఏళ్ల క్రిందట ప్రారంభమైన ఆంధ్రోద్యమం కొన్నాళ్లు మాటుమణిగీ, కొన్నాళ్లు విజృంభించీ ఇన్నాళ్ళకు ఫలించబోతోంది ప్రత్యేక రాష్ట్రం లేని కారణంగా, ఆంధ్రులకు, ఆంధ్రభాషకు, సంస్కృతికి తక్కిన భాషల వారికి జరిగిన మన్నన మర్యాదలు ఒరుగకుండా పోయినవి ఆంధ్ర రాష్ట్రావతరణంతో ఆంధ్రులకు భారతీయ సాంస్కృతిక రంగంలో గౌరవస్థానం లభిస్తుందని ఆశించవచ్చును కొన్నేళ్ల క్రితంవరకూ మద్రాసు రాష్ట్రం అంటే తమిళప్రాంతమే అని ఇతర దేశాలవారికీ, మన దేశంలోని ఉత్తరప్రాంతం వారికీ ఒకభావం ఉండేది కొంతకాలంనుండీ ఈ భావం తొలగి, మద్రాసు రాష్ట్రంలో ఆంధ్రులనే వారు కూడా ఉన్నారనీ, వారికీ ఒక ప్రత్యేక సంస్కృతి వగైరాలు ఉన్నాయనీ విదితం కాజొచ్చింది ఆంధ్రుల రాష్ట్రోద్యమం దీనికి ముఖ్యకారణం

మిగతా వారు ఆంధ్రులను గుర్తించేటట్లు, తతిమా సాంస్కృతిక శాఖలకంటె సినిమారంగమే ఎక్కువ పనిచేసిందని చెప్పవచ్చు ఈనాడు ఆంధ్రులకు గర్వించదగిన పెద్ద సినిమా పరిశ్రమ ఉన్నది భారతీయ సినిమా పరిశ్రమకుగల మూడు ముఖ్య కేంద్రాలలో మద్రాసు నగరం ఒకటి ఈ నగరంలో సినిమా పరిశ్రమ అభివృద్ధి చెందడానికి ఆంధ్రులూ, తమిళులూ సమానంగా కృషి చేశారు ఈరోజున తమిళ సినిమా పరిశ్రమతో సమానమైన పరిశ్రమ ఆంధ్రులకు ఉన్నది మద్రాసు నగరంలోని సినిమా పెట్టుబడిలో సగానికి సగమైనా ఆంధ్రులకు చెందినదని అంచనా వేయవచ్చు ఇదే విధంగా నటీనటుల్లో, డైరెక్టర్లలో, ఇతర టెక్నీషియన్లలో కనీసం సగంమందైనా తెలుగువారున్నారు మద్రాసు సినిమా పరిశ్రమ ఈనాటి స్థాయికి రావడానికి ఆంధ్రుల కృషి కూడా ముఖ్యకారణమని నిస్సందేహంగా చెప్పవచ్చు

ఆంధ్రరాష్ట్రం ఏర్పడటంతో, దుర

మద్రాస్ ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి "రోహిణి"లో జి. వరలక్ష్మి, సహస్రనామం.



పారమౌంట్ వారి "బ్లెజింగ్ ఫారెస్ట్"లో సుసాన్ మూం

# ★ తెలుగు సినిమా పరిశ్రమ ★

దృష్టవశాత్తు మద్రాసునగరంపై ఆంధ్రులు హక్కు వదులుకోవలసిన వారయ్యారు. తమిళ సినిమాపరిశ్రమ ఎక్కువగా మద్రాసులోనే కేంద్రీకృతమై వున్నా ఇతర తమిళ నగరాల్లో కూడా కొన్ని స్టూడియోలున్నాయి. ఆంధ్రులకు మాత్రం ఉన్నదంతా మద్రాసులోనే వున్నది. ఇదివరలో, రాజమండ్రి, విశాఖపట్టణాలలో స్టూడియోలు సాగించడానికి చేసిన ప్రయత్నాలు విఫలమైనవి. ఆ తరవాత ఆంధ్ర జిల్లాలలో స్టూడియోలు కట్టడాని కెవరూ సాహసించనేలేదు. ఈ కారణంవల్ల కొత్తగా ఏర్పడే ఆంధ్ర రాష్ట్రంలో ఒక్క స్టూడియో అయినా ఉండనిస్థితి ఏర్పడుతున్నది.

అందుకే ఆంధ్రరాష్ట్రం ఏర్పడగానే తెలుగు సినిమాలవారుకూడా మూటా ముల్లె సర్దుకొని స్వరాష్ట్రానికి వెళ్ళిపోతారా, అని చలన చిత్రాభిమానులు చాల రోజుల నుండి చర్చలు చేస్తున్నారు.

మద్రాసులో పూర్తిగా తెలుగువారివి 5 స్టూడియోలున్నాయి. నగరంలో బోలెడు తెలుగు సినిమా కంపెనీలున్నాయి. తెలుగు నటీనటులు, ప్రముఖతారలు, నిర్మాతలు, డైరెక్టర్లు, టెక్నీషియన్లు, రచయితలు అనేకులు ఇక్కడ ఇళ్ళువాకిళ్ళు ఏర్పరచుకొని చాలకాలంనుండి స్థిర నివాసులై వున్నారు. చిత్ర నిర్మాణాన్ని ఆశ్రయించుకొని ఫిలిం పరికరాలు దిగుమతి చేసే కంపెనీలన్నీ ఇక్కడే వున్నాయి. డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీలు, థియేటర్లు తప్పిస్తే ఆంధ్రదేశంలో సినిమా పరిశ్రమకు సంబంధించిన అలికిడే లేదు. ఈ పరిస్థితి గడిచిన ఇరవయ్యేళ్ళుగా ఏర్పడిందేగాని నిన్న మొన్న ఏర్పడిందికాదు. కనుక ఎటు చూసినా, తెలుగు సినిమా పరిశ్రమ మద్రాసు నుంచి కదిలే అవకాశం గోచరించదు. కదలడానికి ఒక పెద్ద ప్రతిబంధకం ఆంధ్ర రాష్ట్రానికి శాశ్వత రాజధాని నిర్ణయం కాకపోవడం. అదీగాక వివిధ సౌకర్యాల విషయంలో మద్రాసుతో సమానమైన పట్టణం ఆంధ్రలో ఇప్పటిదాకా అభివృద్ధి కాకపోవడం మరొక ప్రతిబంధకం. అందుచేత మద్రాసునుంచి కదలాలంటే ఎక్కడికి కదలడమనే ప్రశ్న వస్తుంది. హైదరాబాదుతో సహా, ఆంధ్రులంతా కలలు కంటున్న విశాలాంధ్ర ఏర్పడేదాకా బహుశా తెలుగు సినిమా పరిశ్రమ మద్రాసులోనే వుంటుందని భావించవచ్చు.

ఇలా కాకూడదంటే మరొకటి జరగాలి: గుంటూరు, విజయవాడ, రాజమండ్రి, విశాఖపట్నంవంటి పెద్ద పట్టణాల సమీపంలో నిర్వహణ దక్షతగల ఏ ధనవంతుడైనా స్టూడియో లేవదీయాలి. నిర్వహించగలగాలి గాని 'ఆంధ్ర ప్రాంతంలో స్టూడియోలు నడవవు,' అనే వాదానికి ఆస్కారం లేదు. ఎందుకంటే సినిమా పరిశ్రమ ఇంకా ఎంతైనా అభివృద్ధి చెందడానికి వీలైన పరిశ్రమ. ఇప్పటికీ కొత్త నిర్మాతలనేకులు సినిమారంగంలోకి ప్రవేస్తున్నారే కాని మానలేదు. అందుచేత ఆంధ్రప్రాంతంలో మద్రాసుకు పోటీగా సినిమా పరిశ్రమ కాలక్రమేణా విస్తరించడానికి వీలున్నది. అయితే కొత్తగా స్టూడియోలు కట్టదలిచేవారు దేశానికి సాధ్యమైనంత కేంద్రంగా ఉండే ప్రదేశం నిర్ణయించడం మంచిది. ముఖ్యంగా, ముందు ముందు స్టూడియోలు కట్టదలిచే వారుకూడా అక్కడికే ఆకర్షించబడే ప్రదేశం, రవాణా సౌకర్యాలు విరివిగా ఉన్న ప్రదేశం నిర్ణయించుకోవాలి.

తెలుగుతారలు, డైరెక్టర్లు తదితరులు మద్రాసులో ఉండగా, ఆంధ్రప్రాంతంలో చిత్రనిర్మాణం సాధ్యమా అనే శంక అనవసరం. ఆంధ్రలో స్థిరమైన పునాదులపై చిత్రనిర్మాణమే ప్రారంభమైననాడు మద్రాసులోని తెలుగుతారలు మొదలైన వారు తప్పక సహకరిస్తారని విశ్వసించవచ్చును. పైగా ఇప్పటివారే శాశ్వతమనీ, వారు లేకపోతే పరిశ్రమే లేదనీ అనుకోవడ

## ★ తెలుగు సినిమా పరిశ్రమ ★

మొందుకు? కొత్తవారు ఎప్పటి కప్పుడు వస్తూనే వున్నారు. వీరందరూ ఆంధ్ర ప్రాంతంనుంచి వచ్చినవారే కదా? అందుచేత ఆంధ్రలో చిత్రనిర్మాణానికి ఎంతైనా భవిష్యత్తు ఉన్నది.

అయితే మొదట్లో, ఆంధ్రలో తయారయ్యే చిత్రాలు, మద్రాసుస్టూడియోలలో తయారై వచ్చే తెలుగు చిత్రాలతో పోటీ చెయ్యగలవై వుండాలి. మద్రాసులోని సినిమా కంపెనీలకు తెలుగు, తమిళ మార్కెట్టుల సౌకర్యం ఉంటుంది. అందుచేత మద్రాసులో తయారయ్యే చిత్రాలు ఎంతైనా డబ్బు వెచ్చించి పెద్దపెద్ద తారలను, టెక్నీషియనులను తెచ్చుకోగలవు. కాని ఆంధ్రలో తయారయే చిత్రాలకు కనీసం ప్రారంభదశలో ఈ సౌకర్యం ఉండదు. వాటికి తెలుగు మార్కెట్ మాత్రమే వుంటుంది. అందుచేత తెలుగు మార్కెట్ భరించగల నిర్మాణవ్యయంతోనే చిత్రాలు తయారుకావాలి. మద్రాసు చిత్రాలతో పోటీ చెయ్యాలంటే "ఆంధ్ర చిత్రాలు" తక్కువ ఖర్చుతో, ఎక్కువ పనివాడితనం చూపగలిగినవై ఉండాలి.

మరి కొన్నేళ్ళదాకా మనకు వచ్చే తెలుగు చిత్రాలు మద్రాసునుంచే రావటం నిశ్చయమైనప్పుడు తెలుగు నిర్మాతలు ఎదుర్కోవలసిన సమస్యలు కొన్ని వున్నాయి. చిత్రనిర్మాణ వ్యయం అత్యధికంగా పెరిగింది. ఆర్టిస్టులు, తదితరులు తమ రేట్లు పెంచినందువల్ల, ప్లాను ప్రకారం పని చెయ్యాలనే శ్రద్ధాభావం నిర్మాతల కెవరికీ లేకపోవడంవల్ల, దుబారా ఖర్చువల్ల నిర్మాణ వ్యయం పెరుగుతూ వచ్చింది. ఇంత నిర్మాణ వ్యయం తెలుగు మార్కెట్ భరించలేదు కనుక, తమ చిత్రాలకు తమిళ తర్జుమాలు కూడా తయారుచేసి నిర్మాతలు కొంతకాలం లాభసాటి వ్యాపారం చేశారు. కాని ఇటీవల ఈ పద్ధతి అట్టే లాభసాటి కానట్లు తేలిపోయింది. తెలుగువారు తీసిన తమిళ చిత్రాలు తమిళులు తీసిన తెలుగు చిత్రాలు ఒకటీ అరా తప్పిస్తే, ఏవీ విజయం పొందలేదు. ఒక భాషవారు మరొక భాషలో నిర్మించడం ఎప్పుడూ సాహసమే. తగినంత శ్రద్ధ తీసుకుని చేస్తే ఈ పద్ధతిలో లోపమేమీ లేదు. కాని మద్రాసు రంగంలో ఈ శ్రద్ధ మృగ్యమని వేరే చెప్ప నక్కరలేదు. నటుల ఉచ్చారణ, కట్టు, బొట్టు, సంస్కృతి ఇవన్నీ విజాతీయంగా ఉండి, డబ్బింగ్ కూడా నికృష్టంగా ఉంటే ఆ చిత్రం ఎలా సొమ్ము చేసుకుంటుంది? ఈ విషయం నిర్మాతలిప్పుడిప్పుడే గుర్తిస్తున్నారు. కొత్తగా నిర్మాణం ప్రారంభించబడిన, ఇంకా ప్రారంభం కానున్న, చిత్రాల్లో చాలవరకూ ఏకభాషా చిత్రాలే కాని ద్విభాషా చిత్రాలు లేవు. ఇది ఒక విధంగా మంచికే వచ్చిందనాలి. అపభ్రంశాలతో భాషను కలుషితం చేయడం కొంతవరకైనా తగ్గుతుంది. ముఖ్యంగా తెలుగు మార్కెట్ నొక్కదాన్నే దృష్టిలో వుంచుకుని చిత్రం తీయాలి గనుక నిర్మాతలు వ్యయంకూడా తగ్గించుకుంటారని ఆశించవచ్చును. ★

## "పాంపోష్" ప్రివ్యూ

శ్రీ అంబాలాల్ జె. పటేల్ నిర్మించిన "పాంపోష్" అనే గేవాకలర్ చిత్రం మొన్న 19 వ తేదీన వాహినీ స్టూడియోలో పత్రికా ప్రతినిధులకు, సినిమా ప్రముఖులకు ప్రత్యేకంగా చూపించబడింది. ఈ చిత్రానికి కొన్ని ప్రత్యేకతలున్నాయి. పత్రికా ప్రతినిధులతో ఇష్టాగోష్ఠి జరుపుతూ పటేల్ గారు కొన్ని వివరాలు తెలిపారు. గేవాకలర్‌లో కథా చిత్రం నిర్మించడం, తక్కువ ఖర్చుతో, తారలు లేకుండా, స్టూడియోలో షూటింగ్ జరప

(51 వ పేజీ చూడుడు)



"పాంపోష్" ప్రివ్యూ చూస్తున్న పెద్దలు: మొదటివరుసలో కె. ఎస్. ప్రకాశరావు, నాగిరెడ్డి, నిర్మాత ఎ. జె. పటేల్, బి. ఎన్. రెడ్డి, ఎ. వి. మెయ్యప్పచెట్టియార్ కూర్చున్నారు.

# ప్రశ్నలు... సమాధానాలు

పి. వెంకటసుబ్బరావు—ప్రొద్దుటూరు.

ఇంటిగొడవలతో మనస్సు చికాకుతో యుండి కొంతసేపు మనస్సును తేలికపరచుటకుగాను సినిమాకు వెళ్ళగా అక్కడ గూడా దుర్భర దారిద్ర్యము చూపించే దృశ్యాలు చూచినయెడల భరింపగలమా?

—ఏ సినిమానైనా చూచి ఆనందించగలగడం, ఆనందించలేకపోవడం చిత్రణ విధానంమీద ఆధారపడి వుంటుంది. మన మనస్సు ఏ పరిస్థితిలో వున్నా దాన్ని తనకనుగుణంగా త్రిప్పుకోగలిగినదే ఉత్తమ చిత్రం.

*   *   *

జి. వి. రమణమూర్తి—ముస్తాబాద.

టెన్సింగ్ ఎవరెస్టు శిఖరం ఎక్కాడు కదా! అతనికి నోబెల్ బహుమతి ఇచ్చారా?

—పర్వతశిఖరాలెక్కినవారికి నోబెల్ బహుమతి యివ్వరు. విజ్ఞానశాస్త్రంలోను, సారస్వతంలోను కృషి చేసినవారికి, ప్రపంచ శాంతికి పాటుబడినవారికి ఇస్తారు.

*   *   *

యన్. లక్ష్మీనర్సయ్య—గద్వాల.

అమెరికాలో సినిమాలకు టెలివిజను వలన చాలా నష్టము చేకూరినదని ఒక వ్యాసము చదివాను. అది యేలా జరుగుతుంది?

—టెలివిజన్ సెట్టులు అమెరికన్ జీవన ప్రమాణం ప్రకారం బాగా చౌకగా లభ్యమవుతున్నందున, అందరూ వాటిమీద కేగబడ్డారు. అమెరికాలో ఇప్పుడు సుమారు రెండుకోట్ల టెలివిజన్ సెట్లున్నాయట. ఎవరింట్లో వారు కూర్చుని టెలివిజన్ 'స్విచ్ ఆన్' చేసుకుని టెలివైజ్ చేయబడే ప్రదర్శనాలు చూడవచ్చు. వీటిలో నాటకాలు, కామిక్ ప్రదర్శనాలు, ఆటల పోటీ కార్యక్రమాలు ఇంకా అనేకం ఉంటాయి. పైగా ప్రసిద్ధ సినిమాతారలు కూడా ఆ ప్రదర్శనల్లో పాల్గొంటారు. కనుక ప్రజలు సినిమాహాలుకు వెళ్లే శ్రమ తప్పుతుంది. టెలివిజన్ కంపెనీల పోటీకి తట్టుకోలేక అయిదువేల థియేటర్లు మూయబడ్డాయట.

*   *   *

యేనకూరు ఆదిశేషారెడ్డి—నెల్లూరు.

ఒక పండితుడు, కవిత్వము తెలుగుభాషలో యున్నంతగా మరివే భాషలో లేదని వాదించినాడు. ఇదియెంతవరకు నిజమండి?

—మాతృభాషా భక్తికొద్దీ ఆయన అట్లా అనివుంటారు. తెలుగులో గొప్ప కవిత్వం ఉన్నమాట నిజమే గాని, సంస్కృతం, ఇంగ్లీషు, గ్రీకు మొదలైన భాషల్లో కూడా గొప్ప కవిత్వం ఉన్నది.

*   *   *

కొండా మారుతి రామిరెడ్డి—చీరాల.

అప్పటి వేదాంతానికీ, యిప్పటి విజ్ఞానానికీ యేమాత్రం పొత్తు కుదరడంలేదు. ఆ రెండింటిలో పైచెయ్యి దేని దంటారు?

—మానవుని మేధాశక్తి ప్రాచీనకాలంలోనే గొప్ప పరిణతి పొందిన దనడానికి భారతీయ వేదాంత శాస్త్రం నిదర్శనం. అయితే ఆ వేదాంతం అప్పటి సమాజ పరిస్థితుల్లోంచి ఉద్భవించింది. సమాజ పరిస్థితులు మారే స్వభావంకలవి కనుక వేదాంతం కూడా తదనుగుణంగా మారాలి. అలా మారకపోతే ఏ వేదాంతమైనా తన శక్తినీ, సత్యాన్ని కోల్పోతోంది. ఇప్పటి విజ్ఞాన శాస్త్రాలు ఇప్పటి సమాజ పరిస్థితుల్లోంచి వచ్చాయి కనుక, వేదాంతం కూడా ఆ విజ్ఞానశాస్త్రాలను సమన్వయం చేసుకుంటూ మార్పు చెందాలి.

*   *   *

కె. బి. దొర—కాకినాడ.

ఒకవైపు రామాయణ కథకు మరొకవైపు భారత కథకు అన్వయించే ద్వంద్వార్థాల గ్రంథం వుందని విన్నాను. నిజమా? అయిన దాని రచయితయెవరు? అదిప్పుడు లభించునా?

—ఆ గ్రంథం పేరు 'రాఘవ పాండవీయము'; కవి పింగళి సూరన. గ్రంథాలయాల్లో దొరుకుతుంది.

*   *   *

జాలూరు ఆదిశేషు—మైలవరం.

'నాగార్జున కొండ' ప్రాముఖ్య మేమి?

—గుంటూరు జిల్లా, పల్నాడు తాలూకాలో నాగార్జునకొండ వున్నది. అక్కడ బౌద్ధశిల్ప శిథిలాలున్నాయి. పూర్వం అక్కడ నాగార్జును డనే ప్రసిద్ధ బౌద్ధ వేదాంతి నివసించేవాడు. ఆరోజుల్లో అది బౌద్ధ సన్యాసులకు, విద్వాంసులకు గొప్ప కేంద్రం. నాగార్జునుడు ఆంధ్రుడు. ★



"పాంపోష్" ప్రివ్యూ సందర్భంలో జరిగినవిందు: కె. ఎస్. ప్రకాశరావు, జి. వరలక్ష్మి.



పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి












సభలో ఇతరులు ఎవరూ లేరని- తోచిన మీదట దీర్ఘముఖుండూ- హిరణ్యగర్భునికిట్లు చెప్పెను:


























విజయావారి "చంద్రహారం"లో బాలచందనరాజు వేషంలో దుప్వూరి అన్నపూర్ణ, గురువు మాలిగా ఎస్. వి. రంగారావు.

## ★ "పాంపోష్" ప్రివ్యూ ★

(48-వ పేజీ తరువాయి)

కుండా, కొత్తరకం కథతో ఉత్తమచిత్రం నిర్మించడం ఆశయాలుగా తాను ప్రొడక్షన్ లోకి దిగానని ఆయన చెప్పారు.

ఈ చిత్రం పొడుగు ఎనిమిదివేల అడుగుల చిల్లర. దాదాపు లక్షరూపాయల్లో నిర్మాణం ముగిసింది. ఈ చిత్రాన్ని ప్రపంచభాష లన్నిటిలోనూ డబ్ చేసి అన్ని దేశాల్లోను విడుదలచేయ సంకల్పించామని పటేల్ గారన్నారు. యూరపియన్ దేశాల్లోను, ఆసియా దేశాల్లోను, భారతదేశంలోని హిందీ, బెంగాలీ, మహారాష్ట్రం, తమిళం, తెలుగు, మొదలైన ప్రాంతాల్లోను ఆయా భాషల్లో క్రమక్రమంగా విడుదల చేయబడుతుందట. జర్మన్ భాషలో అప్పుడే విడుదలయిందటకూడా. వాహినీలో చూపించిన చిత్రం ఇంగ్లీషులో వున్నది.

"పాంపోష్" దర్శకుడు డాక్యుమెంటరీలలో అనుభవజ్ఞుడైన ఇజ్రామీర్. కథ కూడా ఆయనే వ్రాశాడు. ఫొటోగ్రఫీ కార్లస్ మార్కొనీ. తారలు గాని, వృత్తిరీత్యా నటీనటులైనవారు గాని ఎవరూ ఇందులో లేరు.

ఈ చిత్రంలో అన్నిటికంటె ఎక్కువగా ఆకర్షించేది కథ. ప్రధాన పాత్రయైన మొగ్లీగా అదే పేరుగల ఒక కాశ్మీరీ మూగబాలిక నటించింది. కథాస్థలం కాశ్మీర్‌లోని దాల్ సరస్సు. ఆ సరస్సు, పరిసర పర్వతాలు, అరణ్యాలు, సరస్సు మీద నౌకాగృహాల్లో నివసించే జనులు, వారి వేషభాషలు, పాటలు, నృత్యాలు, ఆచారాలు ఇవన్నీ ఈ చిత్రానికి మనోహరమైన వాతావరణం చేకూర్చాయి. కాశ్మీర్ జీవితాన్ని చూపిస్తూ తీసిన డాక్యుమెంటరీలలో ఈ చిత్రమే ఉత్తమమని చెప్పవచ్చును. కథ కూడా కాశ్మీర్ ప్రకృతి సౌందర్యాన్ని బాగా ఉపయోగించుకోడానికి వీలైన 'ఫెయిరీ టేల్' వంటి ఇతివృత్తంతో కూడినది. మొగ్లీ అనే మూగపిల్ల వుంటుంది. ఆమెతో ఎవరూ ఆటపాటలకు రానందువల్ల ఆమె ఒంటరిగా సరస్సు మీద పడవ నడుపుకుంటూ, తిరుగుతూ నీళ్లలోని చేపలతో, కప్పలతో స్నేహం చేసి గడుపుతూంటుంది. ఆ సరస్సుమీదనే తిరిగే ముసలివాడొకడు మాత్రమే ఆమె మూగ హృదయాన్ని అర్థం చేసుకోగలుగుతాడు. మిగతా ప్రపంచం ఆమెను అర్థం చేసుకోలేక, ఆమెవల్ల అనేక అనర్థాలు కలుగుతున్నాయని నిందిస్తూంటుంది. వృద్ధ స్నేహితుడు ఆమెకొకసారి ఒక కథ చెబుతాడు: సరస్సులో ఒక ఏకాంత స్థలంలో, నీళ్ళ అడుగున కప్పలరాజ్యం ఉందనీ, అక్కడ అశాంతి, అన్యాయం లేవనీ చెబుతాడు. ఆ మాట లామె నిజ

## "పాంపోష్" ప్రివ్యూ

మనుకుంటుంది. తన పెంపుడు తల్లి పెట్టే ఆరడి భరించలేక ఒకరోజున ఆమె పడవలో వెళ్లి, కప్పలరాజ్యం ఉన్నదని వృద్ధుడు చెప్పినచోట, నీటిలో మునిగి మరణిస్తుంది. ఆమెకోసం వృద్ధస్నేహితుడు, ఆమె నెప్పుడూ దయతో చూసే పెంపుడు తల్లి కూతురు మాత్రమే దుఃఖిస్తారు. దురదృష్ట జన్మమెత్తి, సమాజం చేత హీనంగా చూడబడి, మానవలోకంకంటె సరస్సు అడుగునవున్న స్వప్నరాజ్యమే మేలనుకుని మరణించిన ఆ మూగపిల్ల కథ ప్రేక్షకులను కదిలించివేస్తుంది.

ఈ కథలో వర్డ్స్ వర్త రచించిన 'లూసీగ్రే' ఖండకావ్యం ఛాయలూ, సిండరెలా కథ ఛాయలూ ఉన్నాయి. అయినా, స్వతంత్ర కల్పనగానే భాసిస్తుంది. మరికొంచెం టెంపో, ఆసక్తి కలిగించే ట్రీట్మెంటు ఉన్నట్టయితే ఈ చిత్రం ఇంకా బాగుండేది. కథావస్తువులు దొరకడం లేదని అతుకులబొంతల్లాంటి కథలు కల్పించి చిత్రాలు తీసేవారికి, ఈ చిత్రం ఒకదారి చూపిస్తుంది.

గేవా కలర్ విధానంలో కొన్ని సౌకర్యాలున్నాయని నిర్మాత పటేల్ గారు చెప్పారు. గేవా కలర్ కు మామూలు చిత్రాలకంటె ఎక్కువ ఖర్చుకాదు. ఒకవేళ గేవా కలర్ ఫిల్ము కొనడానికి తగినంత డబ్బు వెచ్చించలేకపోతే, ఈ కలర్ నెగటివ్ లోంచి మామూలు ప్రింట్లుకూడా తీయవచ్చుననీ, అలా తీసిన ప్రింటు మామూలు వాటికంటె బాగా వుంటాయని కూడా పటేల్ గారన్నారు.



శ్రీ రాజరాజేశ్వరీవారి 'లక్ష్మి'లో కన్నాంబ.

## 'అవ్వయ్యార్' చిత్రానికి ఆంధ్ర ప్రముఖుల అభినందనలు

ఈ నెల 18వ తేదీన జెమినీ స్టూడియోలో "అవ్వయ్యార్" చిత్రం ఆంధ్ర ప్రముఖులకు చూపించబడింది. వారిలో న్యాయమూర్తులు కె. సుబ్బారావు, చంద్రారెడ్డి, సత్యనారాయణరావు గార్లు, తెన్నేటి విశ్వనాథం, మల్లంపల్లి సోమశేఖర శర్మ, గిడుగు సీతాపతి, గోవిందరాజుల సుబ్బారావు, పి. నాగయ్య, శ్రీశ్రీ, ఆరుద్ర, మోటూరి సత్యనారాయణ, శ్రీపాదగోపాల కృష్ణమూర్తి, ఇంకా పలువురు పెద్దలున్నారు. ఈ చిత్రంలో విశ్వజనీనమైన ఆకర్షణ వున్నదనీ, నాస్తికత్వం, అవినీతి ప్రబలుతున్న ఈరోజుల్లో ఈ నీతిప్రబోధక చిత్రం వెలువడడం హర్షించదగినదనీ వారు తమతమ అభిప్రాయాలు వెల్లడించారు.

అంతకు కొద్దిరోజుల క్రితం ఈ చిత్రం వాహినీ స్టూడియోలో తెలుగుసినిమా ప్రముఖులకు చూపించబడింది. తెలుగు ప్రేక్షకులు "అవ్వయ్యార్" చిత్రాన్ని చూసి, ఆనందించి నిర్మాతల కృషిని సఫలీకృతం చేయగలరని ఆశిస్తున్నామనీ, ఉత్తమాదర్శములతో నిండిన ఈ చిత్రం నిర్మించిన వాసన్ గారు అభినందనీయులనీ, బి. ఎన్. రెడ్డి, నాగిరెడ్డి, చక్రపాణి, ప్రసాద్, కె. వి. రెడ్డి, కె. ఎస్. ప్రకాశరావు, జి. వరలక్ష్మి, అంజలీదేవి, ఎన్. టి. రామారావు, ఎ. నాగేశ్వరరావు, పింగళి నాగేంద్రరావు ప్రభృతులు తమ ప్రశంసాభావం వెల్లడించారు.

గోదావరి వరదబాధితుల సహాయనిధి సేకరించేందుకు ఆంధ్రదేశంలో వినోద ప్రదర్శనలిస్తూ పర్యటించదలచిన తెలుగు సినిమా ప్రముఖులు తమ సంకల్పం విరమించారని తెలుస్తున్నది. ప్రయత్నాలు చాలవరకు కొనసాగి, కొన్నాళ్ళు రిహార్సల్స్ వగైరా తతంగంకూడా సాగి, చివరకు అంతా విరమించబడిందట. ఎవరికివారే పనుల తొందరలో ఉండడంవల్లనూ, ఇంత పెద్ద బలగంతో, ఇంత పెద్ద కార్యక్రమం నిభా



"పెంపుడుకొడుకు" లో సావిత్రి, గణేశన్

యించడం కష్టసాధ్యం కావడంవల్లనూ బహుశా ఈ విరమణ జరిగి వుంటుందని ఊహింపబడుతోంది. అయినా వరద బాధితులకు ఓపిన సహాయం చేయాలని అందరికీ ఔత్సుక్యం ఉండడంచేత మద్రాసు నగరంలోనే ఈ కార్యక్రమం సాగించి ధనం సేకరించడానికి సన్నాహాలు చేస్తున్నారట.

జనతా ప్రొడక్షన్సువారు తాము తీయబోయే సాంఘిక చిత్రానికి "పరివర్తన" అని నామకరణం చేశారు. శ్రీ టి. ప్రకాశరావు డైరెక్టు చేస్తారు. మాటలు పాటలు శ్రీ అనిసెట్టి సుబ్బారావు, పినిశెట్టి శ్రీరామమూర్తి వ్రాస్తున్నారు. నవంబరులో సెట్స్‌కు వెడతారనీ, అక్టోబరు 15 కల్లా నాలుగుపాటలు రికార్డు చెయ్యగలరనీ కూడా తెలుస్తున్నది. షూటింగ్ వాహినీ స్టూడియోలో జరుగుతుంది.

గత వారం సంచికలో "రాజూ-పేదా" చిత్రం తాలూకు వర్తమానం ప్రకటించబడింది. దీనికి సంబంధించి ఇటీవల జరిగిన కొన్ని మార్పులు ఈ దిగువ ప్రకటిస్తున్నాము: యువరాజు, పేదబాలుడు పాత్రలకు బుక్ చేయబడిన కవలపిల్లలను నిర్మాతలు తొలగించి, ఆ రెండు పాత్రలకూ బాలనటుడు సుధాకర్‌ను బుక్ చేశారు. అతడే రెండు పాత్రలనూ ధరిస్తాడన్నమాట. పేదబాలుడి తండ్రి పాత్రకు శ్రీ ఎన్. టి. రామారావును కొత్తగా బుక్ చేశారు. పేదబాలుడి సోదరిపాత్రకు బుక్ చేయబడిన గిరిజనుకూడా తొలగించి మరొక కొత్తనటిని బుక్ చేశారట. ఇంతకు తప్ప మార్పులేమీ జరగలేదనీ, ఇంతవరకూ షూట్ చేసిన భాగం రద్దుచేసి తిరిగి షూటింగ్ ప్రారంభించారనీ తెలుస్తున్నది.

సాధనావారు తాము నిర్మించనున్న చిత్రానికి "సంతోషం" అనే పేరు మార్చి "సంతానం" అనే కొత్తపేరు నిర్ణయించారు. దర్శకుడు శ్రీ సి. వి. రంగనాథదాసు; సూపర్‌వైజింగ్ దర్శకుడు శ్రీ ఎల్. వి. ప్రసాద్; సంగీతం శ్రీ దక్షిణామూర్తి; మాటలు పాటలు శ్రీ అనిసెట్టి, పినిశెట్టి వ్రాస్తున్నారు.

'దేవదాసు' శతదినోత్సవ సందర్భంలో వినోదా ప్రొడక్షన్ యూనిట్ ఆంధ్రదేశంలోని పది కేంద్రాలు పర్యటన చేస్తారట. పది కేంద్రాలలోనూ ఒక్కొక్కరోజున ప్రదర్శనాలకు వచ్చే ధనమంతా గోదావరి వరద బాధితుల సహాయార్థం ఇవ్వాలని వినోదావారు నిర్ణయించుకున్నారు. ఈ కలెక్షన్సుకి మద్రాసు ప్రభుత్వం వినోదసుంకం విధించబోదని తెలుస్తోంది.

కెమెరామాన్ బి. యస్. రంగాగారు 'విక్రమ్ ప్రొడక్షన్స్' అనే పేరుతో స్వంత ప్రొడక్షన్స్ ప్రారంభిస్తున్నారు. దేవదాసు చిత్రానికి వీరు ఛాయాచిత్రకారులు. ఈ స్వంత చిత్రానికి స్వయంగా దర్శకత్వం ఛాయాచిత్రగ్రహణం నిర్వహిస్తారట.

ఆంధ్రదేశంలో విజయయాత్ర చేస్తున్న 'దేవదాసు'(తెలుగు) చిత్రాన్ని శ్రీ నాగేశ్వరరావు మొదలైనవారితో హిందీలో కూడా తీసే సంకల్పంతో ఉన్నారని తెలుస్తోంది. ★

# ★ కల్లోల గౌతమి చిట్టి ఆభరణం ★

(11 వ పేజీ తరువాయి)

కాపురం నిలబెడదామని ఆశలుగన్నవి. కాని రాజన్న ఆశలు రాళ్ళబట్టినాయి. తండ్రీ, కూతురూమాత్రం గట్టుజేరి గుడ్డలు పిండుకొన్నారు.

## 2

నూకయ్య ఎవరోగాదు. రాజన్న కు "సయాం" మేనల్లుడు. రాజన్న పెళ్ళాం మృత్యుముఖానవుండగా, ఆమె తృప్తిగా ప్రాణాలు విడవటానికి హడావిడిగా నూకయ్యను పిలిపించి అప్పమ్మనిచ్చి(అంట గట్టినట్లే) ముడివేశారు. రాజన్న పెళ్ళాం చిరునవ్వుతో చచ్చిపోయింది. అప్పటికి అప్పమ్మ "అ ఆ"లు దిద్దే ఆడుబిడ్డ.

యుద్ధంలో నూకయ్య విశాఖపట్నం వెళ్ళాడు. అలుగాయ,గోలుగాయ స్నేహం పట్టాడు. యింట్లో వాళ్ళు గంజితాగి మాడి పోతున్నా, చాకలి ఎరువు గుడ్డల్లో తుక్కు నావికుల షోకులకు యెరగా తిరిగే తాలూ తప్పరగాళ్ళతో ఆటలాడాడు. చేసింది ఏం వుద్యోగమో గాని, దబాయించి మామ నుండి నెల నెలా పైసలు రాల్పించుకొనే వాడు, వత్తులులేని వుత్తరాలు రాసి. మళ్ళీ అంతాఅయి స్వగ్రామం చేరిన తర్వాత-అవు పోసన కార్యానికి రాలేదు. సదురూ బెదురూ లేకుండా "మామామ పెళ్ళికిస్తా నన్న వెయ్యిరూపాయల కట్నం యిస్తేనే వచ్చేది" అని మధ్యవర్తులతో చెప్పాడు. నాలుగైదేళ్ళనుండీ రాకపోకలు గూడా లేవు. మామ వెయ్యిరూపాయలమూటకోసం నాలుగేళ్ళు తంటాలుపడ్డాడు.

* * *

వరదలు కోటిపల్లిదాకా కమ్ముకొన్న రోజున రాజన్నకు అల్లుడి క్షేమంగురించి నిజంగా భయంవేసింది. వాళ్ళవూరు అక్కడి నుంచి పదిమైళ్ళు.

కాని నూకయ్యకేం ప్రమాదం కలగలేదు. వరద పుకార్లు వినగానే అందరి మాదిరిగా కాళ్ళకు బుద్ధిచెప్పక, యింట్లో పూచిక పుల్లతో సహా అన్నీ పాత దేవాలయం ఎత్తు మండపంమీదకు చేరవేసుకొని, అక్కడి నుండి వరద ముంపుగా ముంచుకొచ్చిన తర్వాత పడవలో సందుచేసుకొని పక్క వూరు చేరాడు. పడవలో తన పెట్టెగూడా తెచ్చుకొన్నాడు. అమ్మ, అలిలేనివాడికి పెట్టెలో దస్తు ఆదరువుతుందిగదా. ప్రమాదంలేదని కొత్తవూళ్ళో మఠంలో తల దాచుకొన్నాడు. మఠంలో స్వాములవారు బీద బిక్కకి అన్నదానం జేస్తున్నారు-వూళ్ళు, పల్లెలు పడవలమీద తిరిగి.

నూకయ్య నానూగు రాడీల్తో విశాఖ పట్నంలో తిరిగినమాట నిజమేగాని ధైర్యం మాత్రం లేని గంభీరం అతనిది. వరదల్లో సందుచూసుకొని దొంగలదోపిళ్ళు పెక్కులు కాగానే ఒంటరిగా పడుకోవటం మాని వేశాడు. మఠంలో స్వాములవారు లేక పోయినా, ఆయన శిష్యుల్లో యిద్దరుమాత్రం అక్కడే నిలిచిపోయారు. వాళ్ళు లోపల పడుకొన్న ఆసరా జూసుకొని, ఆరోజు కడుపునిండా తిండిదొరికినందున కంటికొద్దీ అలసిన నిద్రబోయినాడు వరండాలోనే. లోపల గుడ్డిదీపం, మఠంచుట్టూ గున్న మామిడిచెట్లూ, మేఘాలవల్ల బయటచీకటి. నూకయ్యది కలతనిద్ర.

* • *

నూకయ్యకు నిద్రలోనే తననెవరో బలంగా నడుంమీద తన్నినట్లు తోచింది. వులిక్కిపడి లేచాడు. మళ్ళీ యింకోతన్ను తగిలింది.చీకట్లో చూట్టూ చూసుకొన్నాడు. చీకటి. చీకటి. అరవబోయినాడు. గొంతు రాలేదు. ఎదురుగా చిన్న పేష్ కత్తి చూపుతూ చీకట్లో ఒక దృఢకాయుడు నించొని వున్నాడు. అతనికి నోరురాలేదు.

"దిక్కులు చూస్తావేరా లేవక? లే! ఆ పెట్టె యిట్టాదే. ఏముంది దాంట్లో?"

గుండెలు పగులగొడుతూ, ప్రపంచం లోని అన్యాయమంతా ఆ ముక్కల్లోనే వున్నట్లు-వినవచ్చినవామాటలు. నూకయ్య జరిగి, సహజభయంతో చేతులు పైకెత్తి లేచి నుంచున్నాడు.

"పలకవేరా? ఏందాచావ్ పెట్టెలో?"

"ఏంలేదు...బా...బూ...!"

చీకట్లో కత్తి మెరిసింది.

"చంపుతా...అరిచావంటే"

చీకట్లో వ్యక్తి వంగి పెట్టెతెరిచాడు ఒకచేత్తో. గుడ్డలు బయటపలాగి విదిలించాడు. నూకయ్యతల్లి మిగిల్చిపోయిన గట్టి నానుతాడు జారిపడ్డది. చీకటి ఆసామీ దాన్ని అందుకొని బొడ్లో దోపుకొన్నాడు.

నూకయ్యకు చీకట్లో చూడటానికి కళ్ళు అలవడినాయ్ యీ నాలుగుక్షణాల్లోనే. వట్టిపుణ్యానికే తనప్రాణంపోదని ధైర్యమూ వచ్చింది. తనతల్లి నానుతాడును గూర్చిన దిగులూ వేసింది. అంత పిరికిలోనూ మాటలు తిరిగి దొర్లినాయి.

"వరదలో అంతాపోయింది బాబూ. బీదముండాకొడుకుని. ఇది మాఅమ్మది. ఈ ఆధారంచూసుకొనే యిప్పటిదాకా ధైర్యంగా వున్నాను. బాబ్బాబూ"

చీకటినుండి — "హుమ్" అని ధ్వని వచ్చింది.

"ఎవరిదైతే నాకేంరా? అమ్మదిగాని, అయ్యదిగాని? నువ్వు బీదాడివైతేనాకేంరా? నాకురాలే వరద? నావి పోయినయ్యా లేదా వెయ్యిరూపాయలు? నా లేగదూడ, నా కొంప, నా అరటితోట పైకం-అంతా. నా వుప్పూ, వూరగాయీ అంతా. అన్నిం టితో నా కూతురు కాపరంగూడా. అల్లుడి యెదాన పోద్దామని పోసుజేశా. గోదావరి పాలుజేశా. నాకేంజాలిరా? నాకుగాదు జాలి—"

చీకటివ్యక్తి తనపని ముగిసిందన్నట్లు "జాగర్త. అరిస్తివా - పీక తెగ్గలదు-" అని కత్తిని మరోసారి మెరిపించి, వరండా దాటి వెనుదిరిగి రెండడుగులు వేశాడు. ఇంకో విఘడియలో ఆ చీకట్లో మాయ మయ్యేవాడేగాని నూకయ్య హఠాత్తుగా ముందుకుదూకిన చప్పుడుకు గబుక్కున వెనుదిరిగాడు.

వెనక మనుషులు పరుగిడినశబ్దం. చీకట్లో చీకటి అలలు అటునుండీ యిటూ, ఇటు నుండీ అటూ స్థానాలు మార్చుకొన్నట్ల యింది. మఠంలో పడుకొన్న శిష్యులిద్దరూ "దొంగ—దొంగ" అని అరిచారు. దొంగ చేతిలోకత్తి విసిరివేశాడు. అది చీకట్లో ఏమూలకుపోయి గుచ్చుకొన్నదోగాని,శిష్యు లిద్దరూకలిసి దొంగను పట్టుకొన్నారు. అంతా చిటికెవేసినంతలో.

"ఒరి దొంగపీనిగా! నీదంభాలకు మా యిద్దరికీ మెలుకువొచ్చింది. లేకపోతే పారి పోయే వుందువు."

కాలేజి నోటీసుబోర్డులో యిలా వ్రాసి వుంది:—'క్రొత్త 'పార్కర్ 51' పెన్ను- నలుపు రంగుది - పోయింది. దొరికిన వారు దయచేసి ప్రిన్సిపాలు ఆఫీసులో యివ్వప్రార్థన. ఇట్లు వనజ.'

మరునటి రోజు ప్రిన్సిపాలు ఆఫీసులో 51 కొత్త పెన్నులు తయారైనాయి.

కె. మల్లికార్జునరావు - కడప.

# కమలా - విమలా

(25-వ పేజీ తరువాయి)

శాం: విమలమ్మా విశేషం వుందా?

వి: లేకపోవట మేమిటి? కమల భర్తకి చాలా ప్రమాదంగా వుందిట. సెరిబ్రల్ థ్రాంబోసెస్. అప్పుడు వారికి వచ్చిన జబ్బే.

శాం: (ఆదుర్దాగా) అయ్యో.

వి: అది రాసిన ఉత్తరంలో చివ్వరి భాగం చదువుతానుండు. (చదువుతుంది) "ఒకప్పుడు...షుమారు ఆరు సంవత్సరాల క్రితం నీభర్త చనిపోతే నిన్ను ఓదార్చటానికి వచ్చాను గుర్తుందా విమలా? ఆనాటి నుంచి నా మనసులో ఏదో తెలియనిబాధ. దానికి అనునయంగానే ఆయనకి యీ ఆపద వచ్చి పడింది. ఏం చెప్పేది కమలా? డాక్టర్లు నిరాశ చేసుకున్నారు. నేను ఎంత బాధపడిపోతున్నానో ఆ భగవంతుడికే తెలుసు. (గద్గదికంగా) నువ్వు ఒకసారి తప్పక రావాలి కమలా. అదృష్టంవుండి నీ రాకతో ఆ రోగం మటుమాయ మవుతుందో, లేక ఆనాడు నేను నీకోసం వచ్చినట్లు...నువ్వు నాకోసం...అయ్యో. యిక వ్రాయలేను. దయవుంచు — నీ కమల.

శాం: పాపం. ఎంత భయపడిపోయిందో.

వి: (ఆవేశంగా) కమల జీవితం నాశనం కావటానికి వీల్లేదమ్మా, అది సుఖించాలి. (కొంచెం ఆగి నిశ్చలంగా) మానవులందరూ యీ విధంగా విధి అనే ఎరకి లోబడి పట్టుబడిపోవటం జరగకూడదు. కొందరైనా ఎదురీత యీది విజయం సాధించాలి.

శాం: ఏమిటి తల్లీ యీ ఆవేశం?

వి: ఆవేశం కాదమ్మా. ఆరేళ్లుగా నాలో జీర్ణించిపోయి, అణిగి మణిగి వున్న బాధ కమల ఉత్తరంతో బయటికి పెల్లుబికింది. నా కోరిక నెరవేరితే నేకాని తిరిగి అణగారదు.

శాం: అయితే ఏం చెయ్యగలవమ్మా?

వి: నా శక్తికొద్దీ నేను ప్రయత్నిస్తాను. అమ్మా! యీరాత్రి బండికే నా ప్రయాణం. అన్నీ సిద్ధంగా వుంచుతావుగా. ఈలోగా నేను అప్పుడే తిరిగి రావటానికి వీలులేదు కాబట్టి యిక్కడ చేయదగ్గ ప్రయత్నాలన్నీ చేసిపోతాను.

శాం: అలాగే తల్లీ. ఇందాక వచ్చిన ఆవిడ విషయం...

వి: ఇదిగో, యిప్పుడే ఆవిడతో వెళ్తాను. వచ్చేటప్పటికీ అన్నీ అమర్చి వుంచుతావుగా.

శాం: (కొంచం ఆగి) పిచ్చితల్లి, తన బాగోగుల గురించి తను చూసుకోదు గదా.

* * *

వి: కమలా!

క: వచ్చావా విమలా. నీకోసం కళ్లు కాయలు కాసేటట్లు చూస్తున్నాను. (గద్గదికంగా) ఈవారం రోజులుగా కర్తవ్యం తెలియక తల్లడిల్లిపోతున్నాను విమలా. నన్ను రక్షించవూ? నాజీవితం విషాదమయం కాకుండా కాపాడవూ?

వి: ఏమిటి కమలా యీ ఆవేశం?

క: (ఏడుస్తూ) ఏంచెయ్యను విమలా? అలా జరిగితే నేనేమయిపోవాలి? నేనింకా

---

గుడ్డిదీపంతో వెతికి శిష్యుల్లో ఒకరు రెండుతాళ్ళు తెచ్చాడు. దీపం దగ్గరగా తెచ్చి దొంగముఖం వంక చూశాడు. నూకయ్య నిల్చొనే వున్నాడు-వణుకుతూ.

"ప్రళయమొచ్చి ప్రజ జస్తుంటే పీనిగవెధవ నువ్వుజేసే పనియిదా?" అని తాళ్ళు బిగించారు చేతులకూ, కాళ్ళకూ. ఈ శిష్యులు కొత్తవాళ్ళుగా వున్నారు. స్వాములవారి శాంతం వీరిలో వీసమూ కనబడలేదు.

అంతా అయినదాకా వుండి నూకయ్య అన్నాడు:

"తాళ్ళు విప్పదీయండి. ఈయన దొంగగాడు. మా మామ రాజన్న. మా గృహ ఛిద్రాలు మాట్లాడుకొంటున్నాం యిందాకటినుంచీ"

## 3

గట్టుమీద కొత్తగా వేసిన పందిట్లో అప్పమ్మ కూర్చునివుంది, నూకయ్య కెదురుగా.

"గోదావరమ్మ ముక్కు ఫుడక పోయింది గాని లేకపోతే నువ్వెక్కడో, నేనెక్కడో" అన్నాడు నూకయ్య.

"నిజంగానా బావా? ఎక్కడబోయిందిట?"

రాజన్న నవ్వుకుంటూవచ్చి—

"ఎక్కడేంటే వెర్రిపిల్లా. రామపాద సాగరం దగ్గరగాదంటే" అని ఆయిద్దరివంకా చూశాడు - ముగ్గురూ నవ్వుకొన్నారుగాని చుట్టూవున్న కొందికీకులు — "రామపాద సాగరమా?" అని కళ్లో లగొ తమివంక చూశారు.

★

# ★ కమలా - విమలా ★

ఎవరికోసం బ్రతకాలి? నేను ఒంటరిదాన్ని కూడాకాదు. ఇద్దరుపిల్లలు. వాళ్ల జీవితాలు ఏమయిపోవాలి?

వి: భయపడబోకు కమలా. అదృష్టం వుంటే...

క: ఏం అదృష్టం? డాక్టర్లంతా పెదవి విరిచారు ... నువ్వు నాకు ... నేను నునీ ఆనాడు చేసినట్లు...ఓదార్చేపరిస్థితివస్తే... (ఏడుపు)

వి: ఉష్. ఏంమాటలవి? ముందు ఆయ నెక్కడున్నారో చూపించు - పద.

క: పద విమలా. కాని యీసారి నువ్వు నా స్నేహితురాలిగా రాలేదు. డాక్టర్ గా వచ్చావు. ఇంతకుముందు నేనన్నవన్నీ మరిచిపో యి ... (గుద్గదకంఠంతో) నీకాళ్లు పట్టుకుంటాను. ఆయన్నెలాగైనా...

వి: ఏమిటిది? నువ్వింకా ఎంతో ధైర్య వంతురాల వనుకున్నాను. రాలేకపోతే యిక్కడే వుండు. నేను పోయి వస్తాను.

క: రాలేకపోవటు మేం విమలా. పద. ఆయన్ని మాడకుండా వుంటేనే నాకింకా బాధ.

*   *   *

వి: కమలా! నేను వచ్చినపనయింది. ఇక వెళ్ళిపోతాను.

క: నాచర్మంతో చెప్పులుకుట్టిఇచ్చినా నీఋణం తీర్చుకోలేను విమలా. ఏకో అపా యిత్యం జరుగుతుందని హడిలిపోయిన నన్ను తిరిగి కుదుటబడేస్థితికి తీసుకవచ్చావు.

ఆ: (నీరసంగా) మీకు నేను చేయెత్తి నమస్కరిస్తున్నాను. విమలా దేవిగారూ నావళ్లు నాకు తెలియనిస్థితిలో ఎన్ని రోజు లున్నానో నాకు తెలీదు. కళ్లు తెరిచి క్యాలెండరువంక చూసేసరికి పదికాగితాలు చిరిగిపోయి వున్నాయి. అంటే రోజులనే అనుకోండి.

వి: మీ భార్యాభర్తలు యిద్దరూ కలిసి నన్ను యిలా మునగచెట్టు ఎక్కించేస్తే నేనేమయిపోవాలి?

ఆ: మళ్ళీ మా కమల జాగ్రత్తగా దింపు తుందిలెండి. (ముగ్గురూ నవ్వు)

క: కాస్త కుదుటబడేసరికి అయ్యగారికి అప్పుడే పరిహాసాలు ప్రారంభమయినాయి.

ఆ: ఇలా మాట్లాడ గలుగుతున్నానంటే యీపుణ్యమంతా ఆవిడదే.

క: తప్పకుండానూ. మేం ఏదిచ్చికూడా నీఋణం తీర్చుకోలేం విమలా.

వి: అబ్బ. అంతటితో చాలు ఆపవే.

ఆ: అయితే విమలాదేవిగారూ మీరు అప్పుడే వెళ్లిపోవటమేమిటి? మాకు యింత ఉపకారం చేసినవార్ని అంత సులభంగా వదిలివేస్తామనుకుంటున్నారా? మాయింట్లో యింకా కొన్ని రోజులువుండందే వీలులేదు.

వి: లేదు. క్షమించాలి.

క: అదేం కుదరదులే విమలా. ఆయన వదిలినా నేనుమాత్రం వదలను.

విమ: వీలులేదులే కమలా. నాకు తీరదు. అక్కడ పేషంట్సు ఎలా వున్నారో ఏమిటో. అర్ధాంతరంగా వదిలి వచ్చేశాను. వచ్చి చాలా రోజులుకూడా అయింద వెళ్ళి పోవాలి.

ఆనం: తప్పదంటారా?

వి: క్షమించమని చెప్పానుగా.

ఆనం: అయితే ఒక విషయం. పెద్ద డాక్టరుకూడా ఆశవదులుకున్న నన్ను రాత్రింబవళ్లు విశ్రాంతి లేకుండా శుశ్రూష చేసి మీచేతి చలవవల్ల బ్రతికించారు. నేను ప్రమాదంలో వున్నన్నాళ్ళూ మీరు సరిగ్గా భోజనంకూడా చెయ్యలేదని, కంటిమీద కునుకైనా తియ్యలేదని కమల చెప్పింది. ఇంత సహాయం చేసిన మీకు ఒక్కటి చేసి నా కృతజ్ఞత చూపిద్దామనుకుంటు న్నాను.

వి: ఏమిటో నన్ను యిబ్బంది పెట్టం దయితే.

ఆనం: విమలాదేవిగారూ. మీకు యిప్పటికైనా ఎక్కువ వయస్సులేదు. ముందుముందు మీరింకా అనుభవించవల్సింది చాలా వుంది. మీ జీవితాన్ని యిలా నాశనం చేసుకోకుండా ఎవర్నయినా మేరేజి చేసుకుని ఎందుకు సుఖపూరితం చేసుకో కూడదు.

క: అవును విమలా. నేనూ ఆ విష యమే చెప్దామనుకుంటున్నాను. మా సంతోషంకోసం, నీ సుఖంకోసం అలా చెయ్యవా?

వి: హా. నేనిప్పుడు అనుభవిస్తున్న సుఖం చాల్లే కమలా. జరిగిపోయిందేదో జరిగిపోయింది. తిరిగి పెళ్లిచేసుకుందామన్న ఉద్దేశం నాకు ఏమాత్రం లేదు. ఆ విష యంలో అమ్మ చెప్పినా, ప్రాణస్నేహితు రాలవైన నీవు చెప్పినా యింకెవరు చెప్పినా వినదల్చుకోలేదు. (కొంచెం ఆగి కానీ ఒక్కటి. వారు యిప్పుడు ఆనందరావు గారికి ఆవహించి వదిలిన యీ పాడు జబ్బు తోనే చనిపోయారు. ఏ డాక్టర్లూ ఆయనని కాపాడలేకపోయారు. కాని ఆజబ్బుని ఆనందరావుగారినుంచి వేరుచేసి నేను ధన్యు రాల్ని కాగలిగాను. అదొక్కటే సంతోషం. నా పతనం ఎలాగవున్నా ప్రాణస్నేహితురాలివయిన నీ పతనాన్ని నేను కళ్లచూడలేను. అందులోవారి ప్రాణం తీసిన మాయరోగం.దాన్ని జయించి నిన్ను రక్షించుకున్నానంటే, నువ్వేమయినా అనుకో, నాకు నిజంగా గర్వంగావుంది. నా కిప్పుడెంతో శాంతిగా వుంది. ఫలితం యిలా జరగకుండావుంటే నాకు ఎంత ఆవేదనగా వుండేది? రాత్రింబవళ్లు ఆ రాక్షసి జబ్బుతో ఎందుకు కుస్తీ పట్టాను? అర్థమయిందా? ఇంకా ఏం చెప్పేది?... రైలు టైమయిపోయింది. ఇక వెళ్తాను. వీ లయితే ఎప్పుడన్నా కలుస్తూవుంటాను.

క: (ఆదుర్దాగా) విమలా.

వి: (ఉద్వేగం అపుకుంటూ) నన్నింక ఆపవద్దు కమలా. నమస్తే ఆనందరావుగారూ గుడ్ బై.

ఆనం & వి: (అచేతనంగా) గుడ్ బై.



# ★ ఆంధ్రుల చరిత్ర ★

(7-వ పేజీ తరువాయి)

ఉత్తరమున మాధారులు దక్షిణమున పల్లవులు ఆంధ్రదేశ భూముల నాక్రమించసాగిరి. ఇట్టి పరిస్థితులలో విష్ణుకుండినులు ప్రతిపక్షులనదిమి విజయవంతులైరి. విష్ణుకుండిన వంశకర్తయైన మహేంద్రవర్మ నలువైపుల నుండి ఆంధ్రదేశము నాక్రమించుచున్న శత్రురాజుల పరాజితులజేసి తరిమివేసి ఆంధ్ర భూమండలములను ఒక పరిపాలన లోనికి తీసుకొని రాగలిగెను. తన దిగ్విజయములకు సూచకముగ మహేంద్రవర్మ రాజసూయ, పురుషమేధ ఏకాదశాశ్వమేధము లొనరించెను. ఇదిగాక మహేంద్రవర్మ వాజపేయ బహుసువర్ణ పౌండరీకాది శత సహస్ర క్రతువు లొనరించెనని శాసనములు చాటుచున్నవి.

**చాళుక్యులు:** విష్ణుకుండినుల అనంతరం ఆంధ్రదేశం చాళుక్యులు వశపరచుకొన్నారు. (*A. D* 625) వేంగీ, రాజమహేంద్రవరములు రాజధానులుగా తీరాంధ్రమును 5 శతాబ్దముల పైగా పాలించారు చాళుక్యులు. ఈ యుగంలో దక్షిణదేశ రాజకీయములందు ఆంధ్రదేశము ప్రముఖస్థానము నాక్రమించెను. మాల్యఖేటము నుండి రాష్ట్రకూటులు, కళ్యాణినుండి పశ్చిమ చాళుక్యులు, తంజాపూరినుండి చోళులు కళింగమునుండి గాంగులు దక్షిణదేశాధీశ్వరులగుటకు తీవ్ర ప్రయత్నములు సాగించుచుండిరి. అందుచేత, దక్షిణదేశమున ఆయువుపట్టునందున్న ఆంధ్రదేశముపై వారు తమ దృష్టి ప్రసరించిరి. తత్ఫలితముగ సామ్రాజ్య కాంక్షులైన వీరందరికి ఆంధ్రదేశము కదనరంగస్థలమయ్యెను. తరచు వేంగీశ్వరులు రాష్ట్రకూటులకుగాని పశ్చిమ చాళుక్యులకుగాని తమ స్వాతంత్ర్యమును కోల్పోవుచుండిరి. 11 వ శతాబ్ది ప్రారంభమునుండి ఆంధ్రదేశమున చోళుల ప్రాబల్యము హెచ్చెను. ఈ విధముగ చాళుక్య యుగమున ఆంధ్రులు రాజకీయముగ కష్టనష్టముల ననుభవించిరి. ఐనను గుణక విజయాదిత్యాది (*A. D.* 848–891) చాళుక్య రాజపుంగవులు కాంచీనగరమునుండి గంగానదివరకూ తూర్పుతీరమునుండి మాల్యఖేట కళ్యాణ కటకములవరకు విజయయాత్రలు జరిపి ఆంధ్రుల శౌర్య ప్రతాపములను శత్రువులకు చవిజూపించక పోలేదు. 1068 లో రాజరాజ నరేంద్రుని కుమారుడైన రాజేంద్రుడు మాతామహస్థానమైన చోళరాజ్యమున కేగి కులోత్తుంగ చాళుక్య చోళుడై చోళరాజ్యము నుద్ధరించిన తర్వాత చాళుక్యుల పరిపాలన ఆంధ్రదేశములో అంతరించినట్లే చెప్పవచ్చును.

రాజకీయముగ నష్టములకు లోనైనను ఈ యుగము సాంస్కృతికముగ ఆంధ్రుల చరిత్రలో అజరామరమైనది. రాజకీయ కల్లోలములవల్ల మత అవ్యవస్థవల్ల ప్రజలలో బయలుదేరిన తీవ్ర అసంతృప్తి ఫలితంగా ఆంధ్రదేశంలో ఒక సాంస్కృతిక పునరుజ్జీవన యుగం ప్రారంభమైంది. ఆంధ్ర జాతీయ భాషయైన తెనుగునకు ప్రాధాన్యత హెచ్చసాగింది. ఈ నూతన చైతన్యానికి నిదర్శనంగా, హైందవ మత సంస్కృతులకు విజ్ఞానసర్వస్వమై, పంచమవేదమైన మహాభారతమును రాజరాజనరేంద్రుని పరిపాలన (1019–1061) లో నన్నయ భట్టారకుడు ప్రసన్నమగు శైలిలో తెనుగు భాషలో సామాన్య ప్రజానీకానికి అందించాడు. ఈ విజ్ఞానోద్యమము రాజకీయ విప్లవములవల్ల ఒక శతాబ్దంవరకూ అణగియుండవలసి వచ్చింది. ఈ ఉద్యమమే కాకతీయ యుగానికి తాత్త్విక పునాదులు వేసి ఆ యుగంలోనే అభివృద్ధి పొందగలిగింది.

**కాకతీయులు:** కాకతీయ యుగముతో ఆంధ్రుల చరిత్రలో నూతనాధ్యాయము ప్రారంభమైంది. తూర్పు చాళుక్యుల నిర్గమనంతో ఆంధ్రదేశమునందు తెలుగు చోడులు, హైహయులు, చాగివంశీయులు, చాళుక్యులు మున్నగు చిన్న రాజవంశములవారు బయలుదేరి పరస్పరాంతః కలహములలో మునిగి దేశమును అరాచకములో ముంచెత్తుచుండిరి. చోళులు, పశ్చిమచాళుక్యులు గాంగులు సమయము వచ్చినప్పుడెల్ల దేశసంపదను దోచుకొనుచుండిరి. ఇది ఇట్లుండ పశ్చిమోత్తరమునుండి యాదవులు ఉత్తరమునుండి తురుష్కులు ఆంధ్రదేశముపైబడ నుద్యుక్తులగుచుండిరి. ఇట్టి క్లిష్టపరిస్థితులలో కాకతీయులు దేశాధిపత్యం వహించి అరాజకతను రూపుమాపి ఆంధ్రభూములను సమైక్యం చేశారు. శాతవాహనుల పతతోనను విస్మృతిపథమున పడిపోయిన ఆంధ్ర జాతీయ భావము పునరుద్ధరింపబడింది. కాకతి రుద్రుడు, గణపతి దేవ చక్రవర్తి సాధించిన విజయాలతో తిరిగి ఆంధ్రత్వము రూపురేఖలు దిద్దబడి నూతన తేజముతో ప్రకాశించెను. ఓరుగల్లు ఆంధ్ర నగరియైనది; గణపతి దేవుడు ఆంధ్ర దేశాధీశ్వరుడైనాడు. వేగినాడు, వెలనాడు, రేనాడు అను సంకుచిత రాష్ట్రాభిమానము విడిచి ఐక్య జాతీయ భావముతో ఆంధ్రులు తమ దేశ గౌరవాభివృద్ధులకై పాటుబడ్డారు. గణపతి దేవుని నాయకత్వమున ఉత్కళమునుండి కాంచీపురమువరకు, గోదావరి మొదలు తుంగభద్ర పర్యంతము ఆంధ్రవీరుల విజయధ్వానాలు ప్రతిధ్వనించినై. గణపతి దేవుని కుమార్తెయైన రుద్రాంబ కాలమున యాదవరాజుల విజృంభణ మరికట్టబడెను. రెండవ ప్రతాపరుద్రుని కాలమున కటకమునుండి రామేశ్వరము వరకు నిరాటంకముగా ఆంధ్రపతాక ఎగిరిన నిదర్శనము లున్నై.

కాకతీయ పరిపాలనలో లభించిన నూతనోద్రేకముతో జాతీయ పునర్నిర్మాణమునకు ఉద్యమములు బయలుదేరెను. ఇతర విభేదములను నిర్మూలన మొనర్చి, కేవల మాంధ్రత్వమే ప్రాతిపదికగా సమైక్య మానవ సోదరత్వమును స్థాపించుటకై మల్లికార్జున పండితుడు, బ్రహ్మనాయకుడు పద్మనాయకులు తీవ్రముగ కృషి చేసిరి. చాళుక్య యుగంలో ప్రారంభమైన విజ్ఞానోద్యమానికి బలము చేకూరెను. కవులు లేఖకులు ఆంధ్ర భాషామాతకు కావ్యాలంకారములను కూర్చిరి. దేశము నిత్యకల్యాణము పచ్చతోరణముగ నున్నట్లు అమీర్ ఖుస్రూ మున్నగు తురుష్క రచయితల గ్రంథములవల్ల తెలియుచున్నది.

**తురుష్క దండయాత్రలు:** ఇంతలో ఢిల్లీ సుల్తానుల విష దృష్టులు దక్షిణ రాజ్యములపై ప్రసరించెను. దేవాలయములను విధ్వంస మొనర్చి మహమ్మదీయ మత ప్రచార మొనర్చుటకును, దక్షిణదేశ సౌభాగ్యమును కొల్లగొట్టి ఆ సంపదతో ఢిల్లీ సింహాసన మాక్రమించుటకు అల్లాఉద్దీన్ ఆశించెను. 1296 లో దేవగిరి రాజ్యము ముట్టబడి అల్లాఉద్దీను ధనధనమును కొల్లగొట్టెను. అతడు ఢిల్లీ సుల్తానైనప్పటినుండి దక్షిణ దండయాత్రలకు పథకములు వేయుచునే ఉండెను. కాని, శాతవాహనులు శకుల నరికట్టినట్లే కాకతీయులు తురుష్కుల నరికట్టి సుమారు రెండు దశాబ్దములు దక్షిణ హిందూదేశ స్వాతంత్ర్యమును కాపాడగలిగిరి. ఈ సందర్భమున రెండవ ప్రతాపరుద్రుని కృషి, మేవాడు రాజపుత్రవీరుడైన బప్పరావాలు కృషి

# ★ ఆంధ్రుల చరిత్ర ★

మాత్రము తీసిపోదు. నవలక్షాశ్వదళాధిపతియైన ఢిల్లీసుల్తానును ప్రతాపరుద్రుడు రెండుమార్లు పరాజితు జేసిపంపెను. కాని విశాల సామ్రాజ్యాధిపతులైన ఢిల్లీ సుల్తానుల విజృంభణ నెంతకాలము అరికట్ట సాధ్యపడును? అంతేగాక ఉత్తరమున స్వతంత్ర యాదవరాజ్య మస్తమించుటతో ఆంధ్ర దేశముపై బడుట మహమ్మదీయులకు సులభమయ్యెను. చివరకు 1323 లో ఉల్లుఖాను ప్రతాపరుద్రుని చెరపట్టి ఓరుగల్లును వశపరచుకొనెను. ఆంధ్ర స్వాతంత్ర్య భాను డస్తమించెను. 'ఆంధ్ర నగరి'యైన ఓరుగల్లు 'సుల్తాన్‌పూర'య్యెను. ఆంధ్ర దేశమున తురుష్కపాలన మారంభమయ్యెను.

ప్రతాపరుద్రుని అస్తమయముతో ఆంధ్ర దేశమున మహమ్మదీయుల నెదిరించువారు లేకపోయిరి. ఉల్లుఖాను దేశమంతయు సులభముగ నాక్రమించగల్గెను. రాజమహేంద్రవరమునుండి నెల్లూరువరకును, తుంగభద్రా తీరము వరకును మహమ్మదీయుల పరిపాలన నిరాటంకముగ సాగెను. నిరవద్యపురము, రాజమహేంద్రవరము మున్నగు పెక్కుచోట్ల ప్రాచీన దేవాలయములు నేలమట్టములై వాటి స్థానముల మసీదులు వెలసెను. రైతులు పన్నులభారముతో క్రుంగిపోసాగిరి. ఇట్టి ద్వేష ప్రతీకార పూరితమైన తురుష్క నిరంకుశత్వమును వర్ణవర్గ తారతమ్యము లేకుండ యావదాంధ్ర ప్రజానీకమూ గర్హించెను. ఆంధ్రులలో స్వాతంత్ర్యకాంక్ష విజృంభించెను. విప్లవ చైతన్యయుతమైన ఈ నూతన శక్తులను నడిపించుటకు క్రొత్తనాయకులు బయలుదేరారు. ఈ స్వాతంత్ర్య సమరము నడిపిన వీరులలో తెలింగానా ప్రాంతముల ముసునూరి ప్రోలయ కాపయనాయకులు, తీరాంధ్రమున దేసటి ప్రోలయవేమా రెడ్డి, రేనాడులో (రాయలసీమలో) అరవీటి సోమదేవరాజు ముఖ్యులు. ఇంతలో తుంగభద్రా తీరమున క్రొత్త సంఘటన జరిగెను. మంగళనిలయ (మంగళగిరి) నివాసియైన సంగ మునికుమారులునూ, రెండవ ప్రతాపరుద్రుని కోశాధికారులైనవారునూ, కంపిలరాయని కొల్వులో ఉద్యోగులుగా నుండి మహమ్మద్ బన్ తుగ్లక్ చే బంధితులుగా గొంపోబడి మరల తుంగభద్రా తీరమున కంపిలరాజ్య ప్రాంతములపై రాజప్రతినిధులుగా నియమింపబడినవారునూ ఐన హరిహరుడూ, బుక్కడూ అను ఆంధ్ర సోదర ద్వయము విద్యారణ్య మహర్షి దీవనబలముతో విద్యానగరమున స్వతంత్ర హిందూ రాజ్యమును స్థాపించిరి. (*A. D.* 1336) ఇదే సమయమున ముసునూరి కాపయనాయకుడు ఓరుగల్లు నుండి మహమ్మదీయులను తరిమి ఆంధ్ర సురత్రాణ బిరుదముతో తెలింగాణా ప్రాంతమును పరిపాలింప సాగెను. ఈ విధముగ 1336 నాటికి తురుష్కులను పూర్తిగా తరిమివేసి దేశమును నిష్కంటకము గావించి ఆంధ్రులు స్వతంత్రులైరి.

ఐనను కాకతీయ సామ్రాజ్య విచ్ఛిన్నముతో ఆంధ్రదేశమున రాజకీయైక్యత మరల నశించెను. ప్రస్తుత తెలింగాణము ముసునూరి నాయకులు 1368 వరకు పాలించిరి. వారితర్వాత దేవరకొండ పద్మనాయకులు వశపరచుకొని పాలింపసాగిరి. తీరాంధ్రమంతయు కొండవీటి రెడ్డిరాజుల వశమయ్యెను. నేటి రాయలసీమ ప్రాంతమంతయూ విజయనగర రాజుల పాలనలో నుండెను. ఈ అనైక్యత ఆంధ్రదేశమునందు శాశ్వతముగ లిలిచిపోయిన దనియే చెప్పవచ్చును.

ఇది ఇట్లుండ 1347 లో అల్లాఉద్దీన్ హస్ గంగూ గుల్బర్గరాజధానిగా స్వతంత్ర బహమనీ రాజ్యాన్ని స్థాపించాడు. మతాభిమానం విపరీతంగా ఉన్న ఆ రోజుల్లో హిందూ మహమ్మదీయులు పరస్పరశత్రువులు గావటం సహజమే. బహమనీ రాజ్యస్థాపన జరిగినప్పటినుండీ ఆంధ్రరాజులకు సుల్తానులకు యుద్ధాలు తప్పనిసరియైనై. ఆంధ్రుల అనైక్యత బహమనీ సుల్తానులకే గాక తూర్పుననున్న ఉత్కళ గజపతులకు గూడా మంచి అవకాశమైంది. సుమారు (*A. D.* 1425) నాటికి తీరాంధ్రమును రెడ్డిరాజులనుండి గజపతులాక్రమించారు. ఇంచుమించు అదేసమయానికి తెలంగాణమునందు పద్మనాయకులు అదృశ్యులై వారి రాజ్యము బహ్మనీ సుల్తానుల వశమైపోయింది. బహ్మనీ రాజ్యం కృష్ణానదివరకూ వ్యాపించింది.

**విజయనగర సామ్రాజ్యము :** క్రమముగా విజయనగరాంధ్రరాజులు కృష్ణానదికి దక్షిణమందుగల భూములన్నింటిని ఆక్రమించి సామ్రాజ్యాన్ని నిర్మించారు. కోరమండల తీరంలో స్థావర మేర్పరచుకొన్న మహమ్మదీయాధికారాన్ని తుదిముట్టించారు. రామేశ్వరం, శ్రీరంగం మొదలైన హైందవ పుణ్యక్షేత్రాలలో పూజాపునస్కారాలు పునరుద్ధరించారు. దక్షిణదేశంలో మహమ్మదీయ మత వ్యాప్తి జరగకుండుటకు, హిందూ దేవాలయాలు చెక్కు చెదరకుండుటకు విజయనగర రాజులే కారణ మనుటలో అతిశయోక్తి లేదు. గజబేటకార ఇమ్మడి దేవరాయల కాలమున (1426-1446) విజయనగర సామ్రాజ్య ప్రతిష్ఠ విదేశములకు గూడ వ్యాపించెను. పర్షియా చక్రవర్తి దేవరాయలి ఆస్థానమునకు అబ్దుల్ రజాక్ అను రాయబారిని పంపెను. (1442) ఇతని వ్రాతలనుబట్టి కిలన్, సింహళము, పెగు, టనాసరిమ్ (బర్మా) మొదలగు అనేక దేశాల ప్రభువులు దేవరాయలకు కప్పము చెల్లిస్తూ ఉండేవారట. తన ముత్యాలశాలలో, ఆంధ్రకవితాసనాథుడైన శ్రీనాథ కవిసార్వభౌమునికి కనకాభిషేక మొనరించి గౌరవించినది ఈ దేవరాయలే.

విజయనగర సామ్రాజ్యము శ్రీకృష్ణదేవరాయల కాలమున (1509-29) ఉచ్ఛదశ ననుభవించెను. తిరిగి ఆంధ్రదేశ సమైక్యతకు ప్రయత్నాలు జరిగినై. తీరాంధ్రమునుండి గజపతులు నిర్గమించి కటకము వరకూ కృష్ణరాయలి అధికారం స్థాపింపబడింది. కృష్ణా తుంగభద్రా నదుల మధ్య ప్రదేశం బీజపూరు సుల్తానునుండి ఆక్రమించాడు కృష్ణరాయలు. గోల్కొండ సుల్తానును జయించి ఓరుగల్లు, కంభము జల్లిపల్లి, భద్రాచల మన్యభూములు ఆక్రమించాడు. పదభ్రష్టుడై సామంతుల చేతుల్లో బందీయైన బహమనీ సుల్తానును సింహాసనస్థుని చేసి "యవనక్షోణీశస్థాపనుడై" తద్వారా బహమనీ రాజ్యములందు అంతర్యుద్ధమును రెచ్చగొట్టి కుతుబ్‌షాహీనుండి మిగిలిన తెలంగాణా ప్రాంతమును వశపరచుకొన కృష్ణరాయలు ప్రయత్నించాడు. కాని 1529 లో కృష్ణరాయని మృతితో అతని ఆశలు అడియాసలైనై.

శ్రీ కృష్ణదేవరాయలి కాలమున ఆంధ్ర జాతీయత విశిష్టతను సంపాదింప గలిగింది. చాళుక్యయుగంలో ప్రారంభించిన సారస్వతోద్యమము కృష్ణరాయల ఆస్థానంలో వికసించింది. దేశభాషలలో కెల్ల లెస్సయని తెలుగు గౌరవింపబడింది. దక్షిణదేశ మహాసామ్రాజ్యమునందు ఆస్థాన కవి ఆంధ్ర కవితా పితామహుడైన అల్లసాని పెద్దన! ఆంధ్ర నాగరికతా సంస్కృతులు దక్షిణదేశమంతటా వ్యాపించినై. మధుర తంజావూరులందు తెలుగు నాయకుల పాలన ప్రారంభమయ్యెను. కృష్ణరాయల తర్వాత నూటయేబది సంవత్సరములు తెలుగు నాయ

కులా రాజ్యములను పాలించి ఆంధ్ర సంస్కృతిని తమిళ దేశమున వెదజల్లిరి. తంజావూరు, మధుర, రామేశ్వరం మొదలగుచోట్ల ప్రశస్త శిల్పకళా నిలయములైన దేవాలయములు నిర్మింపబడినై. దక్షిణదేశమంతటా ఆంధ్ర కవులూ, గాయకులూ, శిల్పులు, అగ్రస్థానాన్ని పొందారు; ఆంధ్ర సంస్కృతి గౌరవింపబడింది.

**గోల్కొండ సుల్తానులు:** దినదినాభివృద్ధినందుచున్న విజయనగర సామ్రాజ్య వైభవమునకు రక్షస్తనగడి (తల్లికోట 1565) యుద్ధము గొడ్డలిపెట్టయ్యెను. విజయనగర ప్రభువులు చంద్రగిరికి, రాయవేలూరుకు రాజధానిని మార్చిరి. న్యూనిజ్, రజాక్ మున్నగు పాశ్చాత్య బాటసారులచే ప్రాచ్యదేశములందు అద్వితీయ నగరమని పొగబడిన విజయనగరము బీడువారెను. విజయనగర రాజుల బలము క్షీణించి వారి సామ్రాజ్యములో చాలభాగము అనగా ఆంధ్రదేశమంతయు గోల్కొండ కుతుప్ షాహీలచే నాక్రమించబడెను. కుతుప్ షాహీలకు 1590 నుండి హైదరాబాదు ముఖ్యనగరమైంది. వారు షియామతస్థులై పరమత సహనముకలవారై హిందువులను పెద్ద యుద్యోగములందు నియమించిరి. ఆంధ్రకవులను పోషించిరి. కుతుప్ షాహీలలో చివరివాడైన తానీషా ప్రధానమంత్రి అక్కన్న, సేనాధ్యక్షుడు మాదన్న ఆంధ్ర సోదరులే.

**మొగలాయీలు:** 17 వ శతాబ్ది ప్రారంభమునుండి దక్షిణదేశమునందు మొగలాయి ఆక్రమణ ప్రారంభమైనది. 1635 నాటికి బీదరు అహ్మద్ నగరు రాజ్యములు మొగలాయీ సామ్రాజ్యములో చేరెను. 1636 లో గోల్కొండ సుల్తానైన కుతబ్ - ఉల్ ముల్క్ మొగలాయీల సామంతుడయ్యెను.

1653 లో ఔరంగజేబు డక్కను నైబ్రాయియైనది మొదలు బీజపూరు గోల్కొండ రాజ్యములను జయించి ఆక్రమించవలెనని సంకల్పించెను. 1656 లో దండెత్తి గోల్కొండ రాజ్యమును అల్లకల్లోల పరచెనుకాని షాజహాను జోక్యము కల్గించుకొని యుద్ధము విరమింపజేసెను. కాని ఔరంగజేబు 'షియా' రాజ్యాలను సహించదలచుకోలేదు. చక్రవర్తియైన తర్వాత 1685 లో గోల్కొండపై దండెత్తి దేశభక్తితో మొగలాయి ఆక్రమణను ప్రతిఘటిస్తున్న అక్కన్న మాదన్నలనుహత్యచేయించి గోల్కొండరాజ్యాన్ని ఆక్రమించాడు ఔరంగజేబు. ఆంధ్రదేశం మొగలాయి సామ్రాజ్యంలో అంతర్భాగమైపోయింది (1687). మొగలాయి చక్రవర్తి ఫరుక్షియర్ డక్కనుసుబాకు 1713 లో నైజామ్ ఉల్ ముల్క్‌ను రాజప్రతినిధిగా నియమించెను. అతడు మొగలాయి సామ్రాజ్యమునందలి అంతఃకలహములను అవకాశముగా తీసికొని 1724 నాటికి స్వతంత్రుడై హైదరాబాదును పరిపాలింపదొడగెను. ఆంధ్రులు నైజాము పాలితులైనారు.

**ఆంగ్లేయులు:** 16 వ శాబ్ది ప్రారంభమునుండి ఐరోపా దేశస్థులు హిందూదేశముతో సముద్రమార్గమున వర్తకము ప్రారంభించిరి. అందు ఫ్రెంచివారు ఆంగ్లేయులు యానాం, మచిలీపట్టణము మొదలగు ప్రదేశములందు వర్తక స్థానముల నిర్మించుకొనిరి. 1639 లో ఫ్రాన్సిస్ డే చంద్రగిరిలో రాజ్యమేలుచున్న విజయనగరరాజగు ముమ్మడి వెంకటరాయలవద్ద ప్రస్తుతము చెన్నపట్టణముగల ప్రాంతమును బడసెను. క్రమముగా ఆంగ్లేయులు పరాసువారు హిందూదేశ రాజకియములందు ప్రవేశించి ఇచ్చట తమ ఆధిపత్యమును నెలకొల్ప ఆశించుచుండిరి. ఈపరిస్థితులలో హైదరాబాదునందు వారసత్వపు తగాదా వచ్చెను. ఆంగ్లేయులు, ఫ్రెంచివారు ఇరుపక్షములువహించి యుద్ధమునకు సిద్ధపడిరి. క్రమముగా హైదరాబాదులో ఫ్రెంచివారి పలుకుబడి హెచ్చసాగెను. చివరకు సలబత్ జంగ్ తనను సింహాసనమెక్కించి సహాయంచేసిన ఫ్రెంచివారికి 1753 లో ఉత్తర సర్కారులను బహూకరించాడు. కాని వీటిని ఫ్రెంచివారు ఎక్కువకాలం నిలుపుకోలేకపోయారు. 1758 లో ఆంగ్లేయులు ఫ్రెంచివారిని జయించి ఉత్తర సర్కారులను ఆక్రమించారు. హైదరాబాదు నవాబు సలబత్ జంగ్ ఫ్రెంచివారి మైత్రికి స్వస్తిచెప్పి ఆంగ్లేయులకు సర్కారులను ఇచ్చివేశాడు. ఈ విధంగా ఉత్తర సర్కారులు ఆంగ్లేయుల హస్తగతమైనై.

ఆంధ్రదేశంలో మరియొక భాగం దత్త మండలాలు. ఇవి చాలమార్లు చేతులు మారినై. మహారాష్ట్ర నాయకుడైన శివాజీ 17 వ శతాబ్ది చివరిలో కొంత భాగాన్ని ఆక్రమించాడు. తర్వాత మైసూరులో అధికారం వహించిన హైదరాలీ వీటిని వశపరచుకొన్నాడు. మూడవ మైసూరు యుద్ధా (1790–1792) నంతరం టిప్పుసుల్తాను వీటిని ఆంగ్లేయులకు అప్పగించాడు. ఆంగ్లేయులు వీటిని తమ మిత్రుడు యుద్ధంలో సహాయంచేసిన హైద్రాబాదు నవాబుకిచ్చారు. కాని 1800 సంవత్సరమున నైజాము వెల్లస్లీతో చేసుకొన్న సైన్యసహకార ఒడంబడికవల్ల ఆంగ్ల సైన్యపోషణ ఖర్చుక్రింద ఆంగ్లేయులకీ మండలాలను దత్తం చేశాడు. అప్పటినుండి వీటికి దత్త మండలాలని పేరు స్థిరపడిపోయింది. రాయలసీమ అంటే ఇంచుమించు దత్త మండలములే. ఇక ఆంధ్రదేశమున మూడవ భాగమైన తెలింగానా నాటికీ నేటికీ నైజాము పాలనక్రిందే ఉన్నది.

ఈ నూటయేబది సంవత్సరాలు ఆంధ్రులకు ప్రత్యేక చరిత్ర లేదనే చెప్పవచ్చు. ఆంధ్రదేశ చరిత్ర ఆంగ్లేయ భారతదేశ చరిత్రలో అంతర్భాగమైంది. 19 వ శతాబ్ది మధ్యలో జాతీయ స్వాతంత్ర్యోద్యమం ప్రారంభమైంది. ఈ అఖిలభారత ఉద్యమంలో ఆంధ్రులు ప్రతిభావంతమైన పాత్రను నిర్వహించారు. అనేక త్యాగాలు చేశారు. స్వాతంత్ర్యోద్యమంలోనే భాషా ప్రయుక్తరాష్ట్ర విభజనోద్యమం ప్రారంభమైంది. ప్రజాస్వామ్యానికి జీవగఱ్ఱయైన ఈ సిద్ధాంతానికి పునాదివేసినవారు ఆంధ్రులే.

ముప్పది సంవత్సరాలకు పైగా రాష్ట్ర మహోద్యమాన్ని సాగించారు ఆంధ్రులు. మహాత్మా పొట్టి శ్రీరాములు ఆంధ్ర జాతీయోజ్జీవన మాసించి ఆత్మార్పణ గావించాడు. చిరకాల మాంధ్రులొనర్చిన తపస్సు ఫలించి ఆంధ్ర రాష్ట్రోదయము జరుగుచున్నది. కాని ప్రస్తుత మేర్పడుచున్నది రాయలసీమ తీరాంధ్రముతో మాత్రమే ఉన్న వికలాంధ్రమని గమనించాలి. ఆంధ్రదేశమునకు ఆయువుపట్టువంటి తెలింగానా ఇంకా మనకు దూరముగానే ఉన్నది. తెలింగానా చేరినప్పుడే సమగ్రమై, సర్వసమృద్ధమైన విశాలాంధ్ర యేర్పడుతుంది. తెలింగానా, తీరాంధ్రము, రాయలసీమ అనైక్యములై యుండి ఆంధ్రదేశానికి చేసిన కీడు చరిత్రవల్ల గ్రహిస్తున్నాము. ఆ విభేదాలను పూర్తిగా విస్మరించి విశాలాంధ్ర సాధనకొఱకు రాష్ట్రాభివృద్ధికొఱకు ప్రతి ఆంధ్రుడు కంకణం ధరించాలి; భాషారాష్ట్ర సిద్ధాంతం జాతీయ విచ్ఛేదకము కాదని ప్రజాస్వామ్యానికి ప్రధానమైనదని భారతదేశానికి రుజువు చేయాలి. అప్పుడే ఆంధ్రజాతికి గల ఉజ్జ్వల చరిత్ర సఫలమౌతుంది. ★

##  కాలక్షేపం 

(౫-వ పేజీ తరువాయి)

అన్నంత ప్రఖ్యాతి పొంది యీడులేని నగరము కావచ్చు. "స్థలాభోగం శిలాభోగం" ఎప్పు డెట్లుండగలదో ఎరి కెరుక? ఏ శిల శివలింగమై లోకపూజిత మవుతుందో చెప్పలేము. బెస్తవాండ్లున్న ఒక కోస్తాపల్లె మద్రాసుమహానగరంఅవుతుందని ఆంగ్లేయులు కూడా అనుకోలేదు. వారికి దానమిచ్చిన శ్రీరంగనాయకుడు కూడా ఆ ఊరు తనపేరు లేకుండా పెరిగి పెద్దదవు తుందని కలలోనైనా తలపోయలేదు.

ఆంధ్రరాష్ట్రంలో చేరుతుందన్న మద్రాసు మన త్రాసులో బరువై బస్సులో చోటులేని ప్యాసెంజరు వలె ఆంధ్ర రాష్ట్రంలో చేరక నిలిచిపోయింది.

ఆంధ్రరాష్ట్రరథం బయలుదేరింది. కొత్త రథచక్రములు కిర్రుకర్రుమంటూ బయలు దేరినాయి. ఇది అవకతవక బండి యని చవుకచేసి పల్కినవారు పలువురు కలరు. కాని, యీ అకటా వికట శకటమునకు యిరుసు గట్టిదైనా, ఆ యిరుసున కందెన పెట్టక కదలదనే మాట నిజము గనుక, దానిని తుంగభద్రాతీరమున కందెనవోలుకు (కర్నూలుకు) చేర్పించారు.

తుంగభద్ర దాటవలసిన బండ్లకు యీ కందెనవోలులో కందెన పెట్టుటవల్లనే ఇది కందెనవోలను పేరు గడించినది. నేటి ఆంధ్రరాష్ట్ర రథము కూడ కందెనవోలు చేరడం సహజం. ఇది నిజం అని నిజాము వాసులు విశాలాంధ్ర కీవిజయరథము వెంచే యగోరుచున్నారు.

కాకతీయ సామ్రాజ్యపీఠము ఓరుగల్లు. అదే ఏకశిలా నగరము. అంతకు ముందు దాని ప్రక్కనున్న హనుమకొండ రాజ ధాని. నైజాము రాజ్యంలోని ఔరంగబాదు వద్దనున్న అజంతా కొండగుహలలోని చిత్ర కళలోని ఆంధ్రుల జీవకళ రెండువేల ఏండ్ల నాటి శాతవాహన చక్రవర్తుల అప్రతిమాన ప్రతిభా చిహ్నం. గుంటూరు జిల్లాలోని నాగార్జున కొండవద్దనున్న బౌద్ధ స్తూప శిల్ప కళ ఇక్ష్వాకుచక్రవర్తులనాటి ఆంధ్రచైతన్య నైపుణ్యపుణ్యము. అజంతాకొండలు, నాగా ర్జున కొండ, హంపీ నగరగిరులు, ఉదయ గిరి, శ్రీగిరి, భద్రగిరి, చంద్రగిరి, కొండవీడు, హనుమకొండ, వినుకొండ, కోర్కొండ, గోల్కొండ, ఇవన్నీ మన ప్రాచీనాంధ్రా ఖండవైభవానికి కొండగుర్తులు - ఇవి -

"ప్రాచీనాంధ్రమహాయశోవిభవ
సౌభాగ్యోచ్చ శైలాగ్రముల్"

ఆంధ్రదేశ పటము కాలమూర్తికి జూద మాడే పలక అయింది. ఆంధ్రులను తిరిగి యీ పలక మీది పావులవలె ప్రయోగించి వారికీ నవ్యాంధ్రరాష్ట్రప్రభుత్వమును కాల మూర్తి ప్రసాదించుచున్నాడు. అటు వంటి "కాలమూర్తికి నమస్కారంబు సత్కీర్తికిన్." ఆంధ్రుల విజయ రథమునకు సారథియై సమర్థుడై విజయసారథి వలె ప్రకాశించుచున్నాడు మన ప్రభుత్వ నాయకుడు. అతడు నూత్న పథకముల ప్రవీణుడై ప్రజాహృదయ వీథుల తన రథ మును నడిపించవలసియున్నది. మాతృదేశభక్తితో, యీ రథమును నడిపిం చెడి నాయకుడే సకలాంధ్రలోక శుభ దాయకుడగును. కాలమూర్తి కిది క్రీడ. కాని మన మాతృదేశభక్తియే మనకు ఓడ. మన నాయకుడే మనకు తోడునీడ.

"ఆపద గడవం బెట్టగ
నోపి శుభం బైనదాని నొనగూర్పగ మూ
కీ పుట్టువునం దాంధ్ర
క్ష్మాపాలురు నిన్ను జూపి
జనిరి మహాత్మా!"

అని నేటి మన ఆంధ్రనాయకుని అఖి లాంధ్రలోకం శిరసావహించాలి.

వందేమాతరం!
ఆంధ్రమాతకీ జై!! ★



## రాష్ట్రవిత్తవ్యం

(౩-వ పేజి తరువాయి)

కల్పించే సమస్య ఒకటి శైశవావస్థలోనే మన రాష్ట్రానికి తలవనితలంపుగా ప్రకృతి తెచ్చిపెట్టింది. అన్నిటికన్నా ఈ సమస్యా పరిష్కారానికి ప్రాముఖ్యమివ్వవలసివుంది. ఇందులో ఎంతమాత్రమూ సందేహం లేదు. దీనితర్వాత ప్రాముఖ్యమివ్వవలసిన విషయం బియ్యమూ జొన్నల పంటల అభివృద్ధికి అవసరమైన చర్యలు తీసుకోవడం. అందరికీ ఆహారమైన ధాన్యం చౌకగానూ, సులువు గానూ లభ్యంకావడంమీదనే ప్రజాబాహు ళ్యంయొక్క సర్వతోముఖ సౌభాగ్యం ఆధారపడి వుంటుంది.

మనము ఇప్పుడు చాలా సమస్యలను ఎదుర్కొనవలసియున్నాము. బొత్తిగా డబ్బులేకుండానే మనరాష్ట్రం ప్రారంభ మవుతున్నది. ఆమాటకువస్తే, నూతన ఆంధ్ర రాష్ట్రమూ, పరిశిష్ట రాష్ట్రమూ కూడా గల్లాపెట్టెలలో చిల్లిగవ్వ అయినా లేకుం డానే, అపారమైన అప్పులతో పరిపాలన వ్యవహారాలు సాగింపవలసి వున్నది. ప్రజ లపై పన్నులు వేయడంతప్ప డబ్బు సంపా దించడానికి మనకు మార్గాంతరం లేదు. కాని ఇప్పటికే ఈ పన్నులవిధింపు తలమునకలయ్యే స్థితికి వచ్చింది. కాబట్టి మనం ఉత్సాహం తోనూ, రాష్ట్రాభిమానంతోనూ వేరు మార్గా లను అన్వేషించి డబ్బులేనిలోటును సర్దు బాటు చేసుకోవాలి. అదృష్టవశాత్తూ ఆ ఉత్సాహానికీ, రాష్ట్రాభిమానానికీ మనలో కొరతలేదు.

కేంద్రప్రభుత్వంకూడ తనపాత్ర తాను నిర్వహించవలసివుంది. ఏమిచేస్తారో చూస్తా మన్న ధోరణిలో వారుండరాదు. నూతన రాష్ట్రాభ్యుదయ సాధనకు ఆంధ్రులు గావించే కృషికి కేంద్రప్రభుత్వం తనకృషిని కూడా జోడించాలి. ఆంధ్రరాష్ట్రం భారత దేశం మొత్తానికీ చెందింది. ఈప్రాంతం అభివృద్ధికి ప్లానింగుకమిషనువారు ఆట్టే ఏమంత అవకాశం కల్పించలేదు. వారు కూడా తమ సూచనలను మార్చుకోవాలి.

ఇకమీదట ఆంధ్రులందరూ-అధికారులు అనధికారులు కూడా - విశాలాంధ్రకోసం కలసి కట్టుగా పనిచేయాలి. విశాలాంధ్ర నిర్మాణం అయితే హైద్రాబాదు మనకు సహజమైన రాజధాని అవుతుంది. అప్పుడు మన ఆంధ్రరాష్ట్రం దేశంలోని యావత్తు రాష్ట్రాలలోనూ మహాప్రబలమైన రాష్ట్రంగా తయారవుతుంది. ★

